Best Compliments

ON THE EVE OF CENTURY ISSUE
CELEBRATIONS OF 'SREE VANI'
FROM

* * *
* *
*

**RATHNAM RESIDENTIAL JUNIOR COLLEGE**
**RATHNAM RESIDENTIAL HIGH SCHOOL**
**RATHNAM MAHILA KALASALA**
**RATHNAM COACHING CENTRE (EAMCET)**

*
* *
*

RATHNAM NAGAR, PIDATHAPOLUR
NELLORE - 524 316

*
* *
* * *

**Phones :**
23602
25473

**K.V. RATHNAM**
Director
HARINADHA PURAM
NELLORE - 524 003

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు




ఆంధ్రప్రదేశ్ సంస్కృతికి
నిలువుటద్దాలు ఆప్కో చేనేతలు

# కొత్త రుచులు

# ఆప్కో చేనేతలు

విశిష్టమైన రూపకల్పనల్లో నాణ్యమైన చేతి అద్దకపు అద్భుతాలు
ఈ తరుణంలో

మీ అభిరుచులకి అనుగుణంగా ఎన్నెన్నో రకాలు
అధునాతనమైన నేతల్లో సాంప్రదాయపు సొంపుల్లో కళ్ళు జిగేలు మనిపిస్తాయి.

అన్ని సందర్భాలలో సరిపోయే సరికొత్త రకాల్లో ఆప్కో చేనేతలు.

అపూర్వ కళాఖండాలను బోలు గుంటూరు, గద్వాల, వెంకటగిరి జరీ చీరలు.

సిద్దిపేట, ఉప్పాడ, కొత్తపల్లి, బుటా చీరెలు, పుట్టపాక, నారాయణపేట, ధర్మవరం,
పోచంపల్లి టై అండ్ డై చీరెలు, దుప్పట్లు, తువ్వాళ్ళు, లుంగీలు ధోవతులు
మరెన్నో చేనేతలు.

సామాన్య కుటుంబీకులకు పనికివచ్చే జనతా చీరెలు, ధోవతులు
చౌక ధరలలో
కంటికింపైన డిజైన్‌లలో పాలియెస్టర్ చొక్కాలు
మీకు దగ్గరలోగల

## ఆప్కో ఫ్యాబ్రిక్స్

విక్రయశాలను నేడే దర్శించండి

"సులభ వాయిదాలపై అరువు సౌకర్యం గలదు"

**ది ఆంధ్రప్రదేశ్ స్టేట్ హ్యాండ్లూమ్ వీవర్స్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్.**
**హైదరాబాదు - 500 029**

*Best Compliments to*

*'Sree Vani' Sata Sanchika*

# Amaravati Residential College

# &

# Amaravati
# Mahila Residential College

**5/2, Chandramouli Nagar**

**G U N T U R** - 522 007

Phones: 50413, 22077

DIRECTOR

*K. V. Seshagiri Rao*

ఫోన్ : 38



# శ్యాంప్రసాద్
# వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్ సొసైటీ లిమిటెడ్

**No. H. W. 7**

**పోలవరం - 521 162**

గూడూరు మండలం, కృష్ణాజిల్లా

స్త్రీల సౌందర్యమును ఇనుమడింపజేసే సరికొత్త డిజైనులలో
మావద్ద 80 నెంబరు గల జరీ మరియు T. D. పాలిసర్ పేటు బుటా చీరలు
సరసమైన ధరలకు లభించును.

* నాణ్యతకు మా ప్రత్యేకత *

నాణ్యత గల బుటా చీరల కొరకు మా సంఘమును సంప్రదించండి.

**పుట్ల కోట వీరభద్రుడు**
మేనేజరు

**బూసం శ్యామల సుబ్రహ్మణ్యం**
ప్రెసిడెంటు

**కారుపర్తి కోట మల్లికార్జునుడు**
వైస్ ప్రెసిడెంటు

* డైరెక్టర్సు *

బులసర మార్కండేయుడు
యర్రా సీతాపతిరావు
పిచ్చుక నవరత్నం
పిచ్చుక కోట నాగయ్య
పేర్నేడి శ్యామల సుబ్రహ్మణ్యం
పిచ్చుక ||శ్రీ|| దుర్గాంబ
కటకం జానకిరామయ్య




Phone : 31272

# PRASANTH

# Boys Residential College
# Mahila Residential College
# Residential School (Co-Education)

**Stambala Garuvu**
**G U N T U R - 522 006**

DIRECTOR
O. RAJENDRA PRASAD
M.Sc., M.Ed.

PRINCIPAL
Dr. O. VIJAYASRI
B.Sc., M.A., Ph.D.

వ్యవస్థాపక డైరక్టరైన శ్రీ కోనేరు రామచంద్రరావుగారి పర్యవేక్షణలో నడుపబడుచున్న "శ్రీవాణీ విద్యా సంస్థల" మూడింటిలో రెండు విద్యా సంస్థలు "రజతోత్సవ వేడుకలు" 21-2-1993 తేదీన జరుపుకొని మంత్రుల - ప్రజల ప్రశంసలు పొందుట, ప్రయివేటు విద్యారంగమునకే గర్వకారణము !!

స్థాపితం : 1967 సం॥ ఫోన్స్ 77873, 75229

## శ్రీవాణీ నికేతన్ (రెసిడెన్షియల్-నాన్ రెసిడెన్షియల్)

సూర్యారావుపేట - విజయవాడ - 2

6 వ తరగతి నుండి 10 వ తరగతి వరకు ఇంగ్లీషు - తెలుగు మీడియాలలో శిక్షణ !!

గమనిక :- విద్యార్థులు సెంట్రల్ సిలబస్‌తో 6, 7, 8, 9 తరగతులు చదివి - తదుపరి చదువులు కొనసాగించలేని స్థితిలో వున్నచో - స్టేట్ సిలబస్‌లో జూ॥ 10 వ తరగతి, సీ॥ 10 తరగతులలో చేర్చుకొని - ఉ॥ 8 గం॥ల నుండి సా॥ 6 గం॥ల వరకు ప్రత్యేక శిక్షణ యిచ్చుచున్న ఏకైక ట్యుటోరియల్ విద్యా సంస్థ !!

స్థాపితం : 1968 సం॥ ఫోన్ : 73258

## శ్రీవాణీ బాల విద్యాలయము

సూర్యారావుపేట - విజయవాడ - 2

- తెలుగు మీడియం మాత్రమే !!
- నర్సరీ నుండి 10 వ తరగతి వరకు శిక్షణ !
- 1 నుండి 7 వ తరగతి వరకు ప్రభుత్వ గుర్తింపు కలదు !
- 7, 10 తరగతులలో నాటి నుండి నేటి వరకు 100% పరీక్ష ఫలితములు !

స్థాపితం : 1980 సం॥ ఫోన్ : 63622

## శ్రీవాణీ పబ్లిక్ స్కూల్

దుర్గా అగ్రహారం - విజయవాడ - 2

- ఇంగ్లీషు మీడియం మాత్రమే !!
- L K G. నుండి Xth క్లాసు వరకు శిక్షణ !
- 7 వ తరగతిలో 1985 సం॥ నుండి, 10 వ తరగతిలో 1991 సం॥ నుండి 100% ప్రథమ శ్రేణి పరీక్ష ఫలితాలు పొందుచున్న ఏకైక సంస్థ !!

వ్యవస్థాపక డైరెక్టర్ : కోనేరు రామచంద్రరావు

సూపరింటెండెంటు
యస్. సీతారామమ్మ B. A., Litt.
(Retired R. D. D. P. I.)

ప్రిన్సిపాల్
జి. నాగరత్నమ్మ B. A. B. T.,
(Retired Dy. D. E. O.)

# శ్రీ వాణి జీవిత సభ్యులు



శ్రీ తాటికొండ శంకరరావు
విశ్వభారతి విద్యాలయం
మచిలీపట్నం



శ్రీ రాళ్లబండి రాజారాం
ఆఫీసర్, ఆంధ్రాబ్యాంక్
మచిలీపట్నం



శ్రీమతి తాడేపల్లి అనసూయాశాస్త్రి
పంజాగుట్ట, హైదాబాద్



శ్రీ శలంకాయల పుల్లేశ్వరరావు
మోటూరు,కృష్ణాజిల్లా



శ్రీ అన్నవరపు శోభనాద్రిరావు (రాజా)
రాజా జ్యూయలరి మార్టు
మచిలీపట్నం



శ్రీమతి & శ్రీ గంధి జోగారావు
నర్సీపట్నం, విశాఖజిల్లా



శ్రీ వక్కపట్ల బాబూరావు
Ex. సమితి ప్రెసిడెంటు
వక్కపట్లవారిపాలెం, కృష్ణాజిల్లా



**Dr. D. KAMALAKARA RAO**
HANAMA KONDA



శ్రీ గర్రె రామమూర్తి
శ్రీమతి గర్రె వెంకటలక్ష్మి
నకరెకల్, నల్గొండజిల్లా

శ్రీవాణి శతసంచిక సందర్భమున శుభాకాంక్షలు ఏప్రియల్ 1993

# శ్రీ వాణి జీవిత సభ్యులు



శ్రీ నిశ్శంకరరావు వెంకటరత్నం
Ex. Speaker, A.P. Assembly
గుంటూరు



శ్రీమతి & శ్రీ తుర్లపాటి శ్యామమోహనరావు
నెహ్రూనగర్, నందిగామ
కృష్ణాజిల్లా



**Dr. Vankayala Srinivasa Rao**
Eye Specialist
MACHILIPATNAM



**Sri K. Ramesh**
Correspondent
Krishnaveni I.T.I
MACHILIPATNAM



**Sri P.L. Ganapathi Rao,** B.A
MACHILIPATNAM



**Sri T.K.V. K. Chary**
Principal
S.V Public School
MACHILIPATNAM



**Sri K.S.V. Krishna Rao**
Indra Silks
MACHILIPATNAM



**Sri C. Seshacharyulu (Appaji)**
B.Com., F.C A
Chartered Accountant
MACHILIPATNAM



**Sri Konda Venkata Durgaiah**
Teak wood contractor
Sironcha, MAHARASTRA

శ్రీవాణి శతసంచిక సందర్భమున శుభాకాంక్షలు ఏప్రియల్ 1993

# శ్రీ వాణి జీవిత సభ్యులు



**Sri Kallam Mohan Reddy**
Executive Director
Kallam Agro Product
GUNTUR



శ్రీ పసుమర్తి మంగేశ్వరరావు
పోడూరు
పశ్చిమగోదావరి జిల్లా



శ్రీ వై.వి.ఎన్.బి. కుటుంబరావు
మేడూరు, కృష్ణా జిల్లా.



శ్రీ వై. బ్రహ్మయ్య M.D.
హోటల్ ద్వారకా (ప్రై) లి.
మచిలీపట్నం



**Ln. U.T. Rao**
VISAKHAPATNAM



**Sri M. Venkateswara Rao**
Principal, A.T. College
VISAKHAPATNAM



**Sri N. Visweswara Rao**
Principal, Rosary Convent
VISAKHAPATNAM



**Sri D.V. Subba Rao**
Ex. Mayor
VISAKHAPATNAM



శ్రీ బాదం రాములు
శ్రీమతి బాదం బాలసుబ్బమ్మ
కంభం, ప్రకాశం జిల్లా

శ్రీవాణి శతసంచిక సందర్భమున శుభాకాంక్షలు ఏప్రియల్ 1993

# శ్రీ వాణి జీవిత సభ్యులు



శ్రీ మిర్యాల సీతారామారావు
నూజివీడు,కృష్ణాజిల్లా



శ్రీ గొల్లా నరసింహారావు
ముదిగొండ
ఖమ్మంజిల్లా



**Sri K.V.S. Ramana Murty**
Advocate
**Smt. Kollipara Dhana Laxmi**
MACHILIPATNAM



**Sri V.D.V. Sri Hari Rao**
Correspondent
Little Flower Convent
MACHILIPATNAM



**Sri V. Sanyasi Raju**
Advocate & Notary
MACHILIPATNAM



**Sri T. Madhusudhana Rao**
Principal
S.S B. Convent
PEDANA Krishna District



**Sri M. Subba Rao**
Principal
Vijaya Convent
Machilipatnam



**Sri Singaraju Govardhan**
Principal
Sarada Convent
Machilipatnam



**Sri Kakaraparti Venkateswarlu**
Development officer
L I C of India
CHIRALA

*శ్రీవాణి శతసంచిక సందర్భమున శుభాకాంక్షలు ఏప్రియల్ 1993*

శ్రీవాణి సాంస్కృతిక మాస పత్రిక
సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

# విషయ సూచిక

ఏప్రియల్ 1993
సంపుటి 9
సంచిక 4

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట
మచిలీపట్నం 521 001
ఫోన్ : 2818

విడిప్రతి :రు. 15/-
సం. చందా రు. 48/-
4 సం. చందా రు. 175/-
జీవిత సభ్యత్వం రు. 600/-
పోషకులు రు. 1116/-
cheques & Drafts should be drawn infavour of Sree Vavi, Monthly MACHILIPATNAM

Edited, Printed & Published by Komaragiri Krishna Mohana Rao

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM



శతసంచిక మహోత్సవ వాణి శ్రీవాణి

# అందరికీ నమస్కరించి

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి దివ్యాశీస్సులతో శ్రేయోభిలాషుల సహాయ సహకారములతో, క్రమం తప్పకుండా ప్రతి నెలా సకాలంలో పాఠకులకు అందించ బడుతూ, వారి ప్రశంసలనందుకుంటూ, శత సంచిక మహోత్సవం జరుపుకొనే స్థాయికి ఎదిగింది "శ్రీవాణి"

శ్రీవాణి ఈనాడు మనరాష్ట్ర పరిధులను దాటి భారతదేశంలోని దాదాపు అన్ని ప్రధాన పట్టణాలలో (జమ్మూ కాశ్మీర్ తప్ప) నివసిస్తున్న తెలుగు వారి వద్దకే గాక, అమెరికా మొదలగు విదేశాలలో నివసిస్తున్న తెలుగు వారి చెంతకు కూడా చేరుకొని వారి ప్రశంసలనందుకుంటున్నది. అంతే గాక రాష్ట్ర స్థాయిలో రెండు పర్యాయములు విశిష్ఠ ఉత్తమ అవార్డులను కూడా అందుకొనినది. ఆధునిక సాహిత్యం పేరుతో నైతిక, ఆధ్యాత్మిక విలువలకు తిలోదకాలిస్తున్న ఈ తరుణంలో, ఎల్లో జర్నలిజం పరవళ్ళు త్రొక్కుతున్న ఈ సమయంలో, సెక్స్ సాహిత్యం విచ్చలవిడిగావిశృంఖలంగా విలయతాండవం చేస్తున్న ఈ దుర్దినాలలో, అర్ధనగ్న దృశ్యాలతో, సినిమా బొమ్మలతో పత్రికలు దర్శనమిస్తున్న ఈ కాలంలో, నవలా సాహిత్యంపై మోజు పెరుగుతున్న ఈ తరుణంలో. డిటెక్టివ్ సాహిత్యం పై అభిరుచి పెంచుకుం టున్న ఈ సంధి సమయంలో వీటన్నింటినీ కాదని కేవలం సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా,విజ్ఞాన విషయములకు మాత్రమే పరిమితమై పత్రికను నడపటం ఒక సాహసమే అయినప్పటికీ, ఆశయ ఆదర్శముల విషయంలో ఏమాత్రం రాజీ పడకుండా గత 8సం. 3 నెలలుగా శ్రీవాణి ని ప్రతినెలా క్రమం తప్పకుండా అందిస్తూ, ఈనాడు శతసంచికను అందించే స్థితికి చేరుకున్నాను. ఇది శ్రీవాణి చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించబడదగిన శుభసమయం. అయితే ఇది నా ప్రతిభ ఏమాత్రం కాదు. నాబోటి ఆర్థిక స్తోమతలేని మధ్యతరగతి కుటుంబీకుడు చేయవలసిన సాహసం అంతకన్నా కాదు. ఈ పత్రికను నడపడానికి అవసరమైన ఆత్మ విశ్వాసమును భగవాన్ బాబా వారే నాకు ప్రసాదించారని నా విశ్వాసం. ఇది వాస్తవం కూడాను.

1985 జనవరిలో శ్రీవాణి ని ప్రారంభించినాను అప్పటినుంచి తెలుగు భాషతో పరిచయం ఉన్న ఎందరో మహానుభావులకు ప్రతి నెలా శ్రీవాణిని పంపుతూ వస్తున్నాను ఎందుకంటే -- వారి పవిత్రమైన హస్తములతో శ్రీవాణిని స్పృశించుతే, వారి ఆశీస్సుల ప్రభావం శ్రీవాణిమీద పడుతుందనే నమ్మకంతో, విశ్వాసంతో ఆ విధంగా చేస్తున్నాను భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారితో ఆనాడు నాకు ఏమాత్రం పరిచయం లేకపోయినప్పటికీ అదే భావంతో శ్రీవాణిని ప్రతినెలా వారికి కూడా పంపటం జరిగేది. శ్రీవాణికి ఆర్థిక సహకారం అందించమని నేనెవరికి లేఖ వ్రాయలేదు. అయినప్పటికీ భగవాన్ బాబా వారు ది. 18-4-1986 న నాకు రు 15 వేల రూపాయల చెక్ పంపుతూ. ఆ లేఖలో " I find you are having Financial troubles in connection with this mgazine. You have involved yourself in Sundry loans also, with this prasadam given herewith -- Fifteen thousand



సుఖాన్ని, సంతోషాన్ని వెలయిచ్చి కొనవచ్చు. బ్రహ్మానందాన్ని కొన లేము.

flowers free yourself from Loans and thereafter, may you, with renewed vigour and joy offer the magazine in time to the people అని వ్రాసినారు. అదిఊహించని సంఘటన.

అప్పటికి నేను శ్రీవాణి నడపటానికి రు 15 వేలు చేతి అప్పులు చేసిన మాట యధార్థం. నేను చేసిన అప్పును తమ దివ్య దృష్టితో చూచి, అంతే మొత్తం పంపటం జరిగింది. వారు ఆశీస్సులు పంపిన నాటి నుంచి అప్పులలో తిరిగి నేను పడకపోవటం విశేషమే. నా దగ్గర డబ్బు నిల్వ లేకపోవచ్చును గాని అప్పులు చేయవలసిన స్థితి మాత్రం ఏర్పడలేదు. నవంబర్ '87 లో శ్రీవాణి ప్రత్యేక సంచికకు సందేశము ఇవ్వమని వేడుకొనగా **"శ్రీవాణి నావాణే గదా ! ఇంకా మరో సందేశం దేనికి?"** అని నవ్వి ఆశీర్వదించి నన్నాశ్చర్య చకితులను గావించారు దివ్యపురుషుల ఆశీస్సుల విలువను వెలగట్టలేము. ధనకనకవస్తు వాహనాదుల కన్నా అత్యంత విలువైనది అమూల్యమైనది అది భగవాన్ బాబా వారి దివ్యాశీస్సుల ప్రభావంతో శ్రీవాణి ఎట్టి విఘ్నములకు లోను కాకుండానిర్విఘ్నంగా నడుస్తూ . . నడుస్తూ . . శత సంచిక స్థాయికి ఎదిగింది నేడు "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు గదా! దైవానుగ్రహం లభించింది గదా యని కృషి చేయకుండా సోమరిగా తయారైతే ఆశించిన ఫలితం చేకూరదు ఎవరి పని వారు చేయాలి. Duty is God అన్నారు బాబా. దానినే వేదవాక్కుగా భావించి శ్రీవాణి నిర్వహణ బాధ్యతను మా కుటుంబ సభ్యులము స్వీకరించాం. ఉద్యోగస్థుల మీద ఆధారపడకుండా అన్ని పనులూ మా కుటుంబ సభ్యులమే స్వయంగా చూచుకుంటూ Devotion తో ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తూ వస్తున్నాం. 'భారతి' లేని లోటును ఈనాడు 'శ్రీవాణి' పూరించినదని ఎంతో మంది కొనియాడుతున్నారు. భగవాన్ బాబా వారి దివ్య సందేశాలతో పాటు ఎందరో మహానుభావుల సందేశాలు, జీవిత చరిత్రలు, పురాణ ఇతిహాస ఘట్టాలను పాఠకులకు అందిస్తున్నందుకు అభినందనలు తెలియ జేస్తున్నారు. వారందరికి నా కృతజ్ఞతాభి వందనలు.

ఈ శుభ సమయంలో ఒక చిన్న మనవి చేయదలచినాను శ్రీవాణిని మెచ్చుకుంటున్నందులకు అభినందనలు తమకు నచ్చిన దానిని తమ వరకే స్వంతం చేసుకోవటం పరిమితం చేసుకోవటం అనేది కూడా ఒక విధమైన స్వార్థమే అవుతుంది. మంచిని పదిమందికి పంచాలి, అందించాలి. అట్టివారికే భగవదానుగ్రహం లభిస్తుంది. శ్రీవాణి మంచి పత్రిక, ఉండవలసిన పత్రిక అని భావించే వారందరూ, ఏమాత్రం అశ్రద్ధ చేయక, ఈ మంచి పత్రికను తమ బంధు మిత్రుల చేతులలోనికి కూడా వెళ్లేందుకు చేసే ప్రయత్నంలో స్వచ్ఛందంగా భాగస్వాములై తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

*"మంచిని గ్రహించండి" "మంచిని పోషించండి" "మంచిని పెంచండి" "పది మందికి పంచండి".*

ధన్యవాదములు, సదా సాయి సేవలో

**కొమరగిరి కృష్ణ మోహనరావు**

సంపాదకులు



రాగద్వేషాలు మనస్సుకు అంటే మాలిన్యాలు, ధర్మాచరణ వల్లే వదులుతాయి.



సి. కోవా

**కామశ్చ కోపానృతలోభ తృష్ణాః**
**నపూర్యతేకో? విషయైః స్స ఏవ**
**కిం దుఃఖమూలం ? మమతాభిధానం ॥**

(కూచిభట్ల చంద్రశేఖర శర్మ

శత్రుత్వంగాని మిత్రత్వంగాని ఒక మనిషి స్వభావం వల్ల ఏర్పడుతుంది. ముఖ్యంగా శత్రువుల్లో మహాశత్రువు లుంటారు. అలాంటి మహాశత్రువుల్లో కూడా అతితీవ్రమైన శత్రువులు కామం, కోపం, అసత్యం, లోభం, తృష్ణ యీ అయిదు. ఈ పంచ శత్రువులకు మించిన వాళ్ళులేరు. వీటివల్ల వంచితులు కాని వారు లేరు. కామం అంటే కోరిక. కోరిక తీరటమనేది వుండదు. కోరికలకు అంతు వుండదు. కోపం అగ్నిలాగా కలవాడినే దహిస్తుంది. పాపకర్మలు చేయిస్తుంది. నిజాన్ని తెలుసుకోనీయదు. తన కోపమే తన శత్రువు. ఇక అసత్య భాషణాన్ని గురించి చెప్పనే అక్కర్లేదు. అంత అధర్మం మరోటి లేదు. అసత్యం మనిషిని అధర్మ మార్గంలో నడిపి నీచుణ్ణి చేస్తుంది. సత్యభాషణం అన్ని ధర్మాల్లోకి చాలా గొప్పదని శ్రుతి కూడా ''సత్యాన్నప్రమదితవ్యం'' అని హెచ్చరిస్తోంది. ఇక లోభం వలన సంకుచిత భావం ఏర్పడుతుంది. సంకుచిత మనస్తత్వం మానవతను ఎదగనీయదు. దానివల్ల పశుధర్మం ప్రవేశిస్తుంది. ఇది పూర్తిగా తమోగుణం. పిచ్చి వ్యామోహమే యీ లోభమౌతుంది. లుబ్ధులకు సత్ఫలితాలు దొరకవు అలాగే మరొకటి తృష్ణ కూడాను. ఇది పేరాస. ''అత్యాశా పరమం దుఃఖం'' అని అంటారు. మిక్కుటమైన దుఃఖానికి కారణమీ తృష్ణ. మనసుకు తృష్ణ లేకుండా చేసుకోవటం చాలా గొప్ప విషయం. ''కురు సద్బుద్ధిం మనసివి తృష్ణాం'' అంటూ ఆచార్య శంకరులు కూడా ప్రబోధించారు. మొత్తానికి కామాదులు అయిదు మనిషికి పరమ శత్రువులని అర్థమైంది కదా! ఈ శత్రువులకు కావలసింది విషయములు. ఆ విషయాలను వాళ్ళకిచ్చేస్తే పీడ వదలి పోతుంది కదా మన జోలికి రారు కదా అని అనుకోకూడదట. ఎందుకంటే విషయాల నుభవిస్తూన్న కొద్దీ వీళ్ళు రెచ్చిపోతారే గాని నశించరు అగ్నిలో ఆజ్యం పోసినట్లే అని గీత కూడా చెప్పింది కదా ఎవరైన కోరిందిచ్చేస్తే అంతటితో వాళ్ళు తృప్తి పడతారు. కాని యీ శత్రువులు విషయాలనప్పచెప్పినా తృప్తి చెందరు. ఇన్ని రకాల దుఃఖాలకుమూలం మమకారమే. ఆ మమకారం వదులుకుంటే ఎలాంటి దుఃఖమూ లేదు

# కృతజ్ఞతలు

**శ్రీవాణి** శత సంచిక ప్రత్యేక సంచికకు సహాయ సహకారములందించిన ప్రకటనదారులకు, రచయితలకు, జీవిత సభ్యులకు, పోషకులకు, చందాదారులకు, పాఠకులకు ఆహ్వాన సంఘ సభ్యులకు మరియు సహృదయంతో శ్రీవాణి కి ఆశీస్సులను పంపిన మహానుభావులకు కృతజ్ఞతాభి వందనలు. ఈ సంచికని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దటానికి కారకులైన శ్రీవాణి ప్రింటర్స్, బృందావన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్సు మరియు ముఖ చిత్ర చిత్రకారుడు బాచికి ప్రత్యేకమైన అభినందనలు. నూతన సంవత్సర శుభాకాంక్షలు. ..... సం. —

*వ్యక్తిలో గల ఔన్నత్యం మేధస్సులో గాక హృదయంలో ఉంటుంది.*

# శ్రీవాణికి ఆశీస్సులు

Sri Sri Jagadguru Sankaracharya Mahasamstanam
Sri sarada Vidya Petham
SRUNGERI

శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారికి నమస్కారములు

మీ శ్రీవాణి పత్రిక వంద నెలలు పూర్తి అగు సందర్భమునందు శతసంచికను వెలువడింప నిశ్చయించినామని వ్రాసితిరి శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల యీ శత సంచిక ఉత్తమ లేఖనములతో కూడి సర్వాంగ సుందరముగ వెలువడుగాక యనియు యీ పత్రిక వలన మీకు ఇతోప్యధికమైన శ్రేయస్సు లభించుగాక యనియు శ్రీ చరణులు ఆశీర్వదించినారు.

**T. Dakshinamurthi**
**(Private Secretary)**

Jagadguru Sri Sankaracharya Swamigal
Srimatam -:- Samsthanam
KANCHEEPURAM-631 502

Dear Sir,

His holiness is much pleased to know that the 100th monthly issue of the cultural periodical, 'SREE VANI' is to be brought out in April 1993.

I am directed to convey to the editor and others connected with the publication of the periodical. His choicest blessings for its continued prosperity.

**P. Neelakantam**

**( Manager )**

*సర్వభూతము లందును దయా సుహృద్భావంబులు కర్తవ్యంబులు.*

Sri Ganapati Sachidananda Avadhoota Datta Peeth Trust (R)
Sri Ganapathi Sachidanada Ashramam
Datta Nagar, MYSORE-570 004

## ఆశీస్సులు

గత సంవత్సరం పైగా శ్రీవాణిని గమనిస్తున్నాను. నైతిక విలువలను, సాహిత్య విలువలను ఏమతూకంగా నడుపుతున్నాడాయన. చాలా సంతోషంగా ఉంది అలాంటి పత్రిక తప్పక అభివృద్ధిలోకి ఇతోధికంగా వస్తుంది.

*"జయ గురుదత్త"*

శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ

Sri Siva Chidanada Bharathi Swami
Sri Siddheswari Peetadhipati
COURTALLAM-627 802

## ఆశీః పూర్వకాభినందనము

"శ్రీవాణి" మాసపత్రికలో ప్రచురింపబడుచున్న వ్యాసములు, కథలు, సత్పురుషుల యుపదేశములు పాశ్చాత్య నాగరికతా వ్యామోహపంకమున మునిగి తేలుచున్న నేటి మన సమాజమునకు ఎంతో ఆవశ్యకములుగా నున్నవనుట నిర్వివాదము. దుమ్ము పడి మలినములై ఆరోగ్య భంగకరములైన తినుబండారములను చిన్నపిల్లలకు అమ్ముకొని జీవించు చిల్లర వ్యాపారులవలె, నేడు చాల పత్రికలు ప్రజల హితమును తలంపక కేవలం ధనార్జన దృష్టితో నీచ శృంగారముతో భయంకర పాపకృత్యముల చిత్రణములతో నిండిన రచనములను జుగుప్సాకరములైన బొమ్మలతో జోడించి యువతీ యువకులను ఆకర్షించి పేరును, ప్రతిష్ఠను, ధనమును సంపాదించుకొనుచు బొజ్జలు పెంచుకొనుచున్నవి. శరీరమును అమ్ముకొని సంపన్నతను పొందుచున్న వ్యభిచార ప్రవృత్తి కంటే ఇది ఏ మాత్రమూ భిన్నము కాదు. అది శరీరవ్యాపారమైనచో ఇది సాహిత్య వ్యాపారము. వ్యభిచారము రెండింటికిని సమానమే. శరీరారోగ్యమును కాపాడవలసిన బాధ్యత వైద్యులపై ఎట్లు ఉన్నదో, అట్లే సమాజము యొక్క మానసికమైన యారోగ్యమును కాపాడవలసిన బాధ్యతపత్రికలపై కలదు. స్వార్థపరులైన కొంతమంది పత్రికాధిపతులు, సంపాదకులు ఈ బాధ్యతకు తిలోదకములను ఇచ్చుచున్న ఈ కాలమున భారతీయ సంస్కృతిని ప్రబోధించుటకు పరిశ్రమించుచున్న మీ పత్రిక ఎంతయో అభినందనీయము. మననిత్య, నైమిత్తిక కర్మలు ఆచారములు ఎంత విజ్ఞానయుక్తములో నిరూపించుటకు ఒక శీర్షికను ఆరంభించుట ఆవశ్యకము. శ్రీదేవి, వాణియు మీకెప్పుడును అభ్యుదయమును కలిగించుచునే యుండును. గిరిజా రూపిణియైన మా రాజరాజేశ్వరి మీకు అనంతమైన ధర్మప్రచారశక్తిని ప్రసాదించు గాక. శత సంచికను ప్రకటించుచున్న "శ్రీవాణి" శత వర్ష ప్రచారమును పొందునుగాక. నారాయణ స్మృతులలో. * * *

శ్రీ శివ చిదానంద భారతీస్వామి



*భౌతికంగా నీవు శూన్యం, ఆధ్యాత్మికంగా అంతా నీవే.*

విశ్వయోగి విశ్వంజీ,
విశ్వమందిరం,
గుంటూరు.

# విశ్వభావన

ఓం శ్రీ సాయిరాం - గురుదేవ దత్త!

"శ్రీవాణి" శత సంచిక ప్రత్యేక సంచికగా మనోహరముగా వెలువడుతున్నదని తెలుసుకొని ఆనందిస్తున్నాను.

"శ్రీవాణి-నా వాణి" అని శ్రీ సత్యసాయిబాబా గారిచే అనిపించుకొని వారి అభిమానమును చూరగొన్న ఈ పత్రిక సముచితమైన రీతిలో మానవతా విలువల పరిరక్షణలో అవిశ్రాంత కృషి సల్పుతున్నది అనుటలో ఎట్టి సంశయమూలేదు. ఆత్మవిశ్వాసము, ఆత్మనిష్ఠ, ఆత్మనిగ్రహము, ఆత్మసంతృప్తి, ఆత్మసందర్శనము ఈ పంచసోపానాల అధిరోహణ క్రమంలో, మానవ కళ్యాణానికి తన కృషి తాను సల్పుతున్నది.

ఈనాడు యావత్ మానవ సమాజం అస్తవ్యస్తమై, అశాంతికి నిలయమై అగ్నిగోళంగా మారింది. నవనాగరికత పేర, పెచ్చు పెరిగిన విశృంఖలత్వం పేర, హద్దులను విస్మరించి, నీతి నియమాలను గాలికి వదిలి మనిషి పతనమవుతున్నాడు. ఎన్నో రీతుల ఎన్నో పేర్లతో మానవ సమాజం విభజింపబడి, అనైక్యతతో, అశాంతితో అల్లాడిపోతుంది. ఎటుచూసినా అశాంతి, అస్తవ్యస్తత. మతము పేర, కులము పేర, దైవం పేర, వర్గాల పేర ఘర్షణలు, రక్తపాతాలు. ధర్మాన్ని ఆచరిస్తున్న వాళ్ళలో గూడ, నా గురువు వేరని, నీ గురువు వేరని, నా మార్గం వేరని, నీ మార్గం వేరని, సంకుచిత భావాలు మనసులో చోటుచేసుకొని, మానవత్వాన్నే ఎక్కిరిస్తున్నాయి.

ఇలాంటి స్థితి నుంచి సమాజాన్ని సంరక్షించటానికి ప్రప్రథమంగా "సమైక్యత" అత్యవసరం. అవతారమూర్తులు, పీఠాధిపతులు, యోగులు, సిద్ధ పురుషులు, మేధావుల సమైక్య, సంఘటిత కృషి ఎంతైనా అవసరం. వీరంతా సమైక్యం కావాలి. వివిధ మతాలలోని సహృదయులు, ధర్మవర్తనులు, మేధావులు మున్ముందుగా సమైక్యమై, సుసంఘటితంగా, ఏక కంఠంతో, ప్రశాంత సమైక్య విజయ శంఖాన్ని పూరించాలి. ప్రతి మనిషి మనసును ప్రశాంతి నిలయంగా మార్చాలి. ప్రతి కుటుంబాన్ని ప్రశాంతి నిలయంగా మార్చాలి. యావత్ సమాజాన్ని ప్రశాంతి నిలయంగా మార్చాలి.

ఈ మహోద్యమంలో శ్రీవాణి తనదైన విశిష్టతను ప్రత్యేకతనూ చాటుకుంటూ సాయివాణిగా, సమైక్యవాణిగా, విశ్వవాణిగా, వేదవాణిగా మహోన్నతమైన స్థితిలో నిలిచి, ప్రశాంత పరిమళాలు వెదజల్లగలదని, ఆశిస్తూ ఆకాంక్షిస్తు, ఆశీర్వదిస్తున్నాను. అమృత హృదయుడు, భక్తిప్రేమ తత్పరుడు, కార్యదక్షుడు, అవతారమూర్తులు, యోగులకు అత్యంత ఆత్మీయుడైన చి॥ కొమరగిరి....... చిరంజీవిగా భవిష్యత్తు ప్రపంచ చరిత్రలో నిల్చిపోవాలని ఆశిస్తూ ఆశీస్సులనందిస్తున్నాను.

విశ్వయోగి విశ్వంజీ



సేవాతత్పరత, త్యాగబుద్ధిలేని ప్రేమ ప్రేమ అనిపించుకోదు.

The Universal Humanitarian Education Trust
Satyanarayanapuram
VIJAYAWADA-520 011

## సందేశం

ఆత్మీయులకు శుభాకాంక్షలు

'శ్రీవాణి' మాసపత్రిక శత సంచిక మహోత్సవాన్ని జరుపుకొంటున్నందుకు సంతోషంగా ఉంది. బాలారిష్టాలను దాటి భగవానుని అనుగ్రహంతో ముందుకు సాగుతున్న ఈ పత్రిక సమాజం యెడల మరింతగా బాధ్యత పడాలని కోరుకొంటూ ఉన్నాను.

పత్రికను నడపడం ఎంత కష్టమో, అనుకొన్న విధంగా దానిని నడపడం అంతకంటే కష్టం. మీ ప్రయత్నానికి ఇప్పుడు అనేక విధాలుగా సాయమందుతోంది. మీరు ఏ సంకల్పంతో ఈ సంచికను ప్రారంభించారో ఆ సంకల్పానికి అనుగుణంగా నిశ్చింతగా సాగిపోండి. అనుకున్నదానిని సాధించే వరకు విశ్రమించకండి! ఆ తొలి సంకల్పాన్ని మరల మరల తలచుకొంటూ ఉండటం, దానికి అనుగుణంగా మనను మనం మలచుకొంటూ ఉండటం ఎంతైనా అవసరం.

నిజానికి ఇలాంటి పత్రికలు మరిన్ని వెలువడవలసిన సమయమిది. సమయానికి అందివచ్చి కావలసినన్ని పత్రికలు లేనిలోటు కూడా ఈ 'శ్రీవాణి' యే తీర్చుటకు ప్రయత్నించ గలదని విశ్వసిస్తున్నాను. అలా జరగాలని ఆకాంక్షిస్తున్నాను.

శుభాకాంక్షలతో

మోపిదేవి కృష్ణస్వామి

Justice Avula Sambasiva Rao
Hyderabad

మిత్రులు కొమరగిరి కృష్ణమోహనరావుగారికి, నమస్కారములు.

"శ్రీవాణి" శత సంచికను 11-4-93 న విడుదల చేయబోతున్నట్లు తెలిసి సంతోషించాను. మనిషి లోని మంచితనాన్ని మానవ లక్షణాలను పెంచడానికి కృషి చేస్తున్న "శ్రీవాణి" కి నా శుభాకాంక్షలు పంపుతున్నాను.

ఇట్లు,

అవుల సాంబశివరావు.



మనసున అంటిన రాగద్వేషాలు వదిలితే జ్ఞానమావిర్భవిస్తుంది.

E. Jagannatha Rao
General Manager
The K. C. P. Limited
VUYYURU-521 165

# సందేశం

"శ్రీవాణి " కి వంద నెలలు నిండిన శుభ సమయంలో సర్వాంగ సుందరంగా, శ్రీ సత్యసాయిబాబాగారి ఆశీస్సులతో ప్రచురిస్తున్న యీ ప్రత్యేక సంచిక సర్వ మానవాళినీ, భారత జాతినీ ముందడుగు వేయిస్తూ విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

అశ్లీల సాహిత్యంతో - సినిమా ఫొటోలతో- దిగజారిన కథలతో, తలా తోకాలేని నవలలతో, సెక్సు విజృంభిస్తున్న రచనలతో, వ్యాపార సరళిలో మన సంస్కృతీ సంప్రదాయాలను మంట కలుపుతూ, ప్రజలను పెడదారి పట్టిస్తున్న యీ తరుణంలో పత్రికా ప్రపంచంలో ఓ వేగుచుక్కగా, జ్ఞానజ్యోతిగా వెలుగుతూ, మన సంప్రదాయాలను జాతీయ జీవ సంపత్తినీ నిల్పుతూ, సమాజాన్ని ముందడుగు వేయిస్తున్న శ్రీవాణి కృషి అభినందనీయమైనది.

శీలముగల చక్కని జాతిని నిర్మించుటకు సంస్కృతి సాంప్రదాయాలు పరి రక్షణ ద్వారా జాతీయ ఔన్నత్యాన్ని నిలిపే ప్రయత్నం చేస్తూ నైతిక విలువలతో కూడిన విజ్ఞానాన్ని ఈ జాతికి అందించాలని శ్రీవాణి చేస్తున్న ప్రయత్నం విజయవంతం కావాలి అభిలషిస్తున్నాను. "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" సర్వ జగత్తు సుప్రతిష్ఠతమై నిలబడటానికి ప్రధాన కారణం ధర్మం "ధ్రియతా యితి ధర్మః" జాతిని సుస్థిరముగా నిలిపి ఉంచునది ధర్మమే. అనువైన ఎన్నో విజ్ఞానదాయకములైన క్రొంగ్రొత్త శీర్షికలతో చదువరులకు తృప్తిని కల్గించుటే కాక, సర్వకళా సంశోభితమై, సర్వజనాకర్షణీయమై, సర్వశ్లాఘనీయంగా ఉన్నది యీ శ్రీవాణి. అటువంటి ధర్మాన్ని ఒక పత్రికారూపంగా, ఒక చిన్ని జ్యోతిని వెలిగించి తన చుట్టూ ఉన్న చీకటిని తొలగించి, ధర్మము, వేదాంతము, మతము, సాహిత్యము, రాజకీయములను ప్రచారం చేస్తున్న యీ పత్రిక జాతికి చాలా అవసరము. ఈ శ్రీవాణి - మంగళకరమైన - శ్రేయం కరమైన వాణి. సనాతనము నుండి ఆధునికము వరకు అన్ని వర్గాలను ఆనందింపజేయగల చక్కటి వ్యాసములతో, సాహితీ, సాంస్కృతిక విలువలతో, సంపూర్ణ మానవునిగా తీర్చి దిద్దటానికనువైన ఎన్నో విజ్ఞాన దాయకములైన క్రొత్త శీర్షికలతో, చదువరులకు తృప్తిని కలిగించుటే కాక సకలా కళా సంభోధితమై సర్వ జనాకర్షణీయమై, సర్వ శ్లాఘనీయముగా ఉన్నది ఈ శ్రీఆవాణి.

పత్రికా నిర్వహణే కష్టంగా ఉన్న యీ దశలో ఇటువంటి పత్రిక నడపటం కష్టమే. అయిననూ సత్యసాయిబాబా వారి అనుగ్రహం ఉన్న ఈ పత్రిక శ్రీ కృష్ణమోహనరావుగారి సంపాదకత్వంలో విజయం సాధిస్తుందనటంలో ఎటువంటి సందేహం లేదు. దీనికి అందరూ తమ వంతు సహకారాన్ని తప్పక అందిస్తారని ఆశిస్తున్నాను.

**ఇంజేటి జగన్నాధరావు.**

జాన మద్ది హనుమచ్ఛాస్త్రి, M.A. (Eng, Tel) B.Ed.
1/1845, గాంధీ నగర్,
కడప 516 004

# శుభాకాంక్షలు

'శ్రీవాణి' ఆంధ్రత్వంతో పాటు భారతీయ ధర్మాన్ని, మానవాభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ వంద సంపుటాలను అధిగమిస్తూ ముందడుగు వేయటం అత్యంత అభినందనీయం.

మనలో జవసత్వాలు నశించాయి. ఆత్మన్యూనతా భావం ఆవరించింది. అట్టి నిరాశా వాతావరణమును భేదించేందుకు జాతిని జాగృతం చేసేందుకు పత్రికలు ప్రధాన సాధనం కావాలి. ఆ సాధనలో 'శ్రీవాణి' భాగస్వామి కావటం సంతోషం

అమృతవాణి, వ్యక్తులూ వ్యక్తిత్వాలూ,పురాణవాణి,ఋషుల చరిత్రలు, భగవాన్ శ్రీ సత్యసాయి సందేశాలు ప్రయోజనాత్మకంగావుంటూ శ్రీవాణికి శ్రీరామరక్షగా వుంటున్నాయి. దీక్షతో పత్రికను నిర్వహిస్తూ విజయపథంలో శ్రీవాణి ని నడుపుతున్న శ్రీకొమరగిరి వారిని హార్ధికంగా అభినందిస్తున్నాను. తెలుగువారిలో ఉత్తమాభిరుచులు అంత రిస్తున్నాయేమో అనిపిస్తుంది. లేకపోతే కొన్ని దశాబ్దాలుగా తెలుగు వాఙ్మయ వికాసానికి, చరిత్రకు ఆకారంగా వెలిగిన 'భారతి' వంటి సాహిత్య మాసపత్రికను మనం పోషించక లేకపోయాం. ఆ లోటును కొంతవరకు 'శ్రీవాణి' పూరిస్తున్నదని నా భావన.

చిన్న పత్రికలలో ఉత్తమ పత్రికగా 'శ్రీవాణి' అవార్డు అందుకోవటం సముచితం. యువతకు, జన సామాన్యానికి విజ్ఞానాన్ని మన సంస్కృతి పట్ల అభిమానాన్ని పరివ్యాప్తం చేయుటకు కృషి చేస్తున్న'శ్రీవాణి' పత్రిక దినదినాభివృద్ధి చెందాలని ఆకాంక్ష.

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

---

C. Vedavathi
Mehdipatnam
Hyderabad-500 028

శ్రీవాణి సంపాదకులు శ్రీ కృష్ణమోహనరావు గారికి, వందనములు

మీరు క్రమం తప్పకుండా ప్రతి నెలా నాకు పంపుతున్న 'శ్రీవాణి' పత్రిక అందుతూనే ఉన్నది. అందుకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను.

ఈనాటి పత్రికల పోటీ రంగంలో, కొన్ని ఆదర్శాలకు పరిమితం చేసుకొని పత్రిక నడపడం ఎంత కష్టమో ఎరుగుదును నేను.

అయినా మీరు ఇప్పటికి వంద మాసాలుగా పత్రికను ప్రచురిస్తూ వచ్చారు 'శత సంచిక' ను కూడా వేయబోతున్నారు. ఇప్పటి వరకూ మీకు ఇంతటి ఆత్మశక్తినీ, విశ్వాసాన్నీ, సంకల్ప నిష్ఠనూ ఇచ్చిన ఆ పరమేశ్వరుడు ఇక ముందున్నూ మీకు అండదండలుగా నిలచి మిమ్ములను ముందుకు నడిపించ గలడని నా నమ్మకం. 'శత సంచిక' కు నా శుభాకాంక్షలు.

**వేదవతి.**

Dr. Acharya Tirumala
Hyderabad

**అంతర్వాణి - శ్రీవాణి !**

జయజయ పత్రికా రమణి! స్వాదు వచస్విని ! దివ్య రూపిణీ !
జయజయ తత్త్వభావ శుభ సంజ్ఞిత వాహిని ! విశ్వమోహినీ !
జయజయ భారతీయ జన జాగృత మానస రమ్య లోచనీ !
జయజయ శ్రీద వాణి ! బుధ సన్నుత ! నీకు చిరాయు రున్నతుల్!!
ఆత్మ విద్యల ప్రాధాన్య మరసి యరసి
హృదయ నైర్మల్య సిద్ధికి పదము నెంచి
సర్వజన చిత్త సంస్కార శాసనముగ
పలుకు "శ్రీవాణి" మెచ్చని పలుకు పలుకె !?!
కలుగుల లోన దూరి భువి కన్నియ గుండెకు గాట్లు వెట్టు
చిట్టెలుకల రీతి నే వెలుగు నెంచని మూర్ఖుల కేమి గాని, యీ
తెలుగుల కొక్క తేజమును తీరిచి దిద్దిన పత్రికా మణీ
వెలుగుము సర్వ శోభల రవి ప్రభవై శతమాన కల్పముల్!!
హర్షాశ్రులు నుతి సేయగ
ఘర్షణలను రూపు మాపు ఘన వాక్య సుధన్
వర్షించుచు "శ్రీవాణీ!"
శీర్షికవై మాకు మనుమ! చిన్మయ గతులన్ !!

ఆశీస్సులతో కవికౌస్తుభ

డాక్టర్. ఆచార్య తిరుమల

సేవాతత్పరత, త్యాగబుద్ధిలేని ప్రేమ ప్రేమ అనిపించుకోదు.

వడలి మందేశ్వరరావు
సైదాబాదు పోస్టు
హైద్రాబాదు - 500 659

శ్రీవాణి పత్రికా సంపాదకులకు - నమస్కారములు.
సమాజం పురోగమించడానికి దాని కొక నాగరికత, ఒక సంస్కృతి అవసర మవుతాయి. నాగరికత మనిషి బాహ్య ప్రవర్తనా విధానాన్ని సరిదిద్దుతే, సంస్కృతి మానవుని అంతస్సును సంస్కరిస్తుంది.
సంస్కృతి తర తరాల నుంచీ వారసత్వంగా వచ్చిన ఒక విలక్షణమైన జాతి మహోదాత్త లక్షణాలనాశ్రయించి ఉంటుంది. ధర్మసంకటం కల్గినప్పుడు శాస్త్రం చెప్పినట్టు నడచుకోవాలట; అందులో సమాధానం దొరకక పోతే తెలిసిన పెద్దలు, న్యాయ విదులు, ధర్మ విదులు - చెప్పినట్టు నడచుకోవాలట; వారు కూడా అందుబాటులో లేకపోతే అంతరాత్మ చెప్పినట్టు నడచుకోవాలట! ఆ అంతరాత్మ ఎల్లవేళలా సరియైన మార్గాన్నే ఉపదేశిస్తుంది. అలా ఉపదేశించడానికి దానికి సంస్కారం తోడ్పడుతుంది. ఈ సంస్కారం కొంత జన్మ వల్లనే సాధించినా, మరి కొంత వ్యక్తి తన జీవితంలో సాధించాలి.
'శ్రీవాణి' పత్రిక మనిషికి ఇట్టి ఉత్తమ సంస్కారాన్ని కల్గించడానికే ఇన్నాళ్ళూ కృషి చేస్తోంది. అందుకేపై పై మెరుగులకు ఆశించక మానవుని అంతస్సును సంస్కరింపబూనుకొంటోంది. దీనికి సహృదయ రచయితల, పాఠకుల, చందాదారుల, పోషకుల సాయం ఎంతైనా అవసరం. శ్రీ సత్యసాయి బాబావారి దివ్యాశీస్సులతో 'శ్రీవాణి' దేశంలో దేశీయమైన సాంస్కృతిక చైతన్యాన్ని కల్గించగలదని ఆశిస్తున్నాను.
'శ్రీవాణి' "శత సంచిక" ఆవిష్కరణ మహోత్సవం దివ్యంగా, దిగ్విజయంగా జరగ గలదని నమ్ముతున్నాను.

మీ
వడలి మందేశ్వరరావు

జామవా
హిల్‌కాలనీ
శ్రీ కృష్ణమోహనరావుగారికి,
నమస్కారములు. మీరు పంపిన లేఖ అందినది. సంతోషము. శ్రీవాణి గురించి నా అభిప్రాయం ప్రచురించడానికి అడిగారు. ప్రచురించ నక్కరలేకుండానే నా అభిప్రాయం వ్రాస్తున్నాను. ఇప్పుడున్న పరిస్థితుల్లో ఒక మాసపత్రిక 100 వ సంచికను వెలువడటానికి దగ్గరలో ఉన్నదంటే గర్వించ దగిన విషయం.
మీ కృషి, సౌజన్యం, పత్రిక నిలబడటానికి కారకాలు అయినవి. అభినందనలు.

మీ
జాషువ



*మనసున అంటిన రాగద్వేషాలు వదిలితే జ్ఞానమావిర్భ విస్తుంది.*

# సత్యమైన మాట శ్రీ సాయి మాట

కొమరగిరి కృష్ణమోహన్ రావు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు చేసే దివ్య ప్రసంగాల ప్రారంభంలోను, మధ్య మధ్యన కొన్ని నీతి పద్యాలుకూడా చెప్పటం పరిపాటి. అవి చాలా అమూల్యమైనవి. సరళంగా, మృదువుగా, మధురంగా, భావగర్భితంగా అందరికీ అర్థమయ్యే రీతిలో ఉంటాయి. భావం ఉన్నతం, భాష సరళం వారి ప్రత్యేకత. వారు చెప్పే నీతి పద్యాలు వేమన, సుమతీ శతకాల పద్యాలను పోలి వుంటాయి. అవి వ్యక్తిని తీర్చి దిద్దేందుకు ఎంతగానో ఉపకరిస్తాయి. సమాజ శ్రేయస్సుకు తోడ్పడుతాయి. విద్య, వినయ, వివేకాదులను పెంపొందింప జేస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే, వాటిని ఆచరణలో పెట్టేవారికి జ్ఞానోదయం అవుతుంది. భగవాన్ బాబావారు అందించిన పద్యాలను కొన్నింటిని కొద్దిపాటి వివరణతో లోగడ శ్రీవాణి సంచికలలో పాఠకులకు అందించ బడ్డాయి. మరి కొన్నింటిని ఈ ప్రత్యేక సంచికలో అందిస్తున్నాను. సహృదయంతో వాటిని స్వీకరించి, అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టి భగవాన్ బాబావారి అనుగ్రహమునకు పాత్రులవుతారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

"పట్టిన దేదియో పట్టనే పట్టితివి
పట్టు నెగ్గెడు దాక అట్టె యుండు
అంతియే కాని మధ్యలో ఆపివేసి
తిరిగి పోవుట భక్తుని దీక్ష కాదు."

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. అసలు ఏదైనా పనిని సాధించాలనుకుంటే ప్రతి వ్యక్తికీ పట్టుదల ఉండితీరాలి. పట్టుదల ఉండాలన్నారు గదా యని చెడ్డపని చేయ తలంచరాదు. మంచిపని, అనగా పదిమందికి ఉపయోగపడే పనిని సాధించడానికి పట్టుదల అత్యవసరం. ముఖ్యంగా భవదానుగ్రహమును సంపాదించే ప్రయత్నంలో పట్టుదల వుండి తీరాలి. అయితే కొంతమంది పట్టుదలతో పని ప్రారంభిస్తారు. సాఫీగా నడిచినంతకాలం ఉత్సాహంగా ముందుకు త్రోసుకొని పోతారు. ఎక్కడైనా అవరోధం ఏర్పడుతే ఆ పనిని మధ్యలోనే ఆపివేస్తారు. దీనిని బాబావారు అంగీకరించరు. 'మధ్యలో ఆపివేసి తిరిగి పోవుట భక్తుని దీక్ష కాదు' అన్నారు బాబా. " Awake, Arise, stop not, till goal is reached" లేవండి! మేల్కొనండి లక్ష్యము సాధించువరకు విశ్రమించకండి!" అన్నారు వివేకానంద. ఇదే భావమును చక్కగా భర్తృహరి ఈ క్రింది పద్యములో వివరించారు.

"ఆరంభించరు నీచమానవులు
విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు
విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్న నిహన్యమాను లగుచున్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్"



భగవత్సాక్షాత్కారం పొందినవాని దృష్టిలో విగ్రహం మృణ్మయం కాదు చిన్మయం.

అనగా అధములు విఘ్నములు కలుగునను భయము చేత అసలు కార్యమునే ఆరంభించరు. మధ్యములు కార్యము ను ప్రారంభింతురు గాని నడుమ విఘ్నములు కలిగినచో దానిని విడిచిపెట్టుదురు ధైర్యశీలాది గుణములు గల ఉత్తములు మాత్రం మాటిమాటికి మధ్యలో విఘ్నములు కలిగినను, తాము ప్రారంభించిన కార్యమును మధ్యలో విడిచిపెట్టి పారిపోరు. లక్ష్యమును సాధించేంతవరకు పట్టుదలతో పోరాడుతారు. విజయమును పొందుతారు కనుక ప్రతి ఒక్కరు అట్టి పట్టుదలతో వ్యవహరించాలి.

"పట్టు పట్టరాదు పట్టి వీడరాదు
పట్టెనేని బిగియ బట్టవలయు
బట్టు విడుట కన్న బరగ జచ్చుట మేలు
విశ్వదాభిరామ వినుర వేమ!"

అనగా అనవసరమైన పట్టుదలలకు పోరాదు. ఒకవేళ ఆ పని మంచిదని తలంచి, దానిని ఏ విధముగానైనా సాధించి తీరాలనే పట్టుదల వహించిన యెడల దానిని విడువరాదు 'దీక్ష వహించి విడుచుట కంటే చచ్చుటే మేలు'' అన్నాడు వేమన. దీనిని బట్టి మనం జీవితంలో తెలుసుకొన వలసిన విషయం ఒకటి ఉన్నది. పూర్వాపరాలు ఆలోచించకుండా, పట్టు పట్టరాదు. వివేకంతో ఆలోచించి పట్టిన పట్టు మధ్యలో విడువరాదు. మధ్యలో విడిచిపెట్టి పలాయనం చిత్తగించేవాడిని ప్రజలు హర్షించరు, భగవంతుని అనుగ్రహం కూడా లభించదు.

"బ్రతికినన్ని నాళ్లు ఫలము లిచ్చుటె కాదు
చచ్చి కూడ చీల్చి యిచ్చు తనువు
త్యాగ భావమునకు తరువులే గురువులు
ఉన్నమాట తెలుపు చున్న మాట."

అని ఒక పర్యాయం బాబా వారు చెప్పారు. త్యాగం కూడా ఒక రకమైన శీలమే. ప్రతి వ్యక్తీ అలవరచుకోవలసిన సద్గుణములలో ప్రధానమైనది ఇది. త్యాగం చేయటమంటే దానం చేయటం, ధర్మం చేయటం అని చాలా మంది భావిస్తుంటారు యిదార్థానికి అదికాదు. మేడ మెట్లలో అత్యున్నతమైన ఆఖరి మెట్టు త్యాగం. సర్వోత్కృష్టమైన, అమిత ప్రియమైన వాటిని సహితం నవ్వుతూ, నవ్వుతూ, ఏ మాత్రం సంకోచించకుండా ఇతరులకు యివ్వగలిన వానినే 'త్యాగి' అంటారు. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మంగా నెంచి, మృత్యువునకు కూడా ఏ మాత్రం భయపడక, ధర్మసంస్థాపనార్థం తన జీవిత సర్వస్వాన్ని సమర్పించుకొనువారే నిజమైన త్యాగశీలురు. ఇతిహాస, పురాణములను పరిశీలిస్తే అట్టి త్యాగశీలురు కోకొల్లలు. శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, దధీచి, కర్ణుడు మొదలైన త్యాగశీలురు ఎందరో కనిపిస్తారు. భారతదేశం త్యాగధనులకు పుట్టినిల్లు ఇక్కడ బాబావారు త్యాగానికి చక్కటి ఉదాహరణ పేర్కొన్నారు. ' త్యాగ భావమునకు తరువులే గురువులు' అన్నారు. చెట్టు ప్రజల నుండి ఎట్టి ప్రతిఫలాన్ని కోరకుండా, కాయలను, పండను యిస్తుంది. చెట్టు ఎండిపోయిన తరువాత వంట చెఱకుగా ఉపయోగపడుతుంది అందుకే'దాన మివ్వని చేయి కన్న ఫలమునిచ్చే చెట్టు మిన్న' అన్నారు. ఇదే భావమును ఈ క్రింది నీతి శ్లోకం చాటుచున్నది

"పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ వహంతి నద్యాః
పరోపకారాయ దుహంతి గావః
పరోపకారాయ సతాం విభూతయః"

అనగా పరోపకారము కొఱకు వృక్షములు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించు చున్నవి పరోపకారము కొఱకు గోవులు పాలను యిచ్చు చున్నవి పరోపకారము కొఱకే సజ్జనుల యొక్క సంపదలు వినియోగపడుతవని అర్థము. వృక్షములు, నదులు, గోవులు, సజనులకు ఎటి స్వార్థమూ ఉండదు ఇతరులకు యివ్వటమే గాని ప్రతిఫలమును ఏ మాత్రం ఆశించవు. (ఆశించరు) అట్టి ఉదార స్వభావమే గనుక వృక్షములకు, నదులకు, పశువులకే

గనుక లేకపోతే మానవ జాతి మనుగడకే ప్రమాదం వాటిల్లి వుండేది. కనుకనే 'తరువులు గురువులు' అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. కనుక మానవుడు ప్రకృతి నుండి ఎంతో నేర్చుకొనవలసినది ఉన్నదనే యదార్థమును గుర్తించాలి.

"అల్పబుద్ధి నెంత నాదరించిన గాని
కీడొనర్చు నెట్టి వాడికైన
విషము నున్న ఫణిని విపరీతముగ బెంచ
కాటు వేయు నెంత ఘనుడినైన."

భగవాన్ బాబావారు అల్పబుద్ధిని చక్కగా వర్ణించారు విశ్వాస ఘాతకుడిని గురించి చెబుతూ సామాన్యంగా 'పాముకు పాలు పోసినట్లు' అని అంటారు. పాముకు ప్రేమతో పాలు పోసి పెంచినప్పటికీ తన సహజ బుద్ధిని ఏదో ఒక సమయంలో ప్రదర్శిస్తుంది. కాటు వేస్తుంది. విషం క్రక్కుతుంది. నిండు ప్రాణాలను తీసివేస్తుంది. అందుకోసమనే 'పగ' యొక్క పరాకాష్టను గురించి ఎవరైనా చెబితే 'పాము పగ' తో వర్ణిస్తారు. ఇక్కడ అల్పబుద్ధి వాడిని పాముతో పోల్చారు బాబా. అల్పబుద్ధి అంటే సంకుచిత మనస్తత్వం. అంతేకాదు మిక్కిలి స్వార్థపరుడు. ఏ మాత్రం ఉదార స్వభావం లేనివాడు. తన కోసం ఎంతటి వాడినైనా, నిర్దాక్షిణ్యంగా సర్వనాశనం చేయటానికి ఏ మాత్రం వెనుకాడని స్వార్థజీవి. ఎవరు ఎట్లా నాశమైనా తాను బాగుంటే చాలునని భావించేవాడు. ఇతరుల బాగును చూచి ఓర్వలేనివాడు. కుత్సిత స్వభావం గలవాడు. చాలా చిన్న మనస్సు గలవాడు. అల్పబుద్ధి గలవాడిని ఒక్కొక్కప్పుడు వర్ణించడానికి మాటలు కూడా చాలవు. పాముతో స్నేహం చేయటం వలన కలిగే ప్రమాదం ఎటువంటిదో, ఇటువంటి అల్పబుద్ధి గలవారితో స్నేహం చేయటం యింకా అంతకన్నా ప్రమాదం. అటువంటి వారివలననే సమాజంలోని నైతికవిలువలు పతన మౌతున్నాయి. ఇదే వాస్తవాన్ని వేమన కూడా వర్ణించాడు.

"అల్పజాతి వాని కధికార మిచ్చిన
దొడ్డ వారినెల్ల దోలి తిరుగు
జెప్పు తినెడి కుక్క చెరకు తీపి నెరుగునా
విశ్వదాభి రామ వినుర వేమ."

అనగా అల్పునకు అదికార మిచ్చినచో మంచి వారిని వెడల గొట్టును. అదే విధంగా చెప్పులను తినే కుక్కకు చెఱకు తీపి ఏమి ఎరుగును? అని అర్థము ఇక్కడ'అల్పజాతి' అనగానే కొందరు కులప్రసక్తి తీసుకొని వస్తున్నారు. అది సరియైన నిర్వచనం కాదు. అల్పబుద్ధి అని చెప్పుకోవటం సరియైనది. అల్పబుద్ధి గలవారు ఏ కులంలో అయినా ఉంటారు. అదే విధముగా దొడ్డబుద్ధి గలవారు కూడా అన్ని కులాలలో వుంటారు. ఇక్కడ కులం కాదు ప్రధానం గుణం ప్రధానం. "భగవంతుడు నీ గుణమును చూస్తాడే గాని, నీ కులమును చూడడు. భగవంతుడు నీ నీతిని చూస్తాడే గాని నీ జాతిని చూడడు." అని అన్నారు బాబా భగవంతునికి జాతి, మత, కుల, లింగ భేధాలతో సంబంధం లేదు. మన నుండి భగవంతుడు ఆశించేది గుణం, నీతి. భగవంతుడు మానవునికి మోక్షాన్ని యిచ్చాడు. ఏనుగుకు మోక్షాన్నిచ్చాడు. సర్పానికి, సాలెపురుగుకు మోక్షాన్ని ప్రసాదించాడు. కనుక ప్రతి ఒక్కరూ గుణ సంపత్తిని పెంచుకోవాలి గాని ధన సంపత్తిని కాదు. అందుకోసమనే ఒక పర్యాయం బాబా వారు "Money comes and goes, but Morality comes and grows" అంటూ...

"ధనము వచ్చును పోవును ధరణియందు
నీతి ధర్మాలు నిలుచును నిజముగాను
నీతి ధర్మాలు హృదయాన నింపుకొన్న
సార్థకంబగు మానవజన్మ భువిని"



అనుభవానికి సాటి గురువు విద్యకు సాటి విత్తము లేదు.

అన్నారు బాబా. కనుక నీతి ధర్మాలు మాత్రమే శాశ్వతంగా నిలిచిపోతాయి మానవ జన్మను సార్ధకం చేస్తాయి ధనం అశాశ్వతం, నీతి శాశ్వతం ధనంతో పెరిగే ప్రతిష్ఠ తాత్కాలికం. నీతితో పెరిగే విలువ శాశ్వతం. అశాశ్వతమైన, తాత్కాలికమైన పేరు ప్రతిష్ఠల కోసం ప్రాకులాడక; నీతి, ధర్మాలను హృదయంలో నింపుకొని మానవ జన్మను సార్ధకం గావించుకోవాలి. ధన కనక వస్తువాహనాదులతో మురిసిపోకుండా, వాటిని సద్వినియోగ పరచ ప్రయత్నించాలి. ధనంతో పెట్టెను నింపాలి. నీతితో హృదయాన్ని నింపాలి. నింపిన పెట్టెలోని ధనాన్ని సమాజ శ్రేయస్సుకు సద్వినియోగ పరచాలి. అప్పుడే మానవ జన్మ సార్ధకం."

"తుప్పు పట్టిన దానిని తుడువ వచ్చు
పొట్టు విత్తనములు విడగొట్టవచ్చు
కోరి అజ్ఞానమును తరుమంగవచ్చు
కాని మూర్ఖుని సంధింపకాదు సుమ్మి"

అన్నారు భగవాన్ బాబావారు. బాగా తుప్పు పట్టిన పాత్రను చింతపండుతో బాగా తోమిన యెడల, నల్లటి తుప్పు పోయి, ధగధగ మెరుస్తుంది పాత్ర. వడ్ల మీదనున్న పై పొట్టును తేలికగా విడగొట్టి, లోనున్న బియ్యంతో అన్నం వండుకొని హాయిగా తినవచ్చును. ప్రయత్నంతో మనిషి లోనున్న అజ్ఞానమును కూడా పారద్రోలవచ్చును గాని మూర్ఖుని మనస్సును మాత్రం మార్చటం దుర్లభం. సామాన్యంగా దొరకని వస్తువులను అతి కష్టంతో సాధించవచ్చును. చేయనలవి గాని కార్యములను కూడా ఏదో విధంగా సాధించవచ్చును గాని మూర్ఖుని చిత్తమును మాత్రం మార్చలేము. ఇదే విషయమును చక్కని ఉదాహరణలతో భర్తృహరి వివరించాడు.

"తివిరి యిసుమున దైలంబు దీయవచ్చు
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చు
దిరికి కుందేటి కొమ్ము సాధించవచ్చు
జేరి మూర్ఖుల మనము రింజింపరాదు"

అనగా కటికి ఇసుక నుండి కూడా, ఏదైనా యంత్ర సహాయముతో కష్టపడి చమురు తీయవచ్చును. ఎండమావుల యందు కూడా నీళ్లు త్రాగవచ్చును అడవులలో తిరిగి తిరిగి ఏదో ఒకరోజున కుందేటి కొమ్మును కూడా సాధించవచ్చును గాని మూర్ఖుని మనస్సును సమాధాన పెట్టుట మాత్రం ఎవరికీ శక్యము కాదని దీని అర్థము ఎంతటి కష్టమైన, అసాధ్యమైన పనిని కూడా ధైర్యంతో పట్టుదలతో, వివేకంతో సాధించవచ్చును గాని, మూర్ఖుని మనస్సును మాత్రం మార్చలేము ఇదే వాస్తవమును ఈ క్రింది రెండు పద్యాలలో వేమన చక్కగా వర్ణించాడు

"ఎద్దు కైనగాని యేడాది తెల్పిన
మాట దెలిసి నడుచు మర్మమెరిగి
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన
విశ్వదాభి రామ వినుర వేమ".

"ఎలుక తోలు దెచ్చి యేడాది యుతికిన
నలుపు నలుపే గాని తెలుపు రాదు
కొయ్య బొమ్మ దెచ్చి కొట్టిన బలుకదు
విశ్వదాభి రామ వినుర వేమ".

అనగా పశు జాతికి చెందిన మాటలు రాని ఎద్దు కయినను ఒక సంవత్సరం పాటు మాటలు చెబితే గ్రహించి యజమాని చెప్పినట్లు నడుచుకుంటుంది గాని మూర్ఖునికి ముప్పది సంవత్సరాలు చెప్పినా నేర్చుకొనలేడు. ఎలుక తోలును తెచ్చి ఏడాది పాటు ఉతికినా అది తెలుపురాదు. కర్ర బొమ్మను తెచ్చి ఎంత కొట్టినా అది పలుకదు. అదే విధంగా మూర్ఖులకు ఎంత హితబోధ చేసినా ప్రయోజనం ఉండదు. కనుకనే మూర్ఖునికి మూడు ఆమడల దూరం ఉండాలంటారు. మన పెద్దలు ఈ భూ ప్రపంచంలో దేనినైనా సాధించవచ్చును ఎవరినైనా మార్చవచ్చును గాని మూర్ఖుని మాత్రం మార్చలేము.



అహంకారం ఉన్నంత వరకు ఆత్మ జ్ఞానం లభించదు.

*With best compliments from*



# MEDA NARASIMHULU & CO.,

ENGINEERS & CONTRACTORS

OFFICE :
H No. 6-3-609/161
Anandnagar Colony,
Khairatabad,
HYDERABAD - 500 004

Phones : 224320
33795

---

*Bhagavan Sri Satya Sai Baba Prasanna*

Tel : 'SATYAM'

Phones : 2023 Lodge
2223 Garden
2024 Res
2224 "

# KOTA COMPLEX LODGING

## SRI SAI LAKSHMI GENERAL STORES

Near Bus-Stand,
PRASANTHI NILAYAM - 515 134
Anantapur Dist. ( A. P. )

Proprietor : KOTA SATYANARAYANA

శ్రీవాణి శత సంచికకు మా శుభాకాంక్షలు



ఫోన్ : 44

# శ్రీ ఉమాశంకర
# వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ & సేల్ సొసైటీ లిమిటెడ్, నెం. H. W. 9, ఐదుగుళ్లపల్లి

పోలవరం (పోస్టు), గూడూరు మం॥, కృష్ణాజిల్లా

సంఘ మెంబర్లు సంఖ్య : 106

మెంబర్ల షేరు ధనం : రు. 1 61,360

**మావద్ద 80s ఫ్యాన్సీ పేటు, బుటాచీరెలు సరసమైన ధరలకు దొరకును.**

K. S. V. S. గంగాధరరావు
ప్రెశిడెంటు

B. S. S. ప్రసాద్
మేనేజర్

**చేనేతను ప్రోత్సహించండి. గ్రామీణ నిరుద్యోగాన్ని తగ్గించండి.**

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు



# ది దీనదయాళ్ గణేష్
## వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్ సొసైటీ లిమిటెడ్

**No. H W 11**

## పెడన (కృష్ణాజిల్లా)

స్థాపితం: 30-1-1974 సభ్యుల సంఖ్య: 246 షేరు ధనం: 4,10,830/-

మా సంఘమునందు 100s, 80s స్పెషల్ పేటు, ఫ్యాన్సీ, సాదా మరియు స్పెషల్ T. D. పేటు ముస్కు చీరలు తయారగుచున్నవి. సదరు స్టాకునకు మా సంఘమునకు దయచేయ ప్రార్థన.

భట్ట ప్రసాదరావు
వైస్ ప్రెసిడెంటు

కుర్మా సూర్యప్రకాశరావు
ప్రెసిడెంటు

యక్కల కోట సుబ్బారావు
మేనేజరు

డైరెక్టర్సు:

1) వార్త కోటమల్లయ్య
2) పుమ్మిటి కోటసీతారామయ్య
3) పిచ్చుక శాంతారావు
4) గుత్తి కోట బసవయ్య
5) బొట్టు వీరకోట సుబ్రహ్మణ్యం
6) బిళ్ళ సరోజినీ
7) సల్లా నాగేశ్వరమ్మ

**వేసవి తరగతుల ప్రసంగం -13**

# అధ్యాపకులు ఆదర్శజ్యోతులు కావాలి

*భగవాన్ బాబా దివ్య సందేశము*

సద్గుణములు సద్బుద్ధి సత్యనిరతి
భక్తి క్రమశిక్ష కర్తవ్య పాలనములు
నేర్పునదె విద్య విద్యార్థి నేర్వవలయు

విద్యార్థులారా! శరీరమునకు అరిషడ్వర్గములు ఎంత ఆధారమో మనస్సుకు అరిషడ్గుణములు అంత ఆధారము. కామ క్రోధ లోభ మద మాత్సర్యములు దేహము నుండి ఆవిర్భవించేవి. భక్తి, సద్గుణము, సద్బుద్ధి, సత్యనిరతి, క్రమశిక్షణ, కర్తవ్య పాలనము యీ ఆరు మానసమున ఆవిర్భవించాలి విద్యార్థి మనస్సు నుండి ఆవిర్భవించే సద్గుణములు అత్యవసరము మానసిక ప్రవర్తన నుండియే విద్యనభ్యసిస్తున్నాము మనము యీనాడు. మనో నిశ్చలముతో మనోస్థిరత్వము విద్యకు అత్యవసరము. విద్య అనగా క్రమశిక్షణ అని. దేనికి శిక్షణ? మన యింద్రియములకు శిక్షణ. దానిని యిచ్చేవారు ఎవరు ? వారే అధ్యాపకులు. ప్రపంచములో అధ్యాపకులు ఆదర్శ జ్యోతులు అనే విషయము అధ్యాపకులు మరువరాదు. ఆదర్శజ్యోతులు నిరంతరము వెలుగుతూ వుండినప్పుడే విద్యార్థి జ్యోతులను వెలిగించటానికి అవకాశము వుంటుంది. విద్యార్థి జ్యోతులు కేవలము వత్తులతో మాత్రమే వున్నవి. దీనిని అంటించేవాడు, ముట్టించేవాడు, వెలిగించేవాడు అధ్యాపకుడు. కాని యీ జ్యోతిని వెలిగించటానికి అధ్యాపకులనే జ్యోతులు నిరంతరము వెలుగుతూనే వుండాలి. కనుక అధ్యాపకులు విద్యార్థులను తగిన రీతిలో తర్ఫీదు చేసే బాధ్యత అధ్యాపకులపై వున్నది. అధ్యాపకుడు Guide Post వంటివాడు. ఈ Guide Postను Board పై పెట్టివుంటారు. ఈ బోర్డు స్థిరముగా వుండి నప్పుడే ప్రయాణీకులు తాము ఆదర్శముగా తీసుకొని చేరవలసిన గమ్యము సులభముగా చేరుతారు. Guide Post Board అటూ ఇటూ తిరుగుతూ వూగుతున్నప్పుడు యీ ప్రయాణీకులకు తాము చేరవలసిన గమ్యము, నడువవలసిన రోడ్డు తెలియకుండా పోతుంది. తద్వారా ప్రయాణీకులు చాలా అవస్థలకు గురౌతారు. కనుక అధ్యాపకులు స్థిరత్వమును కలిగివుండాలి. విద్యార్థులకు యీ సద్గుణములు బోధించవలెనన్న ఆ షడ్గుణములు అధ్యాపకులందు వుండాలి. అధ్యాపకులలో వుండినప్పుడే విద్యార్థులకు బోధించటానికి వీలవుతుంది. అధ్యాపకులు Water tank వంటి వారు. ఈ Water tankలో సద్బుద్ధి, సద్గుణములు, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ,

> *విద్యార్థులు అధ్యాపకుల ప్రేమపుత్రులు. అసలు బిడ్డలు కామపుత్రులు. ప్రేమపుత్రులను కామపుత్రుల కంటే సన్నిహితం చేసుకోవాలి. అట్టివారినే ఆచార్యుడు అని పిలుస్తారు. అధ్యాపకునకు ఆచార్యునకు చాలా వ్యత్యాస మున్నది. ఆచరించి బోధించేవాడు ఆచార్యుడు. ద్రోణాచార్యుడు తమ కామ పుత్రుడైనఅశ్వథ్థామ కంటే ప్రేమ పుత్రుడైన అర్జునునకు మరింత రహస్యాలు బోధించాడు. కనకనే ద్రోణుని ఆచార్యుడు అని పిలుస్తూ వచ్చారు. కనుక ఉపాధ్యాయులు ఆచార్యులుగా ఉండాలి.*

కర్తవ్య పాలనములు నిండుగ వుండినప్పుడే యీ విద్యార్థి అనే Tap లో అవే సద్గుణములు అక్కడ వస్తూ వుంటాయి. ఈ Tank కు మనము ఎలాంటి నీరు నింపుదుమో Taps లో అలాంటి నీరే వస్తుంది. కనుక విద్యార్థులలో అంతో యింతో లోటు పాట్లు వున్న వంటే కొంతవరకు Teaching లోనే లోటుపాట్లు వున్నాయని గుర్తించాలి. విద్యార్థులు కేవలము కొండలో వుండిన గుండు వంటివారు. కొండలో వున్న బండి వంటివారు. వీరికి అధ్యాపకులనే శిల్పులు, చక్కని రూప కల్పముగా తీర్చిదిద్దాలి. అప్పుడే విద్యార్థులు ఉన్నత ఆదర్శమును అందించేవారుగా తయారౌతారు. ఆ విగ్రహములో యే దోషములు వుండినప్పటికి రాయి దోషము గానీ విగ్రదోషము గానీ కాదు. శిల్పి దోషమే, రాయిగా వుండిన యీ విద్యార్థిహృదయాన్నిచైతన్యవంతమైన రూపంగా తయారు చేయవలెనంటే వారిలో సంస్కారము పరివర్తింప చేయాలి. వీరిలో యిట్టి సంస్కారమును అందించాలనుకుంటే మొట్టమొదట అధ్యాపకులలో యిట్టి సంస్కారము అభివృద్ధి పరచుకోవాలి. అధ్యాపకులందే యిట్టి సంస్కారము లేనప్పుడు విద్యార్థులకు యేమి బోధించగలడు ?

## RESPONSIBILITY - RIGHT

విద్యార్థులు అధ్యాపకులకు ప్రేమ పుత్రులు. ప్రేమ పుత్రులైన విద్యార్థులను చక్కని ఆదర్శవంతమైన విద్యార్థులుగా అధ్యాపకులు తయారు చేయాలి. ఒకవేళ వారియందు కొన్ని కల్పితమైన దోషములేమైనా వుండినప్పుడు అధ్యాపకులకు సర్వహక్కులు వుంటున్నాయి. వారికి చెప్పి సరిచేసే బాధ్యత వారిపై వుంటున్నది. కొన్ని పరిస్థితులందు వారికి శిక్షయిచ్చి రక్షించటానికి తగిన అధికారము వుంటున్నది. కానీ బయట కళాశాలలందు అట్టి శిక్షించేపద్ధతికి విరోధము జరుగుతూ వుండినప్పటికిని మన విద్యా సంస్థ యందు అలాంటి వేమీ జరుగవు కనుక మన విద్యార్థులను కొంతవరకు బుద్ధి చెప్పి సరైన రీతిలో ప్రవేశపెట్టటానికి అధ్యాపకులు తగిన కృషి చేయాలి. మన విద్యా సంస్థలందు అధ్యాపకులుగానీ, విద్యార్థులు గానీ చాలామంచివారే. ముఖ్యముగా యిలాంటి విద్యార్థులు చిక్కటము చాలా అదృష్టము. బయట విద్యార్థి సంస్థలందు యిలాంటి విద్యార్థులు చాలా కరువు ఇట్టి విద్యార్థులను చూచి మనము మనలోవున్న లోటుపాట్లను సరిచేసుకొని అట్టి విద్యార్థులకు ఉత్సాహ ప్రోత్సాహములందించటానికి తగిన కృషి చేయాలి. ముఖ్యముగా అధ్యాపకులందు ఐకమత్యము వుండాలి. ఐకమత్యము చేత సాధించలేనిది ఒక్కటీ లేదు. కనుక యీనాడు అనుకున్నదానిని మనము సాధించలేదనుకుంటే అధ్యాపకులలో కూడను ఐకమత్యము బలహీనముగనే ఉన్నదని చెప్పాలి. దీనిని బలహీనమని చెప్పవచ్చును. లేక వారితో మనము ఎందుకు Interfere (జోక్యం) కావాలి అనే తాత్సారమైన కావచ్చు. ఇది అధ్యాపకులకు సరైన పద్ధతి కాదు ఇది మీ బాధ్యత. కేవలము Responsibilities మాత్రమే దృష్టియందుంచుకోవటంకాదు. Rights కూడా వుండాలి. కేవలము Right కి మాత్రమే Fight చేస్తే ప్రయోజనం లేదు. Responsibilities కూడా వుంటుండాలి. Responsibility, Right అనేది అధ్యాపకులకు రెండు రెక్కల వంటివి. రెండు చక్రముల వంటివి. ఈ రెండింటిని సరైన రీతిలో వుంచుకున్నప్పుడే మానసిక తత్త్వములో సమత్వము ఏర్పడుతుంది కానీ దురదృష్టవశాత్తు ఈనాడు జగత్తునందు Right కు మాత్రమే Fight చేస్తున్నారు కానీ Responsibility ఏమిటి అనే విచారమునుయెవ్వరూ చేయటం లేదు. కనుకనే యిలాంటి అధ్యాపకులు విద్యార్థులను కొంత పెడ మార్గమును పట్టిస్తున్నారు. ఎట్టి అన్నమో అట్టి త్రేనుపు. ఎట్టి పిండో అట్టి రొట్టె. అధ్యాపకులను పురస్కరించు కొనియే విద్యార్థులు మంచి చెడ్డల పరిస్థితిని పొందుతున్నారు

## ప్రేమ పుత్రులు - కామ పుత్రులు

కనుక అధ్యాపకులకైన కొంత బాధ్యత వుంటున్నది. కేవలం బోధించటానికి కాదు వారికి యిచ్చే జీతాలు.ఈ విద్యార్థులను ఆదర్శవంతమైన విద్యార్థులుగాతీర్చిదిద్దే

కోసమని ప్రభుత్వము వీరికి జీతాలు యిస్తోంది ప్రభుత్వము యొక్క దృష్టి యీ విధముగా కాకుండా వుండవచ్చును కానీ మా దృష్టి మాత్రము యీ విధంగా వుంది. పుస్తకాలు చూచి చదువుకోవటం వారు వారు చేసుకోవచ్చు. Prepare కావటం వారి వారి శక్తి సామర్థ్యములపైన వుండవచ్చును. ఇది కాదు ప్రధానము. క్లాసుకు టైముకు వస్తున్నారా లేదా! ఈ క్లాసులో అధ్యాపకులు చెప్పే విషయము భక్తి శ్రద్ధలతో వింటున్నారా లేదా!. వీరు ఎంతవరకు అధ్యాపకులు చెప్పిన దానిని గ్రహించారు? గ్రహించిన దానిని ఎంత వరకు ఆచరణలో పెడుతున్నారు? యిలాంటి చిన్న చిన్న విషయాలను కూడను అధ్యాపకులు గుర్తించాలి. ఏదో మేము ఒక క్లాసు తీసుకోటానికి వచ్చాము. ఆ క్లాసులోLecture చెబుతాం వింటే వింటారు -- పోతే పోతారు అనే లక్ష్యములో ఉపాధ్యాయులు వుండకూడదు. ఇది నిన్ను నీవు ద్రోహం చేసుకున్నట్లవుతుంది. కనుక నీబాధ్యతను నీవు ఉల్లంఘించి నట్లవుతుంది. ప్రతి విషయమునందు పిల్లలను కొంత వరకు గమనించాలి. నీయింటిలో నీ బిడ్డలు సరైన ప్రవర్తనలో లేనప్పుడు నీవెంత బాధ పడతావు ? వారు నీకు కామ పుత్రులు కావచ్చు గానీ వీరు నీకు ప్రేమ పుత్రులు. ఈ ప్రేమపుత్రులను కామపుత్రులకంటె సన్నిహితము చేసుకోవాలి. అట్టివారినే ఆచార్యుడు అని పిలుస్తారు. అధ్యాపకునకు ఆచార్యునకు చాలా వ్యత్యాసము ఉంటున్నది. ఆచరించి బోధించేవాడు ఆచార్యుడు. ద్రోణాచార్యుడు తన కుమారుడైన అశ్వద్ధామను వుల్లంఘించి అర్జునునియొక్క భక్తి శ్రద్ధలను పురస్కరించుకొని అనేక విద్యలు బోధిస్తూవచ్చాడు. తన కామపుత్రుడైన అశ్వత్థామ కంటె ప్రేమ పుత్రుడైన అర్జునునకు మరింత రహస్యాలను బోధిస్తూ వచ్చాడు. కనుకనే అతనిని ఆచార్యుడు అని పిలుస్తూ వచ్చారు. మీరందరు ఆచార్యులుగా వుండాలి.

## Skill - Kill

మానవత్వములో మూడు స్థాయిలు వుంటున్నాయి. మొదటి స్థాయి knowledge తెలివితేటలు. ఈ Knowledge ని ఎప్పుడైతేసరైన స్థాయిలో ఉంచుకుంటామో అప్పుడు జీవితంలో స్థిరత్వము ఏర్పడుతుంది ఈ knowledge ఈనాడు విద్యార్థులందు అమితంగా వుంటున్నది. ఈ knowledge ని మరింతగా అభివృద్ధి చేసుకోవాలంటే రెండవ step knowledge నిskill (నైపుణ్యం) చేయాలి. ఈ

## 'శ్రీవాణి' ఉత్సవం

ఉత్సవం మహోత్సవం మహా మహోత్సవం
శ్రీవాణికి నెఱపనైన శత సంచిక ఉత్సవం
సాంస్కృతిక వైజ్ఞానిక ఆధ్యాత్మిక మాస ప్రతిక
పరితలకు ఆస్త కొలుపు రీతిగాను వినుతికెక్క ఉత్సవం
సాహితీ ప్రియలోకం మెచ్చగాను నచ్చునైన
శిష్టమై విశిష్టమైన పత్రికగా కీర్తిగాంచ ఉత్సవం.
ఆదిలోన హంసపాదు లెన్నెన్నో ఎదురైనా
పాఠకుల ఆదరాన మాసాలవి నూరు నిండ ఉత్సవం
క్లిష్టమైన సమయంలో పుటపర్తి సాయిబాబ
కరుణజేసి నిస్తులమై వర్ధిల్లి విస్తరింప ఉత్సవం.
సత్యసాయి వాక్కులను ప్రతిమాసం పొందుపరచి
అందింపను స్పందించిన, ఆస్తికులు ప్రస్తుతింప
భవితవ్యం బాగుండును సహస్రమాస సంపూర్తికి
అభిమానుల ఆశీస్సులు అందుకోను అదనుగాను
ఉత్సవం

నవ్యకవి' నాదెళ్ల

skill చేసినప్పుడు life చక్కని balance లో వుంటుంది. కానీ యీనాడు తెలివితేటలు అధికంగా వుండినప్పటికిని యీ skill కి బదులు knowledge ని Kill (చంపుట) చేస్తున్నారు. దాని వలన balance తప్పిపోతుంది. knowledge ని ఎట్లా మనం kill చేస్తున్నాం? knowledge కి రూపము లేదే! దీనిని యే విధముగా పట్టి గొంతుకోయటానికి వీలవుతుంది అని మీలో ప్రశ్నించుకోవచ్చు. మన knowledge ని చెడ్డ

*నియమ బద్ధ జీవితానికి కోర్కెలను జయించటం మొదటి మెట్టు అవుతుంది.*

దృష్టిలో ప్రవేశపెడుతున్నాము ? చెడ్డ శ్రవణములో మనం ప్రవేశపెడుతున్నాము. చెడ్డ మాటలలో ప్రవేశపెడుతున్నాము. చెడ్డ చేతులలో ప్రవేశపెడుతున్నాము. చెడ్డ తలంపులలో ప్రవేశపెడుతున్నాము. దాని వలనే knowledge kill అయిపోతున్నాది. ఈ పంచేంద్రియములను చెడ్డ మార్గములో ప్రవేశపెట్టకుండా సక్రమమైన మార్గములో పెట్టినప్పుడు skill అవుతుంది. ఈనాటి విద్యార్థుల లోపల నీతి నిజాయితీలు కోల్పోయి ప్రవర్తన అసహ్యకరమైన ప్రవర్తనలో వున్నారంటే దీనికి కారణం ఏమిటి? ఈ knowledge యీ విధమైన దుర్మార్గములో ప్రవేశపెట్టటమే. కనుక విద్యార్థులు యీరకమైన దానిలో ప్రవేశించినప్పుడు అధ్యాపకులు watch చేయాలి.

## Friend-Devotee

ఒక చిన్న విషయం మీకు చెబుతున్నాను. నేను 11 వ సంవత్సరములో కమలాపురంలో 3rd form చదువుతున్నాను. 11 వ సంవత్సరము 3rd form అంటే 8th class. ఈనాడు 11 వ సంవత్సరములో ఆరవతరగతో, ఐదవ తరగతో చదువుతున్నారు. కానీ నేను అప్పుడు ఎనిమిదవ తరగతిలో వుంటున్నాను. అప్పుడు ఒక టీచరు వుండేవాడు. ఆయన పేరు పేర్రాజారావు. ఆయన విద్యార్థులను ప్రేమగా చూసుకొనేవాడు. అతనేకాదు తమ్మిరాజు అనే యింకొక తెలుగు టీచరు వుండేవాడు. ఇంకొక ఇంగ్లీషు టీచరు వుండేవాడు E. H. Rao అని. ఇంకొక ఇంగ్లీషు టీచరు మహబూబ్‌ఖాన్. యీ టీచర్సు పిల్లలను ఎంత జాగ్రత్తగా చూచుకునే వారంటే అంత జాగ్రత్తగా చూచుకునేవారు. కనుకనే విద్యార్థులకు అధ్యాపకులపైన గొప్ప గౌరవము ప్రీతి వుండేది. అధ్యాపకులంటే అంత ఆనందంగా ప్రీతిగా వుండేవారు. ఆ టీచరు క్లాసుకు వస్తున్నాడంటే అందరి ముఖాలు చాలా విచ్చి వుండేవి. కానీ దానికి తోడు భయం కూడా వుండేది. ప్రేమతోపాటు భయం కూడా ఉండాలి. అందువలనే భగవద్గీత యందు అర్జునా! నీవు నాకు మిత్రుడవు, నీవు నాకు భక్తుడవు, అన్నాడు. నీవు నాకు friend అనుకున్నప్పుడు Devotee అని చెప్పనక్కరలేదు. నీవు నా భక్తుడవు అనుకున్న తరువాత యింక friend అని ఎందుకు చెప్పాలి ? కాదు కాదు యీ రెండు పదములలో వున్న అంతరార్థమును మనం గుర్తించాలి. friend అనగా కొంత స్వాతంత్ర్యము నివ్వటం. ఐతే భక్తుడు అంటే కొంతవరకు అణగి మణగి వుండటం. అనగా వినయ విధేయతలతో వుండటం. స్వేచ్ఛకు తగిన విధంగా వినయ విధేయతలతో వుండాలి. కేవలము స్వేచ్ఛ అనగా యిష్టము వచ్చినట్లు ప్రవర్తించటము కాదు. వినయ విధేయతలు కూడా వుంటుండాలి. పూర్తి స్వేచ్ఛ యిస్తే అధ్యాపకుల తలపైన కూర్చుంటారు. పూర్తి భయం పెడితే కృంగిపోతారు. కనుక యీ రెండింటికి మధ్యస్థాయిలో వుంటే నిమిత్తమై భక్తుడవు, మిత్రుడవు అన్నాడు. అదే విధముగా ఆనాటి అధ్యాపకులందరు ప్రేమకు ప్రేమగాను కఠినముగాను వుండేవారు. విద్యార్థులు యే బజారుకు పోతున్నారు ఎక్కడకు పోతున్నారు యివన్నీ గురువులు విచారిస్తూ వుండేవారు. కేవలము క్లాసురూమునందు మాత్రమే కాదు వారి ప్రవర్తన watch చేయటము. బయట కూడా. మన హాస్టలు నుంచి ప్రశాంతినిలయము వస్తారు. ఈ ప్రశాంతినిలయము వస్తున్నారుగానీ ఎక్కడకు పోతున్నారు. టీచర్సు గమనించటంలేదు. గుంపులో ప్రశాంతి నిలయమునకు వస్తూ కనుపిస్తారు. తరువాత యిండ్లలో తిరుగుతూ వుంటారు. యిది కూడను గుర్తించాలి. ఇది క్రమశిక్షణకు విరుద్ధమైనది. అంతే కాకుండా గురువును మోసం చేసినట్లు అవుతుంది. ఒకనాడు పేర్రాజుగారు ఆనాడు మార్కెట్టుకు వారే వెళ్లి కూరగాయలు అదీ వారే తెచ్చుకునేవారు. నేను ఎప్పుడు తిరిగేది లేదు యిష్టము వచ్చినట్లు. నా విషయం నేను చెప్పుకోటం కాదు. యిది యదార్థము. నాకు తిరగటం అంటే అయిష్టం. అతిగా మాట్లాడటంగానీ, అనవసరంగా బజార్లు తిరగటంగానీ నాకు యిష్టమైనది కాదు. అందువల్లనే నేను ఎప్పుడూ యిలాంటివే చెబుతూ వుంటాను. అదే my life is my message. నేను కమలాపురములో యింకొకరి యింటిలో వుండినప్పుడు అర్జంటు పనిపైన హాస్పటలుకు వెళ్లమన్నారు. హాస్పటలుకు

వెళ్లి నర్సును పిలవమని చెప్పారు. ఈ నర్సును తీసుకురావ టానికి నేను వెళ్లాను. కానీ నాకు యిష్టము లేదు. కానీ యింటి వారి ఆజ్ఞ. వారి యింటిలో వుండినప్పుడు వారి ఆజ్ఞను శిరసావహించాలి. యిలాంటివంతా ఆదర్శంగా నేను నిరూ పించేవాడిని. హాస్పిటలుకు పోయి వస్తుంటే ఆ పేర్రాజుకు నేనంటే యిష్టము. కానీ మార్కెట్టు నుండి వచ్చేటప్పుడు ఎక్కడ చూచాడో ఎలా చూచాడో రెండవ దినము Prayer అయిన తరువాత రాజూ! come అన్నాడు. నిల్చున్నాను. కారణము తెలియకుండా కొట్టేవారు కాదు. కారణం తెలుసుకొని తప్పుంటే కొట్టేవారు. తప్పులేకపోతే సరే అని పంపించే వారు. రాజూ! రా అన్నాడు. ఎందుకు బజార్లో వస్తున్నావు? ఎందుకోసం పోయావు ? సార్ యీ విధంగా యింటివారు చెప్పటం చేత నర్సును పిలవటానికి పోయాను అన్నాను. అప్పుడు బుగ్గ గిల్లి తల నిమిరి good boy, good boy, that is your duty అన్నారు ఆయన. అదే సమయం లోపల రమేష్ వుండేవాడు. నీవు మార్కెట్ లోపల నన్ను చూచి వెనుకకు పోయావు. ఎందుకోసం వచ్చావు ? వాడు జవాబు చెప్పలేదు. కారణంతో పోలేదు వాడు. అకారణంగా పోయాడు. విద్యార్థి యీవిధంగా సందులు గొందులు కుక్కవలె తిరగటానికా ? నీవు కుక్కవా మనిషివా అన్నాడు అందరి ఎదురుగా ఏదో తిట్టాడు సరిపోయింది అంతటితో. మంచి పిల్లవాడని రాజు! యిలా రా అన్నాడు. ఈ రమేష్‌ను చక్కగా రెండు చెంపలు కొట్టు అన్నాడు. నేను ఎట్లా కొట్టేది ? నన్నేమో మెచ్చుకున్నాడు గానీ శిక్ష యిస్తున్నాడు. నేను మెత్తగా యిటూ అటూ అన్నాను. కోపం వచ్చింది పేర్రాజు గారికి. నేను పసుపు పూయమని చెప్పానా అని యీ విధంగా అంటూ నన్ను కొట్టాడు. ఈ విధంగా నీవు కొట్టాలి అన్నాడు. సార్ ! నాకు చేత కాదు మీరే కొట్టండి అన్నాను. మాట మీరినావా అని యింక పన్నెండు దెబ్బలు వానితో కొట్టిం చాడు. అనగా యిలాంటి శిక్షణ లోపల గురువు ఆజ్ఞ మీరి నప్పుడు లేక స్నేహితుని అభిమానముగా చూచినప్పుడు యిలాంటి punishment యిచ్చేవారు. వాడు స్నేహితుడు కావచ్చుగానీ దోషము చేశాడు. స్నేహితుడైనా సరే దోషము చేసిన వానిని కొట్టాలి అనే పాఠము నేర్పటం కోసమని క్లాసులోనే యీ విధంగా చేశాడు. ఈ విధమైన రీతిగా subjects తో బాటు object ను కూడా చూపేవారు. ఈ విధంగా శిక్షణ చేస్తూ వుండటం చేతనే ఆనాటి విద్యార్థులు చక్కగా discipline గా భక్తిశ్రద్ధలతో గురువులపైన గౌరవ మర్యాదలు చూపేవారు. ఒక్కొక్క అధ్యాపకుడు మారిపోయి నప్పుడు ప్రతి పిల్లవాడు కంటినీరు విడిచేవాడు. కేవలం పిల్లలకు అంతప్రేమ వుండాలంటే టీచర్సుకు ఎంత ప్రేమ వుండాలి ? ఈనాడు విద్యార్థులలోను ఆప్రేమ లేదు. అధ్యా పకులలోను ఆప్రేమ లేదు. కారణం ఏమిటి ? మన సంస్థను గురించి కాదు నేను చెప్పేది. general గా చెబుతున్నాను. ఈనాటి బయట ప్రపంచమునందలి విద్యార్థులను cheap గా వుపయోగించుకుంటున్నారు అధ్యాపకులు. ఏయ్ రేపటి దినం ఆదివారం picture కి పోతున్నావా? సార్ ! రోడ్డులో advertisement చూశాను. కొత్త సినిమాలు రేపు పోవాలను కుంటున్నాను అంటాడు. భయం లేకుండా చెబుతాడు. ఐతే నాకూ టిక్కెట్టు తియ్యి. ఈ రకంగా టీచర్సు విద్యార్థులతో మాటలతో సంప్రదించటంచేత గౌరవము కోల్పోతున్నారు. కనుక టీచరు టీచింగులో టీచరుగా వుండాలి. ప్రేమలో ప్రేమగా వుండాలి. డిసిప్లిన్‌లో డిసిప్లిన్‌గా వుండాలి. ఇదంతా అధ్యాపకులపైనే ఆధారపడి వుంటుంది.

## ప్రేమమయం కావాలి

ఇంక విద్యార్థుల యొక్క పరిస్థితి అప్పుడప్పుడు ఏవో పొరపాట్లు జరుగవచ్చు. ఎందుకంటె యీ వయస్సులోపల కండల్లో శక్తి వుంటే కన్నుల్లో పొగరు వస్తుందట. ఈ వయస్సు అలాంటిదట. రక్తము వుడుకుగా ప్రవహిస్తూ వుంటుంది. ఎవరి మాటను లెక్కచేయరు. కానీ ఆ సమయ మునందే మనము సరైన కంట్రోల్ చేయాలి. కొత్త కారు స్పీడ్‌గా పోతుంది. స్పీడ్‌గా పోతుందని మనం స్పీడ్‌గా పోకూడదు. కొత్తకారు కదా అన్నీ కంట్రోల్‌లో వుంటున్నాయని స్పీడ్‌గా పోకూడదు. ఎవరికి ప్రమాదము?

మనకే. కనుక మనము బ్రేకును కూడా వుపయోగ పెట్టాలి. ఈ వయస్సులోపల మనము ఎట్టి పేరును సంపాయించు కుంటామో జీవితమంతా ఆపేరే నిల్చిపోతుంది. విద్యార్థి దశలో యే యొక్క చెడ్డ పేరును తెచ్చుకుంటామో ఎంత గొప్ప వాడైనప్పటికి మాయని మచ్చ మాదిరి నిల్చిపోతుంది. ఇంక స్నేహితుని దగ్గర కూడను యేరీతిగా వుండాలి? హలో! హలో! How are you, How are you. good bye! good bye! యింతటితోనే వుండాలి. అందుకోసమే వేదము నందు ఒక శ్లోకము వుంటున్నాది. స్నేహితుని ప్రేమించుగానీ నమ్మవద్దు. ఈ నమ్మకం చేతనే చెడిపోతున్నారు. మాన వత్వము నందు యీనాడు ఆ నమ్మకము కోల్పోయినారు. ప్రేమించు. నా ఉద్దేశ్యము యేమంటే ప్రేమించటము తప్పే. నమ్మకుండా వుండటం తప్పే మరి యేమి కావాలి ? ప్రేమయే నీవుకా. ప్రేమయే నీవైతే ఎంతమందినైనా ప్రేమిం చవచ్చు. నీవు LOVER అయితే ఒకరిద్దరిని మాత్రమే love చేయవచ్చు. కనుక నీవు love form కావాలి. జీవిత మంతయు ప్రేమమయంగా వుంటుండాలి. అప్పుడు ఎట్టి ద్వేషముగాని, ఎట్టి పొరపాట్లు గానీ రావు. కనుక విద్యార్థులు యీ విషయము లోపల యింద్రియ నిగ్రహము అలవరచుకోవాలి. యిలాంటి యింద్రియ నిగ్రహము వుండాలనుకుంటే steady గా వుంటుండాలి. study for steady చదువు స్థిరత్వము కోస ము. ఈ టంబ్లరులో నీరు వుంది. ఇట్లా అదలిస్తే నీరు యేమై పోతుంది. కదలిపోతుంది. స్థిరంగా పట్టుకో. అందులో వున్న water స్థిరంగా వుంటుంది. ఈ శరీరము ఒక పాత్ర వంటిది. దీనిలో mind water వంటిది. ఈ body steady గా వుంటే Mind steady గా వుంటుంది. క్లాసులో కూర్చుంటారు. కోతుల కంటే హీనంగా తిరుగుతూ వుంటాయి యీ చేతులు. అంతేకాదు యింకా ఎన్నెన్నో చేష్టలు చేస్తారు ఈ కోతి చేష్టలు వుండిన వారికి జీవితములో మంచితనమనేది యేమాత్రము యేర్పడదు. క్లాసులో యింతమంది వుంటున్నారంటే యే మాత్రము కదలిక కనుపించకూడదు. అట్లా వుండాలి. ధ్యాన ములో కూడ అదే పని చేస్తూ వుంటారు. ఈ నాటి వయస్సు యొ ప్రభావమో లేక విద్య యొక్క ప్రభావమో చెప్పటానికి వీలులేదు గానీ కూర్చుంటారు ధ్యానములో. ఇంత పెద్ద దేహముపైన చిన్న దోమ వచ్చి వాలితే ఆ ధ్యానములో కూడను దాన్ని కొట్టేస్తారు. ఈ రకంగా చంచలత్వముతో వుంటే యింక ధ్యానము ఎందుకు చేయాలి? time waste

## శివశక్తి సాయి

సీ || శాంతంబె ప్రభవించె శ్యామల వదనమై
మధుర ప్రశాంతి యే మానసంబు
వాక్కు గంభీర గైర్వాణాంధ్ర గుంభనం
బు ; తలప వేదాంత బోధనంబు
ధర్మంబె నిలువున దనువుగ విలసిల్లె
సత్యంబె యాత్మగా సవదరిల్లె
అభయమ్మె కరములై ఆశీర్వదింపగ
కారుణ్యమయ్యెను కన్నుదోయి

గీ|| యనగ నొప్పుచు శ్రీసాయి అతిశయిల్లె:
కనరె ! ధర్మోద్ధరణ బద్ధ కంకణుండు !
ప్రేమను భువిని మనుగడ పెంచువాడు !
పర్తి "శివశక్తి"; సాయిగ బరగువాడు !!

-- నందూరి భాస్కర శ్రీరామారావు

కదా! ఏమి వచ్చినా సరే నీవు వుండాలి. వాల్మీకిపైన పుట్టలు పుట్టాయి కానీ అంతవరకు మీరు పోనక్కరలేదు. మీరు వాల్మీకులు కాదు. కానీ కొంతవరకునైనా నిగ్రహించుకోవాలి కదా! ఎప్పుడు చూచినా కొంతమంది గోక్కుంటూ వుంటారు. కారణం ఏమిటి? సరిగా స్నానం చేయరు. ఈ స్నానము చేయకపోవటం చేతనే ఆరోగ్యము పాడైపోతున్నది. skin చాలా వరకు యిదైపోతున్నది. మన skin ఒక protection వంటిది. ఈ skin కు muscle కు మధ్య light layer వుంటున్నది. దీని లోపల కొంచెము దోషము వుందంటే skin అంతా పాడైపోతుంది. దీనికి కారణం ఏమిటి? మన



*గమ్యమూ గమనమూ రెండూ ఉత్తమమైనవిగా ఉండాలి.*

energy waste చేయటమే దీనికి కారణము. energy దుర్వి నియోగం చేస్తున్నారు. మనము తిన్న ఆహారమును సద్వి నియోగ పరచటంలేదు. health is wealth ఆరోగ్యమును కూడా మొట్టమొదట మనము చూసుకోవాలి. ఈ విధమైన మార్గములో ఒక ఆదర్శమును నిరూపించాలి.

## హనుమంతుని ఆదర్శం

పిల్లలు my life is my message లోపల కొంత మంది చెప్పారు. కానీ sentence పూర్తి కాలేదు. పుష్పగిరి తిరనాల అని పశువుల జరిగింది. పది దినములు జరుగుతుంది పశువుల సంత. ఈ పశువుల దగ్గరగానీ వాటి నీరు త్రాగే ప్రదేశములో గానీ safety వుండాలనే వుద్దేశ్యముతో కమ లాపురం నుండి SCOUT ను పంపించాలని నిర్ణయించు కున్నారు. నా 8th క్లాసులోపల అందరూ పెద్దగా వుండేవారు జాంబవంతుల మాదిరి. నేనొక్కడనే వామన మూర్తిని. యిప్పుడే యింత ఎత్తు వున్నాను. అప్పుడు చాల తక్కువ. ఆనాడు చదువుకునే వారు చాలా తక్కువ. పెద్ద పెద్ద పంచలు కట్టుకొని, కొప్పులు కట్టుకొని ఆ కాలము అట్లా వుండేది. ఏభై సంవత్సరముల ముందు పెద్ద పెద్ద వారందరు వుంటున్నారు. అలాంటి వారి లోపల scout teacher వచ్చాడు. మీ క్లాసు లోపల ఒకరిని నిర్ణయిస్తున్నాను. Scout Leader కావాలి. నేను అన్ని క్లాసులు వెతికాను. అక్కడ హైస్కూలు కనుక 8th class last. యిప్పుడు 10th class last. ఇందులో రాజూను నేను ఎన్నుకున్నాను అన్నాడు. నేను చెప్పాను 'సార్! వీరంతా చాలా పెద్దపెద్దగా వుంటున్నారు. అసలు వీరి గుంపులో పోతుంటే నేను కనుపించను. అలాంటి పరిస్థితిలో నన్ను ఎన్నుకోటం వలన నేను సరైన రీతిలో జవాబుదారీ చేస్తానో లేదో అన్నాను. నీవు చేయగలవు, చేయగలవు, చేయగలవు అని మూడు సార్లు చెప్పాడు. అప్పుడు నేను ఎంత ఆనందించానో తెలుసా. నా పైన టీచరుకు అంత నమ్మకము వుందని. అదే మనకు సంతోషము. రామాయణములో ఒకటి వున్నది. హనుమంతుని రాముడు పిలచి ' హనుమంతా! సీతాన్వేషణకు నీవు leadership వహించాలి' అన్నాడు. హనుమంతుడు గంతులు వేశాడు. జాంబవంతుడు 'ఓరి పిచ్చివాడా ఎందుకు యిట్లా గంతులు వేస్తున్నావు యిప్పుడు కూడా నీ కోతి చేష్టలు పోలేదా? సీతాన్వేషణ అంటే సాధ్యమైన పని అనుకున్నావా? సముద్రము దాటాలి. లంకలో ప్రవేశించాలి. రాక్షస మధ్యమున తిరగాలి. యిది చాలా 'responsibility' అన్నాడు. నాకు అవన్నీ అక్కరలేదు. శ్రీరాముడు నన్ను ఎన్నుకున్నాడు అదే అదృష్టము అన్నాడు హనుమంతుడు. చూశారా! అతను ఎన్నుకున్నాడు. ఎన్నుకున్నవాడే ఆ శక్తిని యిస్తాడు. అంతేగానీ నా శక్తిని బట్టి యివ్వలేదు. అతని యొక్క విశ్వాసమే నాకు శక్తిని యిస్తుంది. నోరు మూసుకోండి' అన్నాడు. అంత ఆనందించేవాడు హనుమంతుడు Yes Sir! అన్నాను. తరువాత ఒక లిస్టు చదివాడు. ఈ SCOUTలో ప్రతి ఒక్కరికి కాకీ నిక్కరు షర్టు వుండాలి. ఒక విజిల్ వుండాలి. shoes వేసుకోవాలి. కర్ర పట్టుకోవాలి. పెద్ద బెల్టు వేసుకోవాలి. యివన్నీ రేపటి నుండి సంపాయించుకోండి అన్నాడు. నా దగ్గర నయాపైసా లేదు. కానీ డబ్బు లేదని చెప్పకూడదు. మన యింటిగౌరవము మనం నిలబెట్టుకోవాలి. అప్పుడు యేమీ మాట్లాడలేదు నేను. నా యోచన నా Master Plan నేను వేసుకున్నాను.

## విభీషణ శరణాగతి

నా క్లాసు లోపల నా డస్కులో ముగ్గురు పిల్లలు కూర్చునేవారు. ఆ యిద్దరు పిల్లలు ఎలాంటి వారంటే ఒకడు సిరస్తదారు కుమారుడు. ట్రెజరీలో వుండేవాడు. యింకొక పిల్లవాడు చిన్నవాడే. ముగ్గురము మంచి discipline తో వుండేవారము. కానీ వారికి చదువు మాత్రము తలకు ఎక్కలేదు. చాలా మొద్దు రాచ్చిప్పలు.Public exam వచ్చింది. నెంబర్సు వేరువేరు యిచ్చారు. నాది మూడైతే అతనిది మూడు వందలు. ఇంకొకరికి రెండువందల ఎనభై. ఈ విధంగా నెంబర్సు చాలా వ్యత్యాసముగా వున్నాయి ఎవరిపాటుకు వారు వెళ్లాలి ex-



ఎక్కువగా స్వార్థము లేకుండా ఉండడమే అన్ని నీతులలోకి గొప్ప నీతి.

amination కు. మనము యింటినుండి ఒక పేపరు కూడా తీసుకొని పోకూడదు. ద్వారము దగ్గర అన్నీ check చేస్తారు. చేతులు, కాళ్లు అన్నీ. ఎందుకంటే వ్రాసుకుంటారు అక్కడ అని. అంత strict గా వుండేది. అది British Time. తప్పు జరిగిందంటే కొట్టి పంపిస్తారు. అందువలన ప్రతి విద్యార్థి భయంగా వుండి అలాంటివి యేమీ చేయకుండా వుండేవారు. ఈ రమేష్ యింకొక పిల్లవాడు బాధపడుతున్నారు. రాజూ! క్లాసులో మీరు సహాయము చేస్తున్నారు కాబట్టి సరి పోయింది. కానీ పరీక్షలలో యేమీ సహాయము లేదని సాయంకాల సమయము లోపల నేను వున్న యింటికి వచ్చి కాళ్లు పట్టుకున్నాడు. ఈ పరీక్షలలో కనుక మేము పాస్ కాకపోతే మా తల్లితండ్రులు మమ్ములను యింటిలో వుండ నివ్వరు. ఆనాడు తల్లితండ్రులు కూడను అంత ఖచ్చితంగా వుండేవారు. ఆనాడు ఫేలయి యింటికి వస్తే తల్లి get out అని భోజనము పెట్టేది లేదు పోరా. ఎందుకు చదవకుండా ఫేలయినావని తల్లి కూడను ఖండించేది. ఈ విధంగా తల్లి తండ్రులు చాలా శిక్షించేవారు. చాలా మంచి పిల్లలు వారిలో అదృష్టం వచ్చేసింది. అప్పటి నుండి నాలో divinity గుర్తించి సార్ సార్ అనే వారు పాపం. మామూలు public లోపల రాజూ రాజూ అనే వారు. నేను చెప్పాను. నేను చూచుకుం టాను పొమ్మన్నాను. ఇదే విధంగా రామాయణంలో కూడను విభీషణుడు వచ్చి శరణాగతి పొందాడు. కానీ సుగ్రీవుడు, జాంబవంతుడు, "స్వామీ! వీడు రాక్షసుడు. వీడిని యేమాత్రము ప్రవేశింప చేయకూడదు" అన్నారు. నవ్వుతూ చెప్పాడు 'నావాడని ఒకపరి అన ఏవాడైనా ఏలుదు వాని నేను నీవాడు స్వామీ ' అని చెప్పి వస్తే వాడు యే రాక్షసుడైనా అభయమిచ్చాను పొమ్మన్నాడు. అదే విధంగా యీ రమేష్ పిల్లవాడు 'రాజూ మేము నీ పిల్లవారము మమ్ము ఎట్లైనా రక్షించాలని ప్రార్థించారు. నేను చూచుకుంటాను పొమ్మన్నాను. ఐతే ఒక సూక్ష్మమును మాత్రం వారికి చెప్పాను. మీరు వ్రాసినట్టుగా నటించండి. టైము అయిపోతుంది. రెండుగంటలు examination టైము అయిపోయింది. పేపరు పేపరు అని వచ్చేస్తుంటారు. అప్పుడు అందరు లేస్తారు. పోయి ఎక్కడ పెట్టాలి. టీచరు వుండే టేబులుపైన పెట్టాలి. ఐతే ఎవరు పెట్టారో ఎవరు పెట్టలేదో అతను చూడడు. గుంపుల్లో చేరిపోతారు. కాబట్టి యే పేపరు పెట్టకుండా రండి. అయ్యో! పేపరు పెట్టకపోతే మేము ఎట్లా ప్యాసు అవుతాం అన్నారు. అదే నేను చేసే సహాయము అని చెప్పాను. చెప్పి నట్లు వినండి. shut up అన్నాను. మాట్లాడకూడదు యింక సరే నా మాట అంటే విలువ. అట్లే వుంటామన్నారు. క్వశ్చన్ పేపరు యిచ్చారు. రెండుగంటలు టైము యిచ్చేది. ఆ రెండు గంటలు లోపల అర్ధగంటలో నేను అన్నీ వ్రాసేశాను. యింకో 1/2 గంటలోపల రమేష్ hand writing లోపల రమేష్ వ్రాసినట్లుగా నేను అంతా answer చేశాను. ఇంకొక అబ్బాయి పేరుతో వాని hand writing మాదిరి వ్రాసి వాని పేపరు వ్రాసాను. ముగ్గురు పేపర్లు తీసుకున్నాను. టైమైన వెంటనే మూడు నేనే తీసుకుపోయి పెట్టేసాను. తరువాత results వచ్చాయి. మా desk ముగ్గురు పిల్లలకు మాత్రమే 1st class. పోనీ యేమైనా కాపీ కొట్టారా. వాని నెంబరు వేరు. వీని నెంబరు వేరు. నా నెంబరు వేరు. ఎవరెవరికి సంబంధము లేదు. కనుక యిది ఎవరు అనుమానించటానికి వీలులేదు. అప్పుడు మా ముగ్గురిని procession లో తీసుకువెళ్లారు. ఆనాటి నుండి యీ పిల్లలకు 'మా ప్రాణమంతా రాజే. తిర ణాలకు వచ్చారు. స్వామి యిది చేయటం తప్పుకదా అని భావించవచ్చు. యిది తప్పు కాదు. నా స్వభావమది. నన్ను ఆశ్రయించుకొని నన్ను కోరిన వారికి యేమైనా సహాయము చేస్తాను. యిదేమి దోషమును బట్టి చేసేది కాదు. యిదేమీ ఖూనీలు కాదు. దొంగతనము కాదు. వారిని రక్షించే నిమిత్తము. కనుక ఆ విధంగా చేశాను. ఆనాటినుండి యీ పిల్లలకు నేనంటే చాలా విశ్వాసము.

### *పనికి పరారు తిండికి తయారు*

స్కౌటుకు యింక తయారు కావాలి. నా యొక్క పరిస్థితి రమేష్ తెలుసుకున్నాడు. వాళ్ల నాన్నదగ్గరకు వెళ్లాడు. నాన్నా రెండు కాకీ నిక్కర్లు రెండు కాకీ షర్టులు కావాలి. కాబట్టి నాకు



*గొప్ప త్యాగాల వల్లనే గొప్ప కార్యాలు సాధించబడతాయి.*

కుట్టించమన్నాడు. 1st class లో ప్యాస్ అయినాడు కనుక తండ్రికి కూడా వుత్సాహము వేసింది. వాడు కోరినట్లంతా కుట్టించాడు. స్నేహితులంటే ఎట్లా వుండాలో మీరు చక్కగా యోచన చేసుకోండి. వాని కర్తవ్యమును వాడు నిర్వర్తించాడు. కానీ నా కర్తవ్యమును కూడా నేను నిర్వర్తించాలి. అతను ఒక నిక్కరు ఒక ప్యాంటు ప్యాక్ చేసుకొనిCanvas Shoes తీసుకొని పూర్వము యిలాంటి ప్యాస్టిక్ బ్యాగ్‌లు లేవు గోనె సంచీలో పెట్టి నా Desk లో పెట్టాడు దానిపైన వ్రాసాడు. "రాజా దీనిని తీసుకొనక పోతే నేను ప్రాణం తీసుకుంటాను" అని చూచాను. ఆ పేపరు చించేశాను. నీవు యిలాంటి పనిచేస్తే నాకు నీకు సంబంధమే లేదు. యింక వుండదని వ్రాసేసి పెట్టాను. నేను ఎవరి దగ్గరకు తీసుకునే స్వభావము లేదు. ఆనాటి మొదలు యీనాటి వరకు ఎప్పుడూ యిచ్చే యిచ్చే స్వభావమే. నాచేయి యిట్టే పోయింది గాని యిట్లా పోలేదు. కనుక అలా వ్రాశాను. బాధపడ్డాడు పాపం. మన స్నేహము నిజంగా కావాలనుకుంటే యీ దీనిని వెనుకకు తీసుకు వెళ్ల స్నేహాలు యీనాడంతా చెడిపోవటానికి కారణం యిచ్చి పుచ్చుకొనే స్నేహాలు చేస్తున్నారు. స్నేహాలు స్థిర మైనవి కాదు. ఇది వ్యాపార సంబంధమైనది. ఇది మన ప్రేమ నుకూడను ఖండింపచేస్తుంది. కనుక యిలాంటివి ఎవరు చేయకూడదు. ఆ విధమైన పాఠమునేర్పే నిమిత్తమై నేను ఆ విధంగా చేశాను. మూడవ దినము యింక వెళ్లాలి నా దగ్గర యేమి లేదు. నేను యింటికి కూడను Letter వ్రాయలేదు. సరే యింక ముందు స్కౌటు లీడర్ పోవాలి కదా. లీడర్ పోకుండా పిల్లలు ఎట్లాపోతారు? వారందరూ సిద్ధంగా వుంటున్నారు. బ్యాండ్ కొట్టారు. అప్పుడు నేను యేవిధంగా పోవాలి. పోవ టానికి వీలులేదు. నాకు వళ్లు సరిలేదు. టెంపరేచర్ వచ్చిం దంటే థర్మామీటరుతో టెంపరేచర్ చూస్తారు. ఇంక యేవిధంగా చేసినా పరీక్షలు చేస్తారు. కనుక నాకు కడు పునొప్పి అన్నాను. ఈ కడుపునొప్పికి యే పరీక్షలు చేయటా నికి వీలులేదు. చాలమంది పిల్లలైతే చదువుకు దొంగ వేషమునకు పోయి కడుపునొప్పి కాలునొప్పి అని చెప్పుకుం టారు. అలాంటి దొంగ వేషము కాదిది. మర్యాద కోసం చేశాను. ఇది పనికి పరారు తిండికి తయారు అయ్యే సోమరి పోతులు చేసే పని. నేను అలా సోమరత్వంతో చేయలేదు. సరే Procession మాయింటి దగ్గరకు వచ్చేసింది. రాజా

## మీకు తెలుసా ?

* విఖ్యాత శాస్త్రవేత్త థామస్ ఎడిసన్ తుది శ్వాసను హెన్రీ ఫోర్డు ఒక సీసాలో పట్టి భద్రపరచాడు.
* ఏప్రియల్ 1ని 'ఫూల్స్‌డే ' గా మన భావిస్తూ ఉంటాం కదా ! మొదట ఫ్రాన్స్‌లో 1860 ఏప్రియల్ 1వ తేదీన కొన్ని వందల మందిని తప్పుడు సమాచారం అందిం చడం ద్వారా ఫూల్సు చేసాడు. క్రమంగా అది ఏప్రియల్ ఫూల్స్ డేగా ప్రపంచమంతా వ్యాపించింది.
* ఛాంగ్ అను పదం చైనా ప్రజల ఇంటి పేరు. చైనాలో 10 కోట్ల మందిపై చిలుకు ఛాంగులు ఉన్నారు.
* రోమన్‌లకి కొంతమంది దేవతలు ఉన్నారు. వాళ్ళ పేరేంటో తెలుసుకుందాం.

మార్స్ : రోమనుల యుద్ధ దేవుడు
జూపిటర్ : రోమన్ పురాణాల్లో ఉన్నతమైన దేవుడు
క్యూపిడ్ : రోమనుల కామాధి దేవుడు
వీనస్ : రోమన్ పురాణాల్లో పేర్కొన్న ప్రేమ దేవత, సౌందర్యవతి
డయానా : రోమన్ పురాణాల్లో చంద్ర దేవత
అరోరా : ప్రాచీన రోమనుల ఉషోదేవత
మినర్వా : ప్రాచీన రోమన్ జ్ఞాన దేవత

నీవురా! నాకు కడుపునొప్పిగా వుంది తగ్గిపోతూనే వస్తాను మీరు పొండి ! అన్నాను. డ్రిల్ టీచరు నిక్కరు జేబు నుంచి Hand Kerchief తీసుకొని రాజా నీవు రాక మేము ఎట్లాపో తాము ? అన్నాడు. సార్ రేపటి దినము మిమ్ములను కలు సుకుంటాను. తగ్గిపోతూనే వస్తాను అన్నాను. వీరు వూరు దాటి పోయారు. నేను లేచాను. కడుపునొప్పి లేదు కదా ! నాబుక్కు అన్నీ తీసుకున్నాను. పిల్లలు యేరీతిగా నడచుకో



*సత్యం కోసం త్యాగం చేయవచ్చు కాని దేనికోసమూ సత్యాన్ని త్యాగం చేయవద్దు.*

వాలనే నేను చెబుతున్నాను గానీ నా గొప్పతనమని కాదు. మీకు చెప్పటం. నా Books ఎట్లావుండేవంటే కొత్తగా Shop నుండి తీసామా అన్నట్లు వుండేవి. సంవత్సరము జరిగినప్పటికి దీనిపైన యేమాత్రము మరకలు వుండేవి కావు ఈనాటి పిల్లలు బుక్కులు ఎక్కడ చూచినా వ్రాయటం వ్రాయటం గ్రంధములే యింతగలీజు చేస్తుంటే వారిలో చేరే గంధము ఎంత గలీజుగా వుంటుందో. ఎక్కడంటే అక్కడ పడవేయకూడదు. పుస్తకములను ఎంత భద్రముగా పెట్టు కొందుమో, ఎంత Neat గా పెట్టుకొందమో సరస్వతి మనలో అంత Neat గా చేరుతుంది. అది మన పరిశుద్ధతకు సరైన చిహ్నము. మనము బయటనే యీవిధంగా వుంటే లోపల ఎంత గలీజుగా వుంటుంది. కాబట్టి లోపల బయట మనం పరిశుద్ధముగానే వుంటుండాలి.

## *బాబా ఔదార్యము*

అప్పుడు భూగోళము, సివిక్సు యీ Books అంతా వుండేవి. ఐతే యీ Questions and Answers బుక్కు కూడా వుండేది. అప్పుడు యింగ్లీషు Text ఎక్కువలేదు. అంతా తెలుగే. 55 సంవత్సరముల పూర్వము ఐతే సంవత్సర సంవత్సరము Text Books మార్చే పద్ధతి లేదు అప్పటిలో. ఎనిమిది సంవత్సరములు పది సంవత్సరములు Same Text Books వుండేవి. దాని వలన పిల్లలు కూడా చాలా అభివృద్ధిలోకి వచ్చేవారు. ఈనాడు ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క Text Book మార్చివేస్తున్నారు. ఎందుకోసం మార్చి వేస్తున్నారు. ఆ వ్రాసిన వాడు,Education Minister కి Friend గా వుంటుంటే వాని Book ని తెచ్చిపెట్టి వీనిది Cancel చేస్తారు. ఈ రకమైన పద్ధతి వచ్చింది. ఇంతకు పూర్వము అలాకాదు. విద్యార్థుల యొక్క క్షేమము, విద్యార్థుల యొక్క అభివృద్ధి లక్ష్యమునందుంచుకొని వారు చేసేవారు. నా పుస్తకాలు చాలా Clean గా వుంటున్నాయి. క్రింది క్లాసులో ప్యాసైన హరిజన పిల్లవాడు వచ్చాడు. ఆ పిల్లవాడు చాలా బీదవాడు. ప్యాసై నా దగ్గరకు వచ్చాడు. రాజూ నీ పుస్తకాలు వుంటే ముందుగా ఎవరికి మాట యివ్వవద్దు. నాకు యివ్వాలి అన్నాడు నీకే యిస్తాను అని చెప్పాను. అప్పుడు నాకు డబ్బు అవసరంగా వుంటున్నది. నాకు కావలసినది ఐదు రూపాయలు మాత్రమే. ఈ బుక్సే అంతా చేరి యిరవై, యిరవై ఐదు రూపాయలు వుంటాయి. ఆనాడు చీపే అన్ని బుక్కులు చేరి యిరవైఐదురూపాయలు. ఈనాడు ఒక్కొక్క బుక్కుకు, 20 (చిన్న తరగతులవి) రూపాయలు వుంటున్నాయి. కాబట్టి మన చదువుయొక్క విలువ కూడను పెరిగిపోతూ వుంది. చదవాలంటే కొన్ని వేలు ఖర్చుపెట్టవలసి వస్తోంది. మన కాలేజీ పిల్లలకు ఆ ఖర్చు తెలియదు. ఎందుకనగా ఏ ఫీజు లేదు. నిజంగా ఫీజు యిచ్చి చదివే కాలేజీల్లోనే విద్యార్థులు బాగా చదువుతున్నారు. అక్కడ వినయ విధేయతలతో భయంగా వుంటారు. కానీ యీనాడు యే ఫీజు లేకపోవటం వలన భయములేదు ఎవరికి. అది చాలా తప్పు. ఇక్కడనే ఎక్కువ Gratitude చూపించాలి. అప్పుడు ఆ పిల్లవాని యింటికి తీసుకువెళ్లాను. హరిజనవాడ అంటే ఎవరూపోకూడదు. అక్కడికి. కట్టుబాటు వుండేది. నాకీ బేధాలు ఎప్పుడూ లేవు. నేరుగా హరిజన వాడకు పోయాను. ఆ హరిజనులంతా ఏమీ స్వామి మావాడకు వచ్చారా అని అందరూ కూడా ఆశ్చర్యపడి పోతున్నారు. నన్ను చూస్తే పెద్ద పెద్ద హరిజనులంతా వంగి స్వామి మీరెందుకు వచ్చారిక్కడికి అని అంత వినయంగా ప్రవర్తించే వారు. నాకు పని వున్నాది వచ్చాను అన్నాను నేను ఆ అబ్బాయి యింటిలోకి నేరుగా పోయాను. తల్లి తండ్రులు కూడను చాలా ఆశ్చర్యపోయారు. స్వామీ యీ యింటిలోపల ప్రవేశించారా. మిమ్మల్ని యేమి హింస పెడతారో ప్రజలు అని చాలా బాధ పడ్డారు. దానికి నేను భయపడను. అందరూ మానవులే. నా బోధ ఆనాటికీ నేటికీ ఒక్కటే. చూపించాను. ఈ పుస్తకాలు కావలెనా అన్నాను. అయ్యో ఎంత కొత్తగా వుంటున్నాయి. ఐతే రాజు నేను యింత విలువ యివ్వలేను నేను యిరవై రూపాయలు యిస్తాను అన్నాడు. నేను చెప్పాను. యిరవై రూపాయలు నాకు అక్కరలేదు. ఐదు రూపాయలిచ్చి తీసుకోమన్నాను. వాడు వుప్పొంగి పోయాడు పాపం. ఆనాడు రూపాయల నోట్లు లేవు. రెండు రూపాయల

నోట్లు లేవు. ఐదు రూపాయల నోట్లు లేవు పది రూపాయల నోటు ,నూరు రూపాయల నోటు వుండేవి మిగిలినవంతా Coins వాడు యింత మూట తెచ్చి యిచ్చాడు. ఐదు రూపాయలకు పైసలు, అణాలు యిలా ఉన్నాయి ఆ నాణెములు అవి తీసుకొని వచ్చాడు. నాకు అప్పుడు Bag లేదు. పర్సులేదు. వేరే యేవిధమైన భద్రమైనది లేదు. కాగితము మూటకట్టి యిచ్చాడు. అట్లానే తీసుకువెళ్లాను. తరువాత కొట్టై సుబ్బన్న మందుల వ్యాపారి. అతనికి నేను Advertisement పాటలు వ్రాసి యిచ్చేవాడిని ముందుగానే చెబితే ఒక Shirt, Pant కుట్టి యిచ్చాడు. అందులో ఆనాడు కాకీది చాలా చీప్. కనుక వానికి డబ్బు యిచ్చేశాను. మిగిలిన డబ్బు ఎక్కడ పెట్టుకోవాలి? ఎక్కడ పర్సులు అమ్మేవారు కాదు ఇప్పుడే వచ్చాయి అన్నిరకాల పర్సులు. అందులో యీ ఆడవారు పర్సులతో వెడుతుంటారు రేసు కోర్సులో గుఱ్ఱాలు పరిగెత్తినట్టు పరుగెత్తుతారు. ఆ పర్సులు వేసుకొని యిదంతా ఒక మినీ బజారు. అన్నీ ఆ పర్సులోనే వుంటాయి. ఆనాడు అలాంటివి ఎక్కడా లేవు. అప్పుడు ఒక పాతది నిక్కరు వుండి నాది. చించి దానిలోపల మూటను గట్టిగా కట్టాను. లైట్‌గా కట్టేటప్పటికి అది చిరిగి పోయింది. క్రిందపడి ఘల్లుమని శబ్దము వచ్చింది. ఘల్లుమని శబ్దము వచ్చేటప్పటికి లోపలనుండి యింటి యజమాని వచ్చేశాడు. ఎక్కడిది నీకింత డబ్బే నీవు ఎక్కడ దొంగిలించావు యిది వేరే భారం.నేను చెప్పాను పుస్తకాలు అమ్మినాదని. ఎక్కడ అమ్మినావో పోయి వానిని తీసుకువచ్చాను. వాడు చెప్పాడు నేనే యిచ్చాను. ఐదు రూపాయల చిల్లరంతా అన్నాడు. యిద్దరూ దొంగలే మాయింట్లోనే దొంగిలించారని ఆ డబ్బు వారు తీసుకున్నారు. మాట మాటాడలేదు. వారితో ఎంతైనా Argument చేయవచ్చు కదా! Argument కి నేనెప్పుడూపోను.

## స్వామి నిజాయితీ

సరే డ్రస్సు వేసుకున్నాను. సాయంకాలము 5 గంటలకు నడచటం. పది మైళ్లు బస్సుకు డబ్బులేదు. తెల్లవారు ఝామున ఆరు గంటలకు చేరాను. చేరేటప్పటికి యీ పిల్లలందరు Duty కి రావాలి. వారు ఎదురు చూస్తున్నారు రాజు వస్తున్నాడా లేదా అని. ఎక్కడ చూస్తున్నారు Bus Stand లో చూస్తున్నారు నేను Bus Stand కి పోలేదు. రాత్రంతా నడచటం లోపల కొంతయిదైపోయింది కడప లోపల నీరు చాలా తక్కువ అది ఎడారి ప్రదేశము. నీరు త్రాగవలసి వచ్చింది. నీరు ఎక్కడా లేదు. పశువులను స్నానాలు చేయిస్తారు. పశువులకు నీరు త్రాపుతారు అక్కడ కొన్ని తొట్లు పెడతారు. చాలా గలీజుగా వుంటుంది. ఆ నీరు పోయి ంచెం తీసుకున్నాను. అటూ యిటూ చూచేటప్పటికి యింకా ఎవరూ రాలేదు. ఒకచోట బీడీకట్ట ఒక అణా చిక్కింది. ఈ బీడీలు అంటే నాకు మొదటినుంచి ఇష్టం అయ్యేది లేదు. ఎవరైనా బీడీలు, సిగరెట్లు తాగేవాడు కోర్కెల రూములోకి వస్తే నీవు ముందు బయటకు పో తరువాత మాట్లాడతానని పొమ్మంటాను. అలాంటి దుర్వాసన నేను యిచ్చగించను. అది తీసి ఎవరికిచ్చినా త్రాగుతారు. చించి మట్టిలో పూడ్చి చేతులు బాగా కడుక్కున్నాను అణా తీసుకున్నాను. అణా తీసికొని నాలుగు బొట్లు తీసుకున్నాను. నేను అక్కడ పది దినాలు వుండాలి. పది దినాలకు నాలుగు బొట్లతో ఎట్లా అవుతుంది. ఎవరిదగ్గర పోకూడదు. Life లో ఆదినము ఒక్కమాటు మాత్రం పెడ మార్గం పట్టింది ఏమంటే Gambling. కళావరు, యిస్పేటు, ఆఠీను, అరకు దేని మీద డబ్బు కడతామో అది వస్తే రెట్టింపు డబ్బు యిస్తాడు. ఆ విధంగా చేసేటప్పటికి Double వచ్చేసింది నాకు. అక్కడ వున్నవారందరు పిల్లవాడు అదృష్టంతుడవు కొట్టేసెయ్యి అన్నారు. నేను యోచన చేసుకున్నాను. ఈ పది దినములకు నా కెంత కావాలి? పన్నెండు అణాలు కావాలి. ఎందుకంటె మూడు దోశలు యిచ్చేవారు ఒక బొట్టుకు. మంచి దోశలు, పొద్దున్న ఒక దోశ మధ్యాహ్నం ఒక దోశ రాత్రి ఒకదోశ. ఒక బొట్టుతో దినమంతా కాలము గడుపుకోవచ్చు. ఆనాడంత Cheap. పన్నెండణాలు వచ్చేంత వరకు చూశాను అందరు Force చేశారు. కట్టు కట్టు పోవద్దు. నాకు ఎంతకావాలో అంత వచ్చింది. దురాశ పోవద్దు అక్కరలేదని వెళ్లాను. ఈ విధంగా విద్యార్థి

దశయందు ఎంత నీతి నిజాయితీగా ఎంత క్రమశిక్షణగా యింటి గౌరవము కాపాడుతూ ఎంత మర్యాదగా బ్రతకాలో అంత మర్యాదగా బ్రతకాలి. కనుక విద్యార్థి దశయందు ఆవిధముగా ప్రవర్తించాను.

## పరదూషణ పనికిరాదు

ఇప్పుడు క్రమశిక్షణ వుల్లంఘించి పోయారంటే వారి పైన చాలా అసహ్యము వేస్తుంది నాకు. వారి ముఖము కూడ చూడబుద్ధి కాదు. ఎందుకంటే విద్యార్థిగా వుంటుండి యింత దుర్మార్గములో ప్రవేశించటము వీని భవిష్యత్తు ఏమైపో తుంది? పక్కా దొంగైపోతాడు. ఎవరు నమ్మరు. కట్టకడపటికి తల్లితండ్రులు కూడను విశ్వసించరు. అలాంటి అబద్దాలా డటం, అలాంటి పెడమార్గము పట్టటం, వీరిపైన వారిపైన చాడీలు చెప్పటం యీ విధమైన చాడీలలోపల మానవత్వము పూర్తిగా దానవత్వంగా మారిపోతుంది. వాడు యిట్లా వీడు యిట్లా యితరులదోషాలు చెప్పుకోటం మంచిదికాదు విద్యార్థులకు, వాడు చెడ్డవాడు కానీ నీ మంచిని నీవు పోషిం చుకో. ఇంకొకరిపైన నీవు ఎందుకు చెడ్డ చెప్పటము ? అట్లే టీచర్సు కూడను. వారిపైన వీరు వీరిపైన వారు యేమేమో చెప్పుకొని యిలాంటి టీచర్సు పిల్లలను యేవిధంగా బాగు చేయగలరు ? ఇలాంటి విద్యార్థులు భవిష్యత్తులో యేవిధంగా నాయకులు కాగలరు ? కనుక విద్యార్థులు నేర్చుకోవలసినవి మూడు. అసత్యమాడ కూడదు. పరదూషణ చేయకూడదు. అందిరిని ప్రేమించాలి. ఐతే అట్లని అందరిని కట్టుకోవటం కాదు. ఎంత వరకో అంత. కనుపిస్తారు. చిరునవ్వుతో How are you. అంతే అక్కడ నిల్చుకొని గంటల కొలది మాట్లాడ కూడదు. మన Friendship ఎలావుందంటే నయాపైసా యిచ్చి కరపించుకుంటే నలభైవేలిచ్చినా వదిలించుకోటానికి వీలుకాదు. నీవు వదిలినా వాడు వదలడు. అలాంటి Friendship ను కూడను మితంగా పెట్టుకోవాలి. ఒక్క దైవంతో యే మితము లేదు. సర్వులకు బంధువు, ఆపద్బాంధ వుడు. కనుకనే భగవంతునితో సంబంధము అధికంగా పెట్టు కోవాలి. కృతమైన దానిని తగ్గించుకోవాలి. దీనినే వైరాగ్యమని చెబుతు వచ్చారు. ఈనాడు బయటి ప్రపం చములో విషయము చెబుతున్నాను. అధ్యాపకులందరు తమ స్వార్థము స్వప్రయోజనముల కోసమని రాజకీయములలో పాల్గొంటున్నారు. ఈ విధంగా రాజకీయములలో ప్రవేశించే టప్పటికి వీరి హృదయము కల్మషమైపోతుంది. కల్మషమైన హృదయము అందరిని కల్మషము చేస్తుంది. ఈనాటి రాజ కీయములు రాజకీయములు కాదు, రాజకయ్యములు. ఎక్కడ చూచినా జగడాలు ప్రారంభమవుతాయి. అది మంచిది కాదు. ఇలాంటి దురాలోచనలు టీచర్సులో రాకూడదు. ఈ

## వింతలు విడ్డూరాలు

* న్యూయార్క్ ప్రక్కనే ఉన్న బ్రూక్లిన్ లో వైమోస్ అనే ముఠా ఉంది. వీళ్లు తమ రేట్లని అచ్చువేసి పంచారు. ముక్కుమీద గుద్దాలంటే రు.61/- దవడ విరగ కొట్టా లంటే రు.౮౦ లు. చెయ్యి, కాలు విరగ కొట్టాలంటే రు. 150/- లు . జాగ్రత్తండి మరి.

* 1981 డిశంబర్ 2వ తేదీన ఇంగ్లీష్ ఛానల్ పై 9,000 మీటర్ల ఎత్తులో జెట్ విమానంలో సిండి స్మిత్, స్టీఫెన్ బ్రౌను అను వారిద్దరూ పెళ్ళి చేసుకున్నారు. ఎంచక్కా వారికి కళ్యాణ మండపం అక్కరలేదు.

* హైద్రాబాద్‌లో వున్న ముస్లిం యువతికి, దుబాయ్‌లో ఉన్న ఒక యువకునికి మధ్య 1983 జూలైలో ఫోన్ ద్వారా పెళ్ళి జరిగింది. ముహూర్తం టైం పెండ్లికి ఆమోదం తెలుపుతూ పెండ్లి కొడుకు టెలిఫోను ద్వారా తెలియ జేశాడు.

* టాల్‌స్టాయ్ వ్రాసిన స్పైడర్ అను కథను 26 సార్లు త్రిప్పి వ్రాశాడుట. సమరము - శాంతి అను బృహత్తర నవలను ఆయన భార్య ఏడు పర్యాయములు శుద్ధ ప్రతులు వ్రాసింది. ఇది అత్యంత పెద్ద నవల. పుటల సంఖ్య 2,400 రచనా కాలం 6సం.



ఉత్తముడు మాటల్లో పరిమితంగానూ చేతల్లో చురుకుగానూ ఉంటాడు.

దుర్మార్గమైన Ideas పిల్లలకు యివ్వకూడదు. ఇంకా కొందరు strikes లో పాల్గొంటూ వుంటారు. ఎందుకంటె మాకిచ్చే జీతాలు చాలవు. మాకు promotion కావాలి. కోరవచ్చు. తప్పులేదు. promotion కోరవచ్చు. జీతాలు కోరవచ్చు. కానీ మొట్టమొదట నీలో నీవు ప్రశ్న వేసుకో. యీ promotion కు నేను అర్హుడనా ? ఇచ్చిన జీతమునకు తగినంత పని చేస్తున్నానా ? లేదా ? దీనినే మనం చేయటం లేదు. ఎక్కువ జీతాలు అడగటానికి అవమానం కాదా! ఇది కేవలం దేశమును దోచుకోవటం కదా! నీవు నిజంగా కర్తవ్యమును నిర్వర్తించుకుంటూ వస్తే నిన్ను right వెతుక్కుంటూ వస్తుంది. కనుక right కోసం fight చేయకూడదు. కర్తవ్యమును నిర్వర్తించు. నీ పిల్లలను చక్కగా చూచుకో. వారికి సరైన teaching చేయి. వారి అభివృద్ధి నీవు ఆశించు. అప్పుడే right వెతుక్కొని వస్తుంది. ఆright గలవానిని దేవుడు కూడను వెతుక్కొని వస్తాడు. పరీక్షిత్ మహారాజు శుకమహర్షిని కోరలేదు రమ్మనమని. కానీ అతని పరిశుద్ధమైన హృదయ మును పురస్కరించుకొని శుకుడే నడచిపోయాడు. కనుక యీ విధమైన భావాల లోపల మన సంస్థను మనం పెంచాలి.

## DISCIPLINE-DEVOTION

అధ్యాపకులు పిల్లలయొక్క శ్రేయోభిలాషులు కావాలి. కేవలము శ్రేయోభిలాషులేకాదు ఆదర్శవంతమైన విద్యార్థులుగా రూపొందింపచేయాలి. మొట్టమొదట అధ్యాపకులు నడచుకొని విద్యార్థులకు బోధించాలి. అధ్యాపకులందు వినయ భయ విశ్వాసములతో కూడిన భక్తి వుండాలి. ఆ భక్తియే లేకుండిన ఎంత విద్యావంతుడైనప్పటికి ప్రయోజనము లేదు. కుటుంబములో నీ పిల్లలను యే విధంగా పోషించుకోవాలో చూచుకో. అదే భావము బయట పిల్లలపై చూపుకో. నీ బిడ్డలను ఒక దృష్టితో బయట బిడ్డలను మరొక దృష్టితో చూసుకుంటే తప్పక నీ బిడ్డలకే నీవు harm చేసిన వాడవౌతావు. బయట పిల్లలను మంచిగా చూచినప్పుడు నీ పిల్లలను భగవంతుడే చూచుకుంటాడు. కనుక యీ దృష్టి అధ్యాపకులలో వుండాలి. అప్పుడే అధ్యాపకులు, విద్యార్థులు ఆదర్శవంతమైన జీవితమును అందిస్తారు. మన యొక్క కళాశాల పద్ధతులు మూడుBehaviour, Manners,

### విదుర నీతి

"అవ్యాహృతం వ్యాహృతాచ్ఛ్రేయ ఆహుః
సత్యం వదేద్ వ్యాహృతం తత్ ద్వితీయమ్
ప్రియం వదేత్ వ్యాహృతం తత్ తృతీయం
ధర్మం వదేద్ వ్యాహృతం తచ్చతుర్థమ్ "

మౌనము, పలుకుట కంటె మేలైనది. కాని పలుకులయందున్న విశేషములు కలవు. సత్యమైన వాక్కు పలుకుట రెండవది. ప్రియమగు వాక్కు పలుకుట మూడవది. ధర్మమైన వాక్కు పలుకుట నాలగవది.

Discipline. Manners లేక man కాడు. discipline లేక విద్యయే కాదు.

నా వుద్దేశ్యము యేమంటే లోకసంబంధమైన యీ విద్యల కంటె ఆధ్యాత్మిక సంబంధమైన discipline చాలా అవసరం. ఈ ప్రాపంచిక సంబంధమైన విద్య పొట్ట కొరకు మాత్రమే పనికివస్తుంది. రామాయణములో విచిత్రవ్యక్తి వున్నాడు. అతని పేరు కబంధుడు. అతనికి తల లేదు. తల లేదంటే తల లేకుండా పోలేదు. అతని తల కడుపుపై వుంటున్నది. దీని అంతరార్థమేమిటి? కడుపు కోసమే తలను పెట్టుకున్నాడు. ఈ చదువులను కబంధుని తలవలె కడుపుకు ఉపయోగపెడుతున్నాయి. ఈ తలను పొట్ట కోసం వుపయోగించకూడదు. మనకు అగోచరమైన విషయాలు, అగమ్యమైన విషయములను, అప్రమాణమైన విషయాన్ని విచారించే కోసం మనకు తల యిచ్చింది. అలాంటి దానికోసం మనం విచారించాలి. కానీ పొట్టకూటి కోసం తలను వుపయోగించకూడదు. ఈనాటి ఆధునిక యుగము లోపల అందరు కబంధులుగానే వుంటున్నారు. ఆ తలను నిరంతరము పొట్టకోసం వుపయో



*క్లిష్ట పరిస్థితులలోనే మనిషి శక్తి యుక్తులు బయటపడతాయి.*

గాపెట్టి భ్రష్టు పట్టిస్తున్నారు. మనం సరైన రీతిలో పిల్లలను చక్కని బోధ చెయ్యాలి. Disciplineచాలా అవసరంగా వుంటుండాలి. ఈ discipline తో బాటు devotion దైవభక్తి కూడా వుండాలి. ఈనాడు నక్సలైట్లు, కిడ్నాపర్సు, హైజాకర్సు, టెర్రరిస్టులు, బాగా అభివృద్ధి కావటానికి కారణం ఏమిటి? వీరందరు గొప్ప చదువరులే. కానీ వారిలో దైవప్రీతి లేదు. పాపభీతి లేదు. కనుకనే వారు యింత క్రూరమైన మార్గములకు గురౌతున్నారు. మనలో క్రూర భావములు రాకుండా వుండే నిమిత్తమై దైవ ప్రార్థనలు చేయాలి. దైవ విశ్వాసము పెంచుకోవాలి. తద్వారా నైతిక విలువలు అభివృద్ధి అవుతాయి. అప్పుడు సమాజ గౌరవం మనకు లభిస్తుంది. యిది కేవలము మా Institute కోసం కాదు చెప్పేది. మీ భవిష్యత్తు కోసం చెబుతున్నాను. నీతి నిజాయితీలతో బ్రతకాలి. ఆధ్యాత్మిక భావముతో జీవించాలి. ఈ ఆధ్యాత్మిక భావము లేకపోతే యిది కేవలము శూర్పణఖ వంటి జీవితమవుతుంది. కంసుని వంటి జీవితము అవుతుంది. కనుక మనము యీ జీవితమునకు యే మాత్రము మార్గము యివ్వకూడదు. విద్యార్థులారా! మీకు యీ పది దినములనుండి ఎన్నో విషయాలు బోధించాను. ఏ తల్లి, తండ్రి, మిత్రులు, బంధువులు బోధించని విషయములు బోధించాను. అన్నీ ఆచరించటం అసాధ్యమే. ఏవో కొన్నింటినైనా important వి తీసుకొని సత్యసాయి సంస్థలనుండి వచ్చిన వారము, సత్యసాయి Institute నుండి వచ్చిన వారము అనే సార్థక నామము తెచ్చే ప్రవర్తనను మీరు పెంచుకోండి. ఈ విధంగా వుండాలనే వుద్దేశ్యంతో special గా మన విద్యా సంస్థను ప్రారంభించాం. అంతేకాదు. ఈ విద్యాసంస్థ వ్యాపారసంస్థ కాదు. వ్యాపారము heart to heart; love to love. ఈ సంస్థ లోపల యిలాంటి పరిస్థితి అభివృద్ధి పరుస్తే జగత్తంతా దీనిని ఆకర్షిస్తుంది. ఎంతో హర్షిస్తుంది. అలాంటి కీర్తిని తేవాలని నాకోసం కాదు, మీకీర్తి కోసమని Institute కీర్తి నిలపండి. మీ గౌరవమును, Institute గౌరవమును కాపాడండి!ది. 2-6-1992 న బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగముల నుండి. *

# వందే మాతరమ్ !

"జాగ్రత్త! న్యాయ స్థానంలో కేసే మీ సాక్ష్యాధారాలతో స్థాపించ బడలేదు. మీరు నన్నెక్కడకైనా తీసుకు వెళ్ళండి మిమ్మల్ని నేను అనుసరిస్తాను. కానీ మర్యాదగా ప్రవర్తించండి !" అని పలకరించింది ఎవరో తెలుసా14 సం. వయస్సు గల కుదీరామ్

పోలీసులకు కోపావేశం పెచ్చరిల్లి పెడరెక్కలు విరచి పట్టుకుందామని ముందుకు ఉరికారు. కాని ఆ పిల్ల చిరుత దొరకలేదు ఎదిరించి తప్పించుకున్నాడు.

ఈ సంఘటన 1-4-1906న మిడ్నాపూర్ లో జరిగింది.

ఈ కుదీరామ్ వందేమాతర ఉద్యమంలో కార్యకర్త. బ్రిటిష్ కుతంత్ర వాదులకు వ్యతిరేకంగా కరపత్ర యుద్ధం జరగాలని దానికి కార్యశూరుడు మన కుదీరామ్‌ని నియమించారు.

ఆ తర్వాత స్నేహితుడు ఛాకి, కుదీరామ్ బోసు ఇద్దరూ కలసి ఆంగ్లేయులతో తైన కింగ్స్‌ఫోర్టు మీద బాంబు దాడి చేశారు. అయితే అతను తప్పించు కున్నా తెల్లవారు ఇద్దరూ చచ్చారు.

ఆ పోరాటంలో ఛాకీ ఆత్మ బలిదానం చేసుకున్నాడు. కుదీరామ్ -- భారతీమాత ముద్దు బిడ్డ ఆ యొక్క కిరాతక హస్తాల నుండి తప్పించుకొని 24 మైళ్ళ దూరం నడిచి 'వైని' రైల్వేస్టేషన్ చేరాడు. ఆకలితో ఉన్న ఆ 16 ఏళ్ళ కుదీరామ్ అన్నం నోట్లో పెట్టుకోగా బ్రిటిష్ తొత్తులు కుదీరామ్‌ని అరెస్ట్ చేశాయి.

రైల్లో వెళ్తున్న కుదీరామ్ అక్కడ మూగి ఉన్న జనాలతో 'వందేమాతరం' అని అరుస్తూ ఆనందంగా సాగి పోయాడు.

1908 ఆగస్టు 8వ తేది ఉదయం 6 గంటలకు కుత్సితపు ప్రభుత్వపు కసాయి నిర్ణయానికి భరతమాతకి 'జై' కొడుతూ తుది శ్వాస విడిచాడు కుదీరామ్. వందేమాతరమ్!

* * *



మనస్సును అధీనంలో తెచ్చుకున్నవాడు విశ్వ విజేత.

# ధియో యోనః ప్రచోదయాత్

డా. రాపర్ల జనార్ధనరావు

జల ప్రవాహంలో మొలబంటి నీటిలో నిలబడి సూర్యునికి అభిముఖంగా గాయత్రి మంత్రం ఉపాసిస్తే మహిమాన్వితమైన తేజస్సు లభిస్తుందని శాస్త్రం చెపుతోంది. ఛత్రపతి శివాజి మహారాజు గురువైన, సమర్ధ రామదాసు గోదావరి నదిలో ఈ విధంగా జపం చేశాడని ప్రతీతి. భద్రచాల రామదాసు గోదావరిలోనూ, త్యాగరాజస్వామి కావేరినదీ జలాలలో మునుకలిడిన వారే. "ఆపోహిష్ఠామ యోభువః "!అనెడి ఉదకమంత్రంతో అనగా జలమును పూజించి శక్తి పొందెడి మంత్రము ప్రారంభమున వచ్చును " ఆపోవైభేషజం" నీటిలోనే కావలసిన మందులన్నియు ఉన్నవని తెల్పబడినది.

### తేజోపాసన :

ఆర్యులు నీటిని, తేజస్సును, వాయువును, పూజచేసి పంచభూతములకు మ్రొక్కి ప్రకృతికి నమస్కరించి ఘన జీవితములు కల్గినవారైనారు. నేటి వాతావరణ కాలుష్యమునకు, నాటిజలఅగ్ని, వరుణ దేవతా పూజలకు ఎంత భేదమున్నది? వేదకాలమునాటి అర్చనలు మూర్తి పూజలుగాక తేజోపాసన, లేదా సూర్యోపాసన, గాయత్రి మంత్రోపాసనతో ముడిపడియుండుట గమనీయము. వారి ఆరాధనాదైవము సూర్యుడు. సవితా దేవత యనునది నామాంతరము. "అసావాదిత్యో బ్రహ్మ" అను వేదవాక్యమున "ఈ కనపడునట్టి సూర్యుడే దేవుడు ' అని తెల్పబడినది. సూర్యారాధనయే గాయత్రి మంత్రోపాసన. అదియే తేజోపాసన. అదియే బ్రహ్మోపాసన. ఉపనయన మహోత్సవ సమయమున తండ్రి తనకుమారుని చెవిలో గోప్యముగ, వస్త్రము ఇరువురు శిరస్సులపై వైచి, బ్రహ్మోపదేశము చేయును.

### బ్రహ్మోపదేశము

మానవుడు ద్విజుడుగ రూపాంతరము, తనమనోభావన వలన చెందుతున్న ఈ మహత్తర సన్నివేశమున అనగా ఉపనయన కర్మ గావించెడి సమయమున తండ్రి కుమారునితో ఏదో ఒక మహత్తర సందేశము ముసుగు వేసికొని చెప్పుటలో ఇమిడియున్నదని తెలియవచ్చు చున్నదికదా ? మరి ఆ సందేశమేమి ? అది ఎంతటి ప్రాముఖ్యమో పరికింతమా?

"సుప్రజా ప్రజయా భూయా (సం) . . . . సువీరోవీరైః . . . సువర్చా వర్చసా . . . ' అనెడి మంత్రములో మంచి ప్రజలు వీరులైన ప్రజలు, వర్చస్సు కలిగిన ప్రజలను ప్రస్తుతించి తేజోరూపులైన ప్రజలను వృద్ధి చేయవలయునని ఉపదేశింపబడినది. సుందరులు, సుగుణ రాసులు, వీరులు, ధీరులైనట్టి ప్రజాభివృద్ధి కోరినది మన సంస్కృతి. అదియే ఒక ఉపాసనగా రూపొందినది. అదియే తండ్రి తరతరములకు బ్రహ్మోపదేశముగ తెలియ జెప్పి భారతీయ జీవన ప్రవంతిని నిర్మలము, నిరవధికముగ చేసిచున్నారు.

### గాయత్రి ఉపాసన :

ఓం భూ, ర్భువస్సువః అనెడి వ్యాహృతులతో ప్రారంభము. అనగా భూర్భువ, స్సువర్లోకములనెడి మూడు లోకములను తన ఉపాసనాదేవతను స్మరించు చున్నాడు. 'తత్సవితుర్వరేణ్యం' వరేణ్యం అనగా అతిశ్రేష్ఠమైన



పరిస్థితులు మనిషిని సృష్టించవు. మనిషే పరిస్థితులను సృష్టించును.

తత్సవితుః ' ఆ సవితా దేవత యొక్క'భర్గోదేవస్య ధీమహి' తేజస్సును మేము 'ధీమహి' అనగా ప్రార్థించు చున్నాము.

'ధియోయోనః ప్రచోదయాత్ " మాబుద్ధులను ప్రేరణ చేయుచున్నాడు. తాత్పర్యము సూక్ష్మముగ తెల్పవలెనన్న భూర్భువ సువర్లోకముల నిండి యుండి, మా బుద్ధులను విక సింపజేసెడి ఆ సూర్యుని ధ్యానించు చున్నారము.

## బహువచన విశేషము :

గాయత్రి మంత్రమున ఉపాసకుడు తానొక్కడే అనిన ఏకవచన పూర్వకమగు ధ్యానము లేదు "నః" అనగా"మాయొక్క" "ధియో" బుద్ధి ప్రవృత్తులను, "ప్రచో దయాత్" వికసింపచేయు సూర్యునికి "ధీమహి " మొక్కు చున్నారము. అను బహువచనము ఎంతయో గమనీయము. మన బుద్ధి ప్రవృత్తులను వికసింప చేయుట జీవాత్మ పర మాత్మల అనుసంధానము కానవచ్చుచున్నది. నేడు మనము కోరెడు అభివృద్ధి(Progress) ఇందు పొందుపరచబడినది. సాధకుడు గాయత్రి ధ్యానమున తానొక్కడే అని భావించక తామెల్లరము అనెడి ప్రస్తావన యుండుట ఒక ఘనవిశేషము. "నేను, నాకు" అని ప్రార్థింపక "మేము, మాకు" అనుటవలన గాయత్రి మంత్రమున గల బీజాక్షరముల ప్రభావము వలన సాధకుడు, అతని సంఘము, మరియు విశాల ప్రపంచము కూడ ఒక్క గాయత్రి మంత్ర పఠనము వలన ప్రభావితమగు చుండుట ఒక విశేషము. వ్యక్తిగాక సమిష్టి ప్రపంచము గాయత్రి మంత్రోపాసన వలన ఘనత నొందుట చక్కని విశే షము. భారతీయ ఉత్కృష్ట భావనాశైలికి ఇది యొక గీటురాయి.

## ఉపాసకుని విధి నిషేధములు :

ఈ తేజోపాసకుని సంకల్ప సిద్ధికై కొన్ని విధినియ మములు ఏర్పరచియున్నారు. అభ్యాసకుడు రోజుకు80 ప్రాణాయాముల వరకు చేయుచు సాత్వికాహారమును స్వీక రించు చుండవలయును. శాల్యాన్నము (వరి), గోధుమలు, పెసలు, పాలు, నేతితో వండిన పదార్థములను భుజింపవ లయును. "క్షీర భోజీసదా భవేత్" క్షీరముతో వండిన ఆహా రము నిత్యము తినుమని ఆదేశింపబడినది, రాజసిక, తామసాహారము వర్జనీయములు.

## ఆధునికుల అనుభూతులు :

దివ్యజ్ఞాన సమాజమునందలి ప్రముఖులు మదాం బ్లావెట్స్కీ, అనీబిసెంట్, మొదలైనవారు గాయత్రి మంత్రము హృదయస్ఫూర్తిగా ధ్యానము చేయగా సూర్య కిరణము ఒకటి తన మేధస్సునకు అనుసంధానము గావించినటుల అనుభూతి పొందితిమని తెల్పియున్నారు.

మోతీలాల్ చివరిదశలో గాయత్రి మంత్రము ఉచ్చ రించుచూ తుదిశ్వాసను వదిలినాడని, సర్వేపల్లి రాధాకృష్ణన్ ఒకచోట వ్రాసియున్నారు.

## సూర్యోపాసన :

'నీ దేవుడా ? నా దేవుడా ' నీగుడి, నా మందిరం అనే వైషమ్య పూరితమైన, అర్థరహితమైన నేటికాలమున ఈ ప్రపంచమును తన కిరణములచే చైతన్యముచేసి నవగ్రహ ములను తన చుట్టు భ్రమణము చేయించుచూ,(Zodaic System) " శివుడవో, మాధవుడవో, ఎవరని నిర్ణించేదిరా " అనెడి సంశయము ఆవంతయు లేక శివకేశవుల బేధము లేక, సమిష్టి భావనతో, "చిత్తశుద్ధి మనో వికాసము మాకెల్లరకు లభింప చేయుము ప్రభూ" అని ప్రార్థించెడి గాయత్రి మంత్ర విశేషము గ్రహించి అనుష్ఠించుట అభిలషణీయము.



*మాటకి, చేతకి మధ్య సామరస్యం సత్ప్రవర్తనకు గీటురాయి.*



ఫోన్ : 349

# శ్రీ సదాశివలింగేశ్వర
# చేనేత పారిశ్రామికుల సహకార ఉత్పత్తి మరియు విక్రయ సంఘం లిమిటెడ్ No. H. W. 17

బ్రహ్మపురం, పెడన, (కృష్ణాజిల్లా)

మావద్ద 80s నెంబరు డార్కు-పేటు, ఫ్యాన్సీ T. D. 60s నెంబరు డార్కు-పేటు చీరెలు 60s నెంబరు లుంగీలు, 60s నెంబరు పంచెలు, నాపులు మా ప్రత్యేకత.

మీ అవసరములకు మా సంఘము దర్శించవలెను.

**బళ్ళ రాజేశ్వరరావు**
ప్రెసిడెంటు

**బుద్దె నాగేశ్వరరావు**
వైస్ ప్రెసిడెంటు

కార్యవర్గ సభ్యులు :

పుమ్మటి సంజీవరావు　బులసర రాజేశ్వరరావు　యర్రా ఈశ్వరరావు

బూసం కోటయ్య　బళ్ళ నరసింహారావు

మహిళా కార్యవర్గ సభ్యులు :

పుటూకూరి కనకదుర్గ　జక్కుల చాడేశ్వరి

**పుట్ల జగన్నాధరావు**
మేనేజరు

ఆధ్యాత్మిక దృష్టి

వ్యాసం -13

# సంసారంలో సామరస్యం

పాతూరి ప్రసన్నం

**" Charity begins at Home"**

*"ఇంట గెలిచి రచ్చ గెలవాలి"*

ఇటువంటి సామెతలు చాలా విలువగల సందేశాన్ని సూచిస్తాయి. మనిషి సంఘజీవి. అయితే 'సంఘజీవి' గా మానవుడు రూపొందటంలో అతని గృహ జీవనం ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకుంటుంది. ఒక పిట్టకు గూడు, ఒక పశువుకు పాక, మనిషికి ఒక యిల్లు చాలా అవసరం.

ఇల్లు అనగానే అమ్మా, నాన్నా, అన్న, చెల్లి, అక్క, బావ, తాత, నాయనమ్మ, మామ, అత్త, వదిన, మరదలు ఎన్నెన్నో మానవ సంబంధాలు నడుమ గల మధురానుభూతులు స్ఫురిస్తాయి. ప్రతి యిల్లూ ఒక మానవతా మందిరం. అక్కడ మానవత్వపు విలువలు మనుజుల్లో అంకురించి, వికసిస్తాయి. ఆ యింట్లో ఒక విశిష్టమైన జీవన సంస్కృతి పోషింపబడుతుంది.ఇల్లు గల వ్యక్తిని, యింటి యజమానిని "గృహస్థుడు" అంటారు. "గృహస్థ"శబ్దం ఒక ఆశ్రమాన్ని సూచిస్తుంది. భారతీయ జీవన విధానంలో బ్రహ్మచర్యం, తర్వాత గృహస్థాశ్రమం, తర్వాత వానప్రస్థం, తర్వాత, సన్యాసాశ్రమం వంటి "ఆశ్రమ ధర్మాలు"వయస్సును బట్టి నిర్వచించ బడటం విశేషం.

## నేటి గృహస్థ జీవనం

"నా యింటి ముఖ ద్వారం ఒక సుందర శిల్ప కళా ఖండం. నా యింట్లో ఆదరణ అనే తివాసీ పరిచాను. నా యింటి గోడలకు ప్రేమ అనే Distemper రంగుతో మెరుగులు దిద్దాను. శాంతి అనే బల్బు నుంచి ఆనందం అనే వెలుగు నా యింటి నిండా వ్యాపించుతుంది. నా యిల్లే స్వర్గం" అని కవిత్వ ధోరణిలో పాటలు కూడా పాడుకోవచ్చు గానీ, మరీ అంత అతిశయోక్తి పనికిరాదు" అని ఆక్షేపించే వారున్నారు.

ఈనాడు గృహజీవనంలోని విలువలు, సంసారాల్లోని సామరస్యాలు ఆధునిక జీవన సమస్యల వేడి చేత హరించుకు పోయాయి.

భార్యాభర్తలిరువురూ బాగా చదువుకున్నవారే. పెద్ద పెద్ద ఉద్యోగాల్లో కూడా వుంటున్నారు. కుటుంబ నియంత్రణ కూడా జరిపి యిద్దరు బిడ్డల్నే కన్నారు. ఇంత వరకూ కథ బాగానే వుంది. హఠాత్తుగా పేపర్లో వచ్చింది దుర్వార్త. వారంతా విషం పుచ్చుకొని చచ్చిపోయారని! ఇటువంటి వార్తలే ప్రతిరోజూ పేపరు నిండా.

ఇంత చదువూ చదివింది ఈ రీతిగా యింటిల్లిపాదీ ఆత్మహత్య చేసుకోటానికా? ఇది మానవత్వమేనా ? జీవిత పరమార్థం యిదేనా? సంసారాల్లో ప్రతి వ్యక్తీ తన సుఖం, తన అభివృద్ధి కోరుకొనే స్థితికి దిగజారిపోయాడు. తల్లి తండ్రులు ముసలివాళ్లు. వాళ్ల రోజులు అయిపోయినై. వారిని ఏదో మూలపడి బ్రతకనీ. మా దోవకు వాళ్లు అడ్డం రాకూడదు-- ఇది యువతరం కొడుకూ కోడళ్ల ధోరణి! యింట్లో కొడుకూ కోడళ్లతో సహజీవనం చేయలేక "వృద్ధాప్యపు గృహాల్లో"కి పోయి "Home for the

aged" బ్రతకాల్సి వస్తోంది ముసలి వారికి! పోనీ యింట్లో భార్యా భర్తల సామరస్యం వుంటోందా? ప్రతిక్షణం పోటాపోటీలు, ఒకరి కంటె ఒకరు అధికులమని చెప్పుకొనే ధోరణి, ఒకరి నుంచి ఒకరు విడిపోయి బ్రతికితేనే ప్రాణానికి సుఖం అనే రోజులు. ఎవరి సంపాదన వారిది. ఇక ఆ యింట్లో పిల్లల పరిస్థితి మరీ శోచనీయం. వాళ్లు 'క్రెచీ' ల్లోనూ, నర్సరీల్లోనూ, స్కూళ్ల లోనూ, ప్రయివేటు టీచరు దగ్గరా, యింట్లో ఆయాతోనూ బ్రతక వలసిందే తప్ప, వారి ఆలనా పాలనా స్వయంగా చూసుకోటానికి 'డాడీ'కీ 'మమ్మీ'కీ టైం లేదు. అంతా యాంత్రికం. ఈ యాంత్రిక వాతావరణంలో, కృత్రిమ జీవితంలో పిల్లలు కూడా టీ.వీ.లతో, సినీమాలతో, సంఘంలో కనిపించే దుష్టభావాలతో, పనికిరాని చెత్త సాహిత్యంతో, మాదక పదార్థాల వ్యసనాలతోనూ అన్ని విధాలా భ్రష్టులు అవుతున్నారు. ఇది సర్వే సర్వత్రా గృహసీమల్లో జరుగుతున్న పతనోన్ముఖ జీవితాల విషాద పరిస్థితి.

ఇక అమెరికా వంటి అడ్వాన్సు చెందిన దేశాల్లోని పరిస్థితి మరీ ఘోరం. శ్రీమతి పెగ్గీ మాసన్ ఇంగ్లాండులో, యూరప్‌లో ఎంతో ప్రతిష్ఠ పొందిన రచయిత్రి. భగవాన్ శ్రీ సత్యసాయి సన్నిధికి చేరి "BABA-The Incarnation of Love" (బాబా-ప్రేమావతారుడు) అనే ఆంగ్ల గ్రంథం వ్రాశారు. అందులో అమెరికా వంటి సంపన్న దేశాల్లోని దిగజారిన కుటుంబ వ్యవస్థపై ఎన్నో వివరాలు విషాద హృదయంతో, ఎంతో పరితాపంతో వ్రాశారు.

• సైన్సు టెక్నాలజీల్లో ఘనత, ఆర్థిక సౌష్టవం, భౌతిక జీవితానందానికి అన్ని హంగులూ వుంటున్నా, కుటుంబంలోని వ్యక్తుల్లో సామరస్యం నశించి పోయింది. ఇంట్లో నలుగురు కొడుకులు వుంటే వారిలో ఒకడు"గుండాగాడు", వాడి పని సమాజంలో అల్లకల్లోలాలు భీభత్సాలు సృష్టించుతూ బ్రతకటమే. ఇంకొకడు"మెంటల్ ట్రీట్‌మెంటు" పుచ్చుకుంటూ పిచ్చి ఆస్పత్రిలో వుంటాడు. ఇంకొకడు కేవలం స్వార్థపరుడు. ఒకడు మాత్రం యింట్లోని అమ్మా, నాన్నా, సోదర సోదరీమణులు - వీరి కోసం యేడ్చేవాడు. లౌకిక విద్యతో పాటు నైతిక విలువలు నేర్వక పోవటం, ఎలా బ్రతకాలో చెప్పక పోవటం, జీవిత లక్ష్యాన్ని తెలియజేయక పోవటం, ఎందుకు బ్రతకాలో వివరించక పోవటం, ముఖ్యంగా యింట్లోని వ్యక్తుల మధ్య ప్రేమ, సహకారం, సమరస భావనలు, త్యాగం, సేవ వంటివి అలవరచకపోవటం, పైన చెప్పిన పతనావస్థకు కారణాలుగా ఆమె వివరించారు. అంతేకాదు మనుషులుగా తమ స్థితిని మరచిపోయి పశువుల కంటే హీనంగా బ్రతుకుతున్న మరొక ఘోరావస్థను ఆ రచయిత్రి తమ గ్రంథంలో చిత్రించారు. ఏమిటో తెలుసా? యువతీ యువకులు స్వేచ్ఛగా ఒకరి నొకరు వివాహ ప్రసక్తి లేకుండా ప్రేమించుకుంటారు. తప్పు లేదని మనమూ ప్రోత్సహిస్తున్నాం. కానీ వారు యింకాTeen-Age లో వుండగానే పెళ్లి పెటాకులూ లేకుండానే, లైంగిక తృప్తిని ఆనందాన్నీ అనుభవిస్తున్నారు. బిడ్డని కంటున్నారు. నిన్నటి దాకా అలా పుట్టిన బిడ్డ తమ భవిష్యత్తు జీవితానికి అవరోధం అవుతాడు కనుక గర్భస్రావం తప్పకుండా చేయించుకొనేవారు. మన ఆశీస్సులు ఈ చర్యకు కూడా వున్నాయి. కానీ యిప్పుడు ఆTEEN-AGE లో గర్భం దాల్చిన అమ్మాయి, గర్భం కలిగించిన అబ్బాయి కలిసి ఒక సాహస కార్యం చేపట్టి, తద్వారా చాలా సంతోషిస్తున్నారు! ఏమిటో తెలుసా! వినండి. కడుపులో పడ్డ బీజాన్ని స్రావం ద్వారా పోగొట్టుకొనక, తొమ్మిది నెలలూ మోసి, ఆరోగ్యంగా కడుపులోని శిశువును పెంచి పోషించి, బిడ్డను ప్రసవించుతున్నారు. తర్వాత ? ఆ బిడ్డను తమ చేతులతో సైన్సు పరిశోధకుల కోసం అమ్ముకుంటున్నారు. ఆ పసిగుడ్డు మెదడుకు, గుండెకూ, వివిధ అవయవాలకు రేటు బేరం చేసి, ఇన్ని వేల డాలర్లు అని వెల నిర్ణయించి తమ కడుపున పుట్టిన శిశువును అమ్ముకోవటం కోసం క్యూలో నిలబడుతున్నారు, వివాహం కాని తల్లి దండ్రులు! ఇది మానవత్వమేనా? పశువులు కూడా తమకు అప్పుడే పుట్టి భూమి మీద పడిన శిశువులపై ప్రేమ, వాత్సల్యాలకు వర్షిస్తాయే? మనుషులై పుట్టి ప్రవర్తించే ఈ పద్ధతి పశువుల

కంటే హీనమై పోయిందే అని మీకూ బాధ కలగటం లేదా? పైన చెప్పిన 'జబ్బు' అమెరికా నుంచి యూరప్ దేశాల్లోకి కూడా వ్యాపించుతోందని ఆ రచయిత్రి తమ రచనలో ఎంతో గుండెలు బాదుకుంటూ వాపోయారు! చివరికి మన వూళ్లో నూ, మన యింట్లోనూ జరగబోయే పరిస్థితి అదేననీ, రేపో మాపో ఆ విధమైన ఆలోచన మన పిల్లలలోనూ కలుగుతుం దనీ, అది దేశ కాల పరిస్థితుల ప్రభావమనీ మనమూ సరి పెట్టుకొని బ్రతుకుదామా ? అలా సరిపెట్టుకొని బ్రతికితే రానున్న తరాల్లో మన సమాజంలో చూచేది నరరూప రాక్ష సులనే! "అందుకు బాధ్యత పిల్లలది కాదు! వారిని అటువంటి దుస్థితికి బలిచేసిన పెద్దలదే!" అన్నారు "MAN THE UNKNOWN" అనే గ్రంథంలో నోబుల్ బహుమతి పొందిన బయాలజీ సైంటిష్టు శ్రీ ఎలెగ్జిస్ కేరల్.

అటువంటి ఘోరమైన పైశాచిక, పాశవిక ప్రభావాల నుంచి కుటుంబ జీవితాలను కాపాడటం కోసమే "Harmony at Home" "సంసారాల్లో సామరస్యం" అనే అంశంపై మన కుటుంబ పెద్దలంతా ఆలోచించాలనీ, యిక నైనా మన గృహసీమల్లో సామరస్యం వెల్లి విరిసి మన ముందు తరాల బిడ్డలంతా మానవత్వ విలువలతో బ్రతకాలనీ భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు ఆశిస్తున్నారు. అందుకు మార్గాలు సూచిస్తున్నారు.ఇటువంటి దురవస్థ మన కుటుంబ జీవితాల్లో ప్రవేశించి, మానవత్వపు విలువలు లేకుండా బ్రతికే సమాజాన్ని సృష్టించిందని కూడా ఎలెగ్జిస్ కేరల్ (Elexis Carrel) తమ రచనల్లో వ్రాసారు. అయితే కలికాల ప్రభావం చేత ఈ శతాబ్దంలో, ఈ యుగంలో మానవాళి ఎలా ప్రవర్తించేదీ మహాభారతంలోని అరణ్యపర్వంలో వ్యాస మహర్షి సూచిస్తారు. (అర | | చ || 300)

సుతు దవమానించు జనకు,<br>
బతి నవమానించు భార్య, పడతులు పతులుఁ<br>
మతి నొండురువుల మెచ్చక<br>
సతతము జరియింతు రిష్ట సంచారములఁ

కొడుకులు తల్లితండ్రులను అవమానిస్తారు. భార్య భర్తను అవమానిస్తుంది. భార్యాభర్తలు ఒకరి అభిప్రాయాలతో ఒకరు ఏకీభవించక, గౌరవించక ఎల్లప్పుడు స్వేచ్ఛగా తమ యిష్టానికి తగినట్లుగా ప్రవర్తిస్తూ వుంటాంకొ. అనేది ఈ యుగంలోని కుటుంబ సభ్యుల పరిస్థితికి 6000 సంవత్సరా లనాడే మహాభారత గ్రంథంలో చేసిన చిత్రణఅ దీని యొక్క ఫలితమే సంసారంలో సామరస్యం లేకపోవటం. మహా భార తంలోనే గల మరొక వర్ణన సరిగ్గా ఈనాటి మన గృహ జీవనాన్ని ప్రతిబింబిస్తుంది.

"తన గృహమున నభ్యాసం<br>
బున మెలగెదు నంధు చందమున, సంసారం<br>
బున దిరుగు మూఢు డెరుగడు<br>
వినుత మోక్ష పదము విమల వివేకా"

(శాం. పం. 532)

"ఒక గ్రుడ్డివాడున్నాడు. అతడు తన స్వగృహంలో అలవాటు చొప్పున తన పనులను తానే స్వయంగా నిర్వర్తిస్తూ వుంటాడు. మెల్లిగా అడుగులు వేస్తూ, చేత్తో తడు ముకుంటూ కళ్లు కనుపించకపోయినా ఎన్నెన్నో పనులు చేయగలడు. మూర్ఖుడైన మానవుడు కూడా అలాగే సంసా రంలో బ్రతుకుతూ మోక్ష ప్రాప్తిని చెందలేడు". మోక్షం అంటే ఏదో పరమాత్మలో ఆత్మ కలిసిపోవటం అనే అర్థమే కాదు! మనం పొందే దుఃఖం నుంచి విడిపడి జీవితంలో సుఖ సంతోషాలు పొందగలగటం కూడా యిప్పుడు మనకు అవ సరమైన మోక్షమే!అలాగే మనం అనుభవించే దారిద్ర్యం నుంచి బయటపడి ఆర్థికంగా సౌష్టవం పొందగలగటం కూడా మనకు అవసరమైన మోక్షమే. ఇలా యిహజీవితాల్లోని బలహీనతలను పోగొట్టుకొని, శక్తి వంతులు కావటం కూడా మోక్షమే ! భావ దాస్యం పోగొట్టుకొని తన సంసారాన్ని తానుగా, తన నిర్ణయాలతో స్వతంత్రంగా పోషించటం కూడా మోక్షమే ! కానీ మనం కూడా గ్రుడ్డివారి వలె ఉంటున్నాం.



సత్యం సుఖాన్ని, తపస్సు శోకాన్ని, రజస్సు కష్టాన్ని కలిగిస్తాయి.

అందుకే మనకు బ్రతుకంటేనే భయం. బ్రతుకంటే పరిష్కరించలేని సమస్యలు. జీవితం అంటే విడదీయలేని ముడి, ఎదుర్కోలేని భీకర సవాలుగా మనం బ్రతుకు తున్నాం. అందుకే సంసారాలు సామరస్యానికి నోచుకోవటంలేదు. చిన్నా భిన్నమై పోతున్నాయి సంసారాలు. గుడ్డివానికి అంతా చీకటే దృష్టి కలవాడే సృష్టిలో గల సామరస్యాన్ని కనగలడు. అలాగే జ్ఞాన దృష్టి సామరస్య సృష్టి కలిగిస్తుంది. సామరస్యం జీవితానికి వెలుగు.

## ఇల్లు – సామరస్యం

యిల్లు, సామరస్యం అనే పదాలకు గల విశిష్టమైన భావాలను, అర్థాలను మనం గుర్తించాలి. కాకపోతే మనం బ్రతికేది యింట్లో కాదు. సత్రంలో అనిపించుతుంది. ఆధునిక జీవితం యొక్క ప్రభావం చేత ప్రతి మనిషీ" బిజీ" అయి పోతున్నాడు రాత్రి ఏ 12 గంటలకో పడుకోవటం. ఉదయం 7 గంటలకు నిద్ర లేవటం బ్రేక్ ఫాస్టు చేసి ఉద్యోగ నిర్వ హణకు పరుగులు తీయటం. రాత్రి ఏ 10గంటలకో యింటికి రావటం. తిని పడుకోవటం. ఇదే దినచర్య! "యింటికి , హోటలుకి తేడా ఏమిటండీ ?" అని వాపోతుంది యిల్లాలు. "నీ ముఖాన సంపాయించి పడేస్తున్నాను కదా !", అంటాడు భర్త. చివరకు"సంపాదించి పడేయటం" అనే మాట "పాలిచ్చే గొడ్డుకు మేత వేయటం వంటిది.", అనే పరిస్థితికి దారి తీస్తోంది మన సంసారాల్లో.

"A Structural Unit is a House" అన్నారు.

" A Functional Unit is a Home" అన్నారు.

నాలుగు గోడల మీద కట్టిన భవనం ఒక భవనం మాత్రమే. కానీ అందులో కొందరు కుటుంబ సభ్యులు చేరి, అందరూ కలసి బ్రతకటానికి చేసే సాధనతో కూడినప్పుడు దాన్ని"Home" అంటారు.

పల్లెల్లో హాయిగా, విశ్రాంతిగా చల్లని గాలి పీల్చుకోవ టానికి వీలుగా పెద్ద పెద్ద లోగిళ్లు వుంటాయి. విశాలమైన ఆవరణలో, చెట్లమధ్య యిళ్లు కట్టుకుంటారు. కానీ మహాన గరాల్లో యిరుకు గదుల్లో, సూర్యరశ్మి చొరని యిండ్లలో, స్వచ్ఛమైన గాలికి నోచుకోలేక బ్రతక వలసి వస్తోంది. ఒక గదిలో అయిదుగురు కుటుంబ సభ్యులు బ్రతకాల్సి వస్తోంది. అక్కడ డబ్బు దొరుకుతుందిగాని, జానెడు చోటు దొరకటం దుర్లభం. 'అమ్మా, నాన్నా' ఆదివారం యింట్లో వుంటారు కదా! అంచేత పిల్లలంతా నడి వీధిలో పడి, సినిమా హాల్లోనో, బీచిల్లోనో బజారుల్లోనో తిరుగుతూ గడుపుతారు, "యిల్లు"

## వింతలు విడ్డూరాలు

* న్యూయార్క్ ప్రక్కనే ఉన్న బ్రూక్లిన్ లో వైమోస్ అనే ముఠా ఉంది. వీళ్లు తమ రేట్లని అచ్చువేసి పంచారు. ముక్కుమీద గుద్దాలంటే రు.61/- దవడ విరగ కొట్టా లంటే రు.౧౦౦ లు. చెయ్యి, కాలు విరగ కొట్టాలంటే రు. 150/- లు . జాగ్రత్తండి మరి.

* 1981 డిశంబర్ 2వ తేదీన ఇంగ్లీష్ ఛానల్ పై 9,000 మీటర్ల ఎత్తులో జెట్ విమానంలో సిండి స్మిత్, స్టీఫెన్ బ్రౌను అను వారిద్దరూ పెళ్ళి చేసుకున్నారు. ఎంచక్కా వారికి కళ్యాణ మండపం అక్కరలేదు.

* హైదరాబాద్‌లో వున్న ముస్లిం యువతికి, దుబాయ్‌లో ఉన్న ఒక యువకునికి మధ్య 1983 జూలైలో ఫోన్ ద్వారా పెళ్ళి జరిగింది. ముహూర్తం టైం పెండ్లికి ఆమోదం తెలుపుతూ పెండ్లి కొడుకు టెలిఫోను ద్వారా తెలియ జేశాడు.

* టాల్‌స్టాయ్ వ్రాసిన స్ట్రైడర్ అను కథను. 26 సార్లు త్రిప్పి వ్రాశాడుట. సమరము - శాంతి అను బృహత్తర నవలను ఆయన భార్య ఏడు పర్యాయములు శుద్ధ ప్రతులు వ్రాసింది. ఇది అత్యంత పెద్ద నవల. పుటల సంఖ్య 2,400 రచనా కాలం 6సం.



ఆగ్రహం అంత శీఘ్రముగా వేరేదేది హానిమార్చలేదు.

అంటే అర్థం "కేవలం తలదాచుకొనే చోటు" అని మహానగర జీవితాల్లో అనిపించుతుంది. కానీ 'యిల్లు' అనేది ఆత్మీయతలకు, మమతానుబంధాలకు, స్వార్థత్యాగానికీ, పరస్పర అభివృద్ధికీ మానవత్వపు విలువలకూ నెలవైన పవిత్రమైన మందిరం అనే అనుభవం ఈనాడు మనకు లోపించటం మన దురదృష్టం. "Harmony' అంటే 'సామరస్యం' అని అర్థం. అయితే ఈ ఆంగ్ల పదాన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రత్యేకమైన అర్థాలతో అన్వయించటం జరుగుతుంది. (1) భిన్న భిన్నమైన భావాలు, అభిరుచులు, అనుభూతులు కూడా కలసిపోయి ఏకత్వానుభవం పొందటం Harmony అనే ఆంగ్ల పదానికి గల ఒక అర్థం. (2) అందమైన రీతిలో, వివిధమైన వస్తువులను ఆకర్షణీయంగా అమర్చటం కూడా 'హార్మోని' అనే మాటకు అర్థం. (3) భిన్నభిన్నమైన శ్రుతులు, రాగాలు, ధ్వనులు ఒక శ్రావ్యమైన సంగీత లహరిగా వెలువడటం కూడా 'హార్మోని' అనే మాటకు మరొక అర్థం. మొదటిది మనుష్యుల మనస్సులకు, ఆశలకు ఆశయాలకు సంబంధించినది. రెండవది భౌతికమైన పదార్థాల అమరికకు సంబంధించినది. మూడవది శబ్ద మాధుర్యానికి చెందినది. అదే జీవన లయ!

కనుక సంసారంలో సామరస్యం అనేది కూడా పై రీతిగా భౌతిక, మానసిక, శారీరకమైన స్థాయిలలో మన నిత్య జీవితాలలో ఒక అనుబంధాన్ని, ఆకర్షణను, అందాన్ని చేర్చి కూర్చటంలో సహకరించాలి. ఈ జగత్తంతా ఒక యిల్లే! ఈ 'విశ్వ గృహం' లోని దంతా దైవ సృష్టిలోని పరమాద్భుతమైన విశేషమే.దయ కల ప్రతి హృదయం దైవానికి ఒక నివాస గృహం.

మనం ఒక యింటో ఒక కుటుంబంగా జీవిస్తున్నాం. అటు వంటి మనలో, మన హృదయ మందిరాల్లో దైవం నివసిస్తూ వుంటాడు. ఇదే నిజమైన సామరస్య జీవితానికి పునాది, ఒక మూల సూత్రం. మన హృదయాల్లో ఈ రీతిగా దివ్యత్వానికి చోటివ్వక, మనలో దైవానికి చోటివ్వక మితిమీరిన కోరికలనే దయ్యాలకూ, దురహంకార పిశాచానికీ చోటిస్తే అది సామరస్యానికి భిన్నమైన విరసత్వానికీ, విభేదాలకూ దారితీస్తుంది.

సృష్టి అంటేనే సామరస్యానికి చిహ్నము. సామరస్యంలోనే వికాసం వుంటుంది. ఏ యింట్లోని మనుజుల్లో సామరస్యం లేదో ఆ యింట్లో బుద్ధి వికసించదు. ఆ యింట్లో ప్రతిభ (Talent) రాణించదు. ఆ యింట్లోజీవితం శోభించదు. సామరస్యం మానవతకు మరొక పేరు.

మన శరీరం ఒక అపూర్వమైన సృష్టి, జీవన సామరస్యాలకు సంకేతం. భౌతికం, మానసికం, ఆధ్యాత్మికం ఈ మూడింటినీ సమన్వయ పరచటమే జీవితంలోని సామరస్యానికి చిహ్నం. హృదయం, వూపిరి, రక్త స్పందన ప్రసారాలు, ఇదొక జీవన ప్రకృతిలోని సామరస్య స్వరూపం. ఈ ప్రాకృతిక సామరస్యం లేకపోతే జీవితమే లేదు. అదే రీతిగా మనస్సు, మాట, చేతలలో సామరస్యం ప్రతి మనిషిలోనూ పుట్టుకతోనే ఏర్పడుతుంది. కానీ పెంపకంతోనూ, బాహ్య ప్రభావాల చేతనూ ఈ త్రికరణములలోని సామరస్యాన్ని మనం కోల్పోయి, దుఃఖానుభవాన్ని పొందుతున్నాం. అలాగే శారీరకంగా వాత, పైత్య, శ్లేష్మ తత్త్వములలోని సామరస్యమే ఆయుర్వేద శాస్త్ర రీత్యా శారీరకమైన ఆరోగ్యానికి మూలం. సత్వగుణం, రజోగుణం, తమోగుణంల సామ్యావస్థయే ఆధ్యాత్మిక జీవితానుభవానికి మూల సూత్రం. అదే రీతిగా ఒక కుటుంబములోని వ్యక్తులలో మానసికంగా, భావనాత్మకంగా, క్రియాన్వితంగానూ ఒక సామరస్యం సహజంగా నెలకొల్పబడిననాడు ఆ కుటుంబములోని వ్యక్తుల కలలు యధార్థాలవుతాయి. వారి సాధనలు సఫలీకృతాలవుతాయి. వారి ఆశయాలు సిద్ధిస్తాయి. ఇది సృష్టిలోనే గల ఒక మర్మం ఇదే వికాస జీవన ధర్మం. మనిషిలో గల ప్రతి జీవాణువులోనూ సామరస్య సూత్రంవుంది. కుటుంబములోనిప్రతి మనిషిలోనూ అదే జీవన సూత్రం కావాలి.



*ఎంత గింజుకున్నా, భగవదానుగ్రహం లేనిదే నువ్వేమి సాధించలేవు.*

## సామరస్య అవతరణ

భగీరథుడు ఘోర తపస్సు చేసి శివుని మెప్పించి దివి నుంచి భువికి గంగమ్మ తల్లిని రప్పించ గలగటం కూడా ఎంతో తేలిక పని అవుతుందేమో కానీ, ఈ రోజుల్లో కొన్ని సంసారాలలోగల వ్యక్తులలో సామరస్యం నెలకొల్పటంమాత్రం ఎంతో కష్టమైన పనిగా కనిపించుతోంది. మనం అందరం సంసారాలు చేస్తున్నాం. కానీ మన సంసారాల్లో ఈ సామరస్యం నిజంగా వుందో లేదో తెలీటం లేదుగానీ, వున్నదనే అందరం తృప్తిగా బ్రతుకుతున్నాం. ప్రతి కుటుంబంలోనూ ఈ దిగువ చెప్పిన అవస్థలు వుంటూ వుంటాయి.

1)కొన్ని యిండ్లలో తుఫాను ముందు ఆవరించే శాంతి వంటిది వుంటూ వుంటుంది. (dull Before the Storm) అటువంటి శాంత పరిస్థితిని చూచి అదంతా సామరస్య ప్రభావం అనుకోవటం అవివేకం. అది తాత్కాలికమైన ప్రశాంతి ! రేపు వారి గృహాల్లో వీచే దురాశలనే పెనుగాలులలో, విద్వేషాల పిడుగుపాటులో, నిరాశామేఘాలు అలముకుంటూన్నప్పుడు అందరిలోనూ ఈనాడున్న (So-Called) కుహనా సామరస్యం కాస్తా పెనుగాలిలోని చిరుదీపం వలె ఆరి పోతుంది. దాని ఫలితం సంసారంలోని వ్యక్తులు తలొక దారిలోనూ విసిరివేయబడడమే. కనుక యిటువంటి పై పై శాంతిని, పై పై సామరస్యాన్ని కాదు, మనం ఆశించ వలసింది. పైన చెప్పిన పెనుతుఫానులు సంభవించినా చెక్కు చెదరక, పట్టు వదలక, చిట్ట చివరి దాకా అందరిలోనూ నిలబడే అనుబంధమే నిజమైన, నిత్యమైన సామరస్యం. దాన్ని మనం ఏర్పరచుకోవాలి.

2)అందరి యిండ్లలోనూ ఎన్నెన్నో సమస్యలు పుట్టుకొస్తూ వుంటాయి. చాలామంది ఈ సమస్యలను గుర్తించరు. అంగీకరించరు. పైగా వాటిని ఉపేక్షిస్తారు. వాటిని గుర్తించి విశ్లేషించి, సమస్యలను పరిష్కరించే దక్షత లేని వారే వారంతా. కొంత మంది, దృష్టిలో సమస్య వున్నదని అంగీకరిస్తే అది వారి Prestige కి లోపంగా భావిస్తారు. "నాకే సమస్యలూ లేవు. నేను అంత గొప్పవాణ్ణి " అనుకుంటూ భ్రాంతుల్లో వారు జీవిస్తారు. కొందరు సమస్యను గుర్తించినా కూడా దానికి పరిష్కారం నిర్ణయించలేక, బలహీనతల చేత, పరిష్కారాన్ని వాయిదా వేస్తారు. ఇటువంటి వారి జీవితాల్లో ఒకానొక నాడు ఈ చిన్న చిన్న సమస్యలు అపరిష్కృతంగా రోజు రోజుకూ పెద్దవైపోతూ చివరకు ఒక్కసారిగా వారిపైన కొండ విరిగి పడినట్లు విరుచుకు పడతాయి. అప్పుడు ఆ సంసారాలు చితికిపోతాయి. కనుక సమస్యను ఉపేక్షించక, సమస్యా పరిష్కారాన్ని వాయిదా వేయక, తక్షణం సమస్యలను పరిష్కరిస్తూ, సామరస్యాన్ని పోషించుకుంటూ బ్రతకటమే నిజమైన సామరస్య అవతరణకు, పోషణకూ మార్గం. కుటుంబ సమస్యలు ఏవీ జటిలమైనవి కావు. ఎంత సమస్య కూడా నిజంగా అంత అసాధ్యమైనది కాదు. కనుకనే "తెలివి తేటలు" అంటే అర్థం తన నిత్య జీవితంలో వచ్చేసమస్యలకు చక్కని, సంస్కారవంతమైన పరిష్కారాలను సాధిస్తూ, కుటుంబంలోని అందరితోనూ సామరస్య సూత్రాన్ని బలపరచటమే అని నిర్వచించారు ఒక తత్త్వవేత్త. ఈ వివేకం లేకపోవటం చేతనే, ఒక యింటి యజమాని కుటుంబ సభ్యులందరినీ సమస్యలకు పాలు చేసి హఠాత్తుగా యింట్లోనుంచి ఒక అర్థరాత్రి పారిపోయి ఎక్కడో ఒక సన్యాసిగా బ్రతుకుతాడు. ఇంకొకడు సమస్యల వత్తిడికి తట్టుకోలేక టెన్షన్ అంటూ ఒక త్రాగుబోతు వెధవ అవుతాడు. కొందరు ఆత్మహత్య చేసుకుంటారు. కనుక ఉపేక్షించే బుద్ధి, వాయిదా వేసే మనస్తత్వం నిజమైన సామరస్యాన్ని నెలకొల్పటంలో విఫలం చెందుతాయి. అని గుర్తించాలి. అవి బ్రతుకులను పెడదారి పట్టిస్తాయి.

3)భారతీయ సంస్కృతి అనేది ఈ కుటుంబ సామరస్యం అనే పునాదిపైనే నిర్మించబడిందని గుర్తించాలి. సమ్యక్ విచారణ - సమ్యక్ నిర్ణయం అనే రెండు సూత్రాలూ సామరస్యానికి రెండు నేత్రాలవంటివి. అదే భారతీయ కుటుంబ వ్యవస్థలో లక్షల సంవత్సరాలు గడిచినా, యుగాలు గతిం

చినా సామరస్య సంస్కారాన్ని నిలబెట్టిన ధర్మం. అదే శివ పార్వతుల సంసార గాథ. భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు ఆధునిక కుటుంబాల వారికి ఈ పరమార్థాన్ని వివరిస్తారు. శివపార్వతుల సంసారం ఎటువంటిది ? ఆ ఆది దంపతుల కుటుంబ పరిస్థితులు ఎటువంటివి ? పరమ శివుని ముద్దుల నాగాభరణం జిహ్వాచాపల్యానికి, వినాయక స్వామి ఎలుకను చూచి బుస్సు మంటూ నోరు తెరుస్తుంది. అటువంటి శివస్వామి అలంకారమైన నాగాభరణాన్ని చూచి, కుమార స్వామి అలంకారమైన నాగాభరణాన్ని చూచి, కుమార స్వామి వారి వాహనం అయిన నెమలి ఎగిరి కాళ్లతో తన్ని నోటితో కరుచు కోవాలని చూస్తుంది. అయ్యవారి వృషభవాహనాన్ని చూచి, అమ్మవారి సింహ వాహనం ఆకలి వేసినప్పుడల్లా గర్జిస్తూ వుంటుంది. పరస్పర విరుద్ధ స్వభావాలు శివ పార్వతుల సంసారంలో యిలా చోటు చేసుకొని కూడా, ఒక ఆదర్శ కుటుంబానికి ప్రతీకగా నిలిచాయి. ఇది మన సంసారాల్లో కూడా ఒక సదాశయాన్ని గుర్తింప జేసి, సామరస్యాన్ని నెలకొల్పటంలో తోడ్పడాలి. అంటారు భగవాన్ శ్రీ సత్య సాయిబాబా.

''జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ '' , అని కాళిదాస మహాకవి ఆది దంపతులను స్తుతిస్తారు. మన తెలుగు దేశంలోని సముద్ర తీరంలో, రేపల్లె తాలూకాలో ఒక గ్రామంలోని దేవాలయంలో గల శివ పార్వతులను 'విమర్శాంబ' అనీ 'ప్రకాశేశ్వర స్వామి ' అని పిలుస్తారు ! లోకమాత అయిన పార్వతి'విమర్శ' స్వరూపిణి. మన సంసారాల్లోని ప్రతి స్త్రీ, ప్రతి తల్లీ ఈ ' విమర్శ ' (Analysis) తత్త్వానికి ప్రతినిధి. సంసారంలో స్త్రీ దృష్టిలో ఈ విశ్లేషణ వుంటుంది. ఆమె చదువుకొనక పోయినా, ఉద్యోగం చేయక పోయినా తన గృహ సామ్రాజ్యంలోని ప్రతి చిన్న అంశాన్ని కూడా లోతుగా, విస్తృతంగా విచారించి నిర్వహిస్తుంది. కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ ' అనటంలోని యథార్థం యిదే. ఈ విచారణ యొక్క ఫలితాన్ని సంసారంలోని పురుషుడు తన 'తుది నిర్ణయంగా ' స్వీకరిస్తాడు. శివతత్త్వం 'ప్రకాశ' తత్త్వం. దీన్నే Enlightenment అంటాం. ఈ రీతిగా ప్రతి సంసారంలోనూ గల భార్యా భర్తలంతా జీవితం పట్ల ఈ విశ్లేషణ జ్ఞాన వంతమైన నిర్ణయం చేసే దక్షత కలిగి వుండాలనే

## ప్రశ్నలు - సమాధానములు

1. పృథ్వి ఏతరహా క్షిపణి ? 2. ఆంధ్రప్రదేశ్ కు గల సముద్ర తీరము ఎంత ? 3. హార్సిలీ కొండలు ఎక్కడ గలవు ? 4. రాజ్యాంగ సవరణ చేసే నిబంధన ఎన్నవది? 5. హరిజనులకు ప్రస్తుతం కేటాయించ బడిన రిజర్వేషన్ల శాతం ? 6. భారత దేశంలో ఎక్కువ మందికల గిరిజన తెగ ? 7. 'డ్రై ఐస్ ' అని దేనిని అంటారు ? 8. నక్షత్రముల దూరమును కొలుచుట వలన ఉపయోగించు ప్రమాణము ? 9. క్షయ వ్యాధి కారక బాక్టీరియా ఏది? 10. పక్షులను వివరించే శాస్త్రము ఏమంటారు ? 11. పాలకు తెల్లదనము ఎందువలన వచ్చును .

సమాధానములు :--1. సర్ఫేస్ టు సర్ఫేస్ 2. 965 కి. మీ. 3. ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరు, అనంతపూర్ జిల్లాలలో 4. ఆర్టికల్ 368 5. 15 శాతం 6. సంతాలులు (బెంగాల్, బీహార్‌లు) 7. కార్బన్ డై ఆక్సైడ్ (ఘన స్థితిలో) 8.కాంతి సంవత్సరం 9.మైకో బాక్టీరియాట్యుబర్ క్యులోసిస్ 10. ఆర్నిథాలజీ 11.లాక్టోజ్

సత్యాన్ని ఆది దంపతులైన శివ పార్వతుల తత్త్వం మనకు వివరిస్తుంది.విభిన్న దృక్పథాలు వుండరాదని కాదు. ఈ దృక్పథాలలోనే అందరికీ అవసరమైన సామరస్య సూత్రాలు అన్వేషించాలి. అది 'గతిలేక అంగీకరించాను' అనే Passive Acceptance కాదు. అతని దృక్పథం మేలైనదని తెలుసు కొన్నప్పుడు, అతని దృక్పథమే నాది అనే క్రియాశీలమైన అనుసరణ (Active Participation) కావాలి. అదే కుటుంబంలోని వ్యక్తుల సామరస్య రహస్యం.



*స్నేహితులను నిశితంగా పరీక్షిస్తే శత్రువులను ప్రేమించగలము.*

## సామరస్య అనుభవానికి చిట్కాలు

భారతీయ సంస్కృతిలో వివాహ వ్యవస్థ, గృహస్థాశ్రమ ఆశయాలూ ఎంతో విలువైన సందేశాలను మనకు అందజేస్తాయి. వివాహ మంత్రాలలో గల వైదిక మహర్షుల అనుభవాలను తెలుసుకొనగలిగితే, అలా జీవించ గలిగితే సంసారాల్లో సామరస్యం ఒక్కటే కాదు. సమరసతలో గల సంతోషం, సంతృప్తి, సిద్ధి మన సొత్తులు అవుతాయి. 'మా మనస్సులు ఒకటి కావాలి. మా మాటలు ఒకటి కావాలి మా నడతలు ఒకటి కావాలని మా కుటుంబములో ఈ యేకైక లక్ష్యం సిద్ధించాలి !' అంటూ కుటుంబ సభ్యులందరూ చెప్పు కోవలసిన దీక్షా వాక్యాలు, ప్రతిజ్ఞా వచనాలు'అధర్వణ వేదం'లో గల మంత్రాలలో ఎన్నో వున్నాయి. దురదృష్ట వశాత్తు కేవలం బ్రతకటం కొరకు విద్య అనే భ్రాంతిలో ఈ వెలితిని జీవితాల్లో పెంచుకొని సామరస్యాన్ని కోల్పోయాం. ఎందుకు బ్రతకాలో, ఎలా బ్రతకాలో తెలుసుకోలేక పోవటం చేత మన విద్య అసంపూర్ణ విద్య అయిపోయింది. ఆ లోటును తీర్చుతున్నారు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

"Man the Unknown" లో శ్రీ ఎలెగ్జిస్ కేరెల్, " Positive Mental Attitude" లో శ్రీ నెపోలియన్ హిల్ సంసారంలో సామరస్యానికి ఎన్నో మార్గ దర్శక సూత్రాలు వివరించారు.

1)ఎదుటి వ్యక్తి అభిప్రాయాలలో గల విలువను గుర్తించ గలిగితే తన అభిప్రాయం నెగ్గాలి అనే పట్టు విడిస్తే, భావాల్లో సామరస్యం కలుగుతుంది.

2)సుఖం అనేది నాకు నేను అనుభవించటంలో లేదు. ఇతర కుటుంబ సభ్యులను సుఖ పెట్టటంలోనే నాకు నిజమైన సుఖం వుంది, అని గుర్తిస్తే కుటుంబంలో సామరస్యం తప్పక నెలకొంటుంది.

3)ప్రతి కుటుంబ సభ్యుడు కష్టపడి పని చేయాలి. "కృషితో నాస్తి దుర్భిక్షం" అనే సూక్తిని అమలు చేయాలి. నేను చేసే పనిలో విజయం సాధించాలంటే యితర కుటుంబ సభ్యుల సహకార కృషి కావాలని గుర్తించి, వారిని కూడా తన కృషికి దోహదం చేసే వ్యక్తిత్వంతో నింపాలి. అప్పుడు కుటుంబంలో ఒక వ్యక్తి చేసే కృషి సఫలీకృతం అవుతుంది. అటువంటి విజయానికి అందరూ భాగస్వాములే. విజయ ఫలి తాలయిన సుఖ శాంతులు, అభ్యుదయం కూడా అప్పుడే అందరికీ అందుతాయి.

4) 'నేను చాలా తెలివిగలవాణ్ణి' అని ఒక కుటుంబ సభ్యుడు తనకు తాను గర్విస్తే అది అహంకారానికీ, స్వార్థా నికీ దారి తీస్తుంది. తన తెలివి తేటల రహస్యాన్ని కుటుం బంలోని ప్రతి వ్యక్తికీ చెప్పాలి. తెలివి అంటే పరీక్షల్లో నూటికి నూరు మార్కులు తెచ్చుకోవటం కాదు. జీవిత సమస్యల పట్ల సరియైన దృక్పధాన్ని, పరిష్కారాల పట్ల సరియైన నిర్ణయాన్ని, వాటిని సాధించటం పట్ల సరియైన కార్యనిర్వహణ నైపుణ్యాన్ని కలిగి వుండటమే నిజమైన 'తెలివి'కి గుర్తు. అదే విజ్ఞత! కుటుంబ సభ్యులలో ఈ తెలివి తేటలు పెంచాలి.

5) కుటుంబంలోని ప్రతి వ్యక్తీ తన తప్పులను తాను తెలుసుకొని అంగీకరించగలగాలి. తప్పులు చేయటం, మాన సిక బలహీనతలు కలిగి వుండటం కుటుంబ శాంతికి భంగక రమైనవి కావు! అటువంటి బలహీనతల నుంచి మనిషి బయట పడే రీతిగా అతనిలో బలమైన నైతిక ప్రేరణలు కలిగించాలి. ఈ రీతిగా ఎన్నో సమిష్టి సూత్రాలను ఆధునిక మనస్తత్వ వేత్తలు కుటుంబ సామరస్యానికి మూలప్రాయమైనవిగా వివరించారు. ప్రేమ, సహనం, అనేవి అన్నింటికీ మించిన విలువలు. సోక్రటీసు భార్య అతని నెత్తిమీద కుండను బ్రద్దలు కొట్టింది పట్టరాని కోపంతో! "ఆహా! యిప్పటిదాకా గర్జించే మేఘం నేడు వర్షించింది" అంటూ ఆయన తన భార్య యొక్క దుడుకు తనాన్ని సమర్థించారు. ఆమె చల్లబడిపోయింది.



దేహాన్ని కాదు మనస్సును అలంకరించుకో.

ఈనాడు విశ్వశాంతి, ప్రపంచ శాంతి అంటూ మహో పన్యాసాలు యిచ్చే మనం కుటుంబంలోని శాంతి సామ రస్యాలను గురించి పట్టించుకోవటం లేదు. అదే మనం చేస్తున్న మౌలికమైన పొరపాటు. విశ్వశాంతి అనేది ఒక కల్ప వృక్షం అయితే, దాని యొక్క బీజం కుటుంబ శాంతిలోనే వుంది అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.

Where there is Righteousness in the mind
There is Beauty in character,
Where there is Beauty in the Character
There is Harmony in home
Where there is Harmony in Home
There is Orderliness in the town,
Where there is orderliness in the town,
There is Peace in the World.

ఏ మనస్సులో ధార్మికత వుంటుందో,
ఆ వ్యక్తి శీలంలో సౌందర్యం వుంటుంది.
ఎక్కడ సౌశీల్యవంతులయిన వ్యక్తులుంటారో
అక్కడ కుటుంబ సామరస్యం వుంటుంది.
ఎక్కడ కుటుంబ సామరస్యం వుంటుందో
ఆ పట్టణంలో సక్రమ జీవిత విధానం ఏర్పడుతుంది.
ఎక్కడ సక్రమ జీవిత విధానం వుంటుందో
ఆ దేశంలో, ప్రపంచంలో శాంతి వుంటుంది.

— ఇది భగవాన్ బాబా వారి సందేశం.

అందుకే ఈనాడు చచ్చిన తర్వాత ప్రాప్తించ వలసిన మోక్షాన్ని గూర్చి కాకుండా, బ్రతికి వుండగా మన కుటుం బాలలో పోషించుకోవలసిన సామరస్యాన్ని గూర్చి అధి కంగా తెలుసుకోవాలి, దాని కోసం కృషి చేయాలి. తన కుటుంబంలో ఈరీతిగా యదార్థమైన శాంతి సామరస్యాల పోషణను ఉపేక్షించి "నాకు మోక్షం, నాకు శాంతి" అనే ధోరణిలో పెద్దలు బ్రతకటం ఒక విధంగా అజ్ఞానమే! ఈనాడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి సందేశాలు ప్రపం చంలోని 100 దేశాలలో గల లక్షలాది కుటుంబాలలో ప్రవే శించాయి. "సాయి కుటుంబం" (Sai- Family) అనే పదం సర్వసాధారణమై ప్రపంచ వ్యాప్తమైన ప్రాచుర్యాన్ని పొందింది.

'నేను'నుంచి 'మనం' లోకి ఈ సాయి కుటుంబ సభ్యులు ప్రయాణం చేస్తూ, 'మనం' నుంచి "అందరం" అనే సార్వ జనిక లక్ష్యసిద్ధివైపు తమ జీవితాల్లో పురోగమిస్తున్నారు! ప్రతి కుటుంబంలోనూ భగవాన్ శ్రీ సత్యసాయి స్వయంగా ఒక సభ్యుడుగా ప్రవేశిస్తున్నారు! అద్భుతమైన ఆంతరిక ప్రేరణ, పరిణామాల ద్వారా ప్రపంచ జనావళి కుటుంబ వ్యవస్థలో నిజమైన సుఖ శాంతులు కల్గిస్తున్నారు. ఇటువంటి దివ్యప్రభావానికి లోనైన కుటుంబాలలో విద్యాధికులూ, విద్యావిహీనులూ, ధనికులు దరిద్రులు, అధికారులు అనధికా రులూ, పెద్దలు పిన్నలు, గొప్పవారూ కొద్దివారూ అనే అంత రాలు అంతరించి పోవటం చేత ఒక గ్రామంలో, లేదా ఒక పట్టణంలో గల యిటువంటి కుటుంబాలన్నీ ఒకచోట చేరి వివిధ సామాజిక సేవల్లో భాగస్వాములవుతాయి! వారంతా పట్టణ స్థాయిలోని వేల సంఖ్యలో గల సభ్యులతో కూడిన పట్టణ సాయి కుటుంబం! అనేక పట్టణాలనుంచీ, అనేక దేశాల నుంచీ ప్రశాంతి నిలయానికి లక్షలాదిగా సాయి కుటుంబ సభ్యులు వస్తారు. వారంతా వివిధ జాతులకు, వివిధ మతా లకూ, వివిధ భాషలకూ, సంస్కృతీ సంప్రదాయాలకు చెంది నవారే! అయినా వారందరిలోనూ సామరస్య జీవనం ప్రేమ ప్రాతిపదికగా వెల్లివిరుస్తోంది! అటువంటి వసుధైక కుటుంబం ఈనాడు ఈ కల్లోలిత, ఈ సంక్షుభిత, ఈ విద్వేష పూరిత ప్రపంచంలోనే ఒక యదార్థ సత్యంగా వికసిస్తూ, రానున్న శతాబ్దానికి శాంతి అభ్యుదయాలను అందించే పరమ లక్ష్యంతో ఓర్పుతో వేచి వుంది!

నేను, మీరూ, మనం ఈ "సాయి విశ్వ కుటుంబం"లోని సభ్యులం అవుదాం. * *

చెవులు రెండుగాని నోరు ఒక్కటే కావున ఎక్కువగా విను తక్కువగా మాట్లాడు.

# నేనెరిగిన విశ్వనాథ

డాక్టరు భావరాజు నరసింహారావు

వెయ్యి సంవత్సరాల పైబడి ఉన్న ఆంధ్ర సాహిత్య చరిత్రను సింహావలోకనం చేస్తే విశ్వనాథ సత్యనారాయణ గారికి ఒక విశిష్ఠ స్థానం ఉన్నదని నిశ్చయించుకుంటాం. గల్పికలూ, చిన్న కథలూ దగ్గర నుంచి నవలలూ, నాటికలూ, నాటకాలూ, గేయాలూ, ఖండ కావ్యాలూ, సాహిత్య విమర్శలూ, చివరకు రామాయణ కల్పవృక్ష మహాకావ్యం వరకూ ఎన్ని రకాల సాహిత్య ప్రక్రియలు ఉన్నాయో అన్నిటినీ రచించిన కవి సమ్రాట్టు ఆయన. ఊరికే రాయడమే కాదు, వ్రాసిన ప్రతి ప్రక్రియలోనూ తనదైన ఒక విశిష్ఠ ముద్రను వేసిన సిద్ధహస్తుడు విశ్వనాథ. అలాగే ఆయన బ్రతికి ఉండగానే నిశిత విమర్శలకు గురి అయి, అంత వివాదాస్పదుడైన కవి కూడా ఆంధ్ర సాహిత్య రంగంలో మరొకరు మనకి కనిపించరు.పద్య రచనలోనూ ప్రత్యేకత సంతరించుకున్నట్లే పద్య పఠనంలోకూడా పద్యాన్ని విరిచి చదివే ఒక చక్కటి బాణీ ఆయనది. మంచి మూడ్‌లో ఉన్నప్పుడు, లేదా ఎక్సైట్ అయినప్పుడు మహావక్తగా శ్రోతల్ని ఆకట్టుకునే శక్తిమంతుడు సత్యనారాయణగారు. ఆయనమీద అభిమానంతో, గౌరవంతో ఉండేవాళ్లు సభలు ఏర్పాటు చేసినప్పుడు కూడా. సభ సుఖంగా ముగిసేవరకూ వాళ్ల మనసుల్లో బెరుకుగానే ఉండేది. అయితే సరిగా అర్థం చేసుకున్నవాళ్లకి "నిండు మనంబు నవ్య నవనీత సమానము; పల్కు దారుణాఖండలశస్త్ర తుల్యము..." అన్నదానికి సత్యనారాయణ గారు చక్కని ఉదాహరణ ఆయన పలుకు - ముఖ్యంగా వేదికల మీద వాడిగా,వేడిగా ఉన్నా, ఆయన మనసు ఎంతో ఆర్ద్రం అయినదని సత్యనారాయణ గారి సన్నిహితులకు అందరికీ తెలిసినదే.

సత్యనారాయణగారిని 1932 నుంచి నేను ఎరుగున్నాను. అప్పటికి నాకు పద్దెనిమిదేళ్లు ఆయన బందరు బచ్చుపేటలోని వాళ్ల ఇంట్లో ఉంటూ " వేయి పడగలు" రాస్తున్న రోజుల్లోని ఒక సంఘటన యిది. ఆ ఇంట్లో నులక మంచం చుట్టూ తిరుగుతూ ఆయన "వే యిపడగలు" డిక్టేట్ చేస్తుంటే ఆయన రాసిన వచనాలన్నీ అలాగే డిక్టేట్ చేసేవారు పద్యాలు కొన్నాళ్లు మననం చేసి ఆయనే రాసుకునేవారు ఆయన తమ్ముళ్లు వెంకటేశ్వర్లు, రామమూర్తి, ఆయన అభిమాని అడివి కామేశ్వరరావు ఒకరి తరవాత ఒకరుగా రాస్తూ ఉండేవాళ్లు. ఒక్క నెల రోజుల్లో ఏ రిఫరెన్సు పుస్తకాలూ లేకుండా ఆయన వేయిపడగలు రాశారు. అంటే డిక్టేట్ చేశారు. ఓ రోజున రాత్రి వరకూ రాసిన కాగితాలు బొత్తి పెట్టి చూడగా, మధ్యలోని ఒక కాగితం కనబడలేదు. ఆ మాట చెబితే ఆయన చంపుతాడని భయం. తెల్లవారిన తరువాత కూడా మళ్లీ వెదికి, ఇహ లాభం లేదని... భయపడుతూ... భయపడుతూ... ఆ ముక్క ఆయనకు చెప్పాను. పోయిన కాగితానికి ముందు పేజీలోని చివరి వాక్యమూ, తరవాత పేజీలోని మొదటి వాక్యమూ చదివించుకుని ఆయన విన్నారు. పోయిన కాగితంలోని విషయం మళ్లీ ఆయన చెప్పగా వాళ్లు మరో కాగితం మీద వ్రాశారు... రెండు రోజుల తరువాత మొదట వ్రాసిన కాగితం దొరికింది. చూడగా, రెండోసారి సత్యనారాయణగారు చెప్పింది మొదట చెప్పిన దాంట్లో ప్రతి అక్షరానికీ సరిపోయింది! ఆయన ధారణాశక్తి ఎంత అద్భుతమైనదో చూడండి! ఛందోబద్ధం అయిన పద్యాలు కంఠస్తం చేయవచ్చుగానీ, వచనాన్ని ధారణ చేయటం దుస్సాధ్యమని మనకు తెలుసు.



*చెప్పిన వేళకు రానివాడు, కాలం విలువ తెలియని వాడు నీతిమంతుడని నమ్మకండి.*

ఆంధ్ర యూనివర్శిటీ 1934 లో నవలా రచన పోటీ నిర్వహించింది. సత్యనారాయణగారి "వేయి పడగలు"తో పాటు అడివి బాపిరాజు గారి "నారాయణరావు"ను కూడా చేర్చి బహుమతికి (వెయ్యి రూపాయలను 1500 లకు పెంచి) ఇద్దరికీ పంచి యిచ్చింది. బందరులో మేము 1930 లో సారస్వత మండలిని స్థాపించాం. ఆ సంస్థ తరఫున బందరు భీమ్మలు రావుసాహెబ్ శెడింబి హనుమంతరావు పంతులుగారి అధ్యక్షతన సత్యనారాయణగారి అభినందన సభ ఏర్పాటు చేశాం. తనతోపాటు బాపిరాజుగారిని కూడా ఆ సభకు సత్యనారాయణగారు తీసుకు వచ్చారు. ఇద్దర్నీ వేదికమీద కూర్చోబెట్టి దండలు వేశాం. సత్యనారాయణగారికి మొట్టమొదట సారిగా "కవిసమ్రాట్" బిరుదును యిచ్చి సన్మాన పత్రం సమర్పించాం, గౌరవించాం.

తరవాత సత్యనారాయణగారు ప్రత్యుత్తరం యిస్తూ, "ఈ బహుమతిని ఇవ్వడంలో ఆంధ్ర యూనివర్శిటీ వాళ్లు ఒక తెలివి తక్కువ పనీ, ఒక తెలివిగలపనీ చేశారు. నా వేయి పడగలకు సాటి మరో నవల లేదు. బహుమతిని ఇద్దరికీ సమంగా పంచటం శుద్ధ తెలివి తక్కువ. అయితే ఆ బహుమతిని నాతోబాటు మా బాపిబావకు ఇవ్వటం తెలివిగల పని. బాపిరాజుకు కాకుండా మరొకరికి ఇలా ఇచ్చి వుంటే యూనివర్శిటీ వాళ్ల డొక్కచించేసే వాణ్ణి అన్నారు. సభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. బాపిరాజు గారు లేచి సత్యనారాయణగారిని కౌగిలించుకున్నారు ఆనందబాష్పాలతో. అదీ సత్యనారాయణగారి వ్యక్తిత్వం.

సత్యనారాయణగారు ఉద్యోగం ఏదీ లేకుండా ఉన్న రోజులవి. తమ్ముడు వెంకటేశ్వర్లుగారు "కృష్ణా పత్రిక"లో పని చేస్తున్నారు. ముప్పయి రూపాయల జీతం. సత్యనారాయణ గారు, ఆయన కొడుకు (చిన్న కుర్రవాడు), ఆయన తల్లి, (ఆయన మొదటి భార్య అప్పటికి చనిపోయింది) వెంకటేశ్వర్లు దంపతులు - ఆ జీతపు రాళ్లతో ఆ సంసారం గడవాలి. చిన్న తమ్ముడు రామమూర్తి ఆగిరిపల్లిలో సంస్కృత కళాశాలలో చదువుకుంటున్నాడు. అందుకయ్యే ఖర్చు కూడా సరుబాటు చేసుకోవాలి అంత గడు రోజులవి

## సాయి భవాని

వివిధ విధాలపోయే, మనస్సుకి
విలువయిన, వ్యాపకం కలిపించి
విఘ్నాలు రాకుండా చూస్తూ, ధైర్యమిచ్చి
విజయ మూర్తిని, చేస్తాడు సాయిగణేశుడు.
జరామరణ, బాధాభయాలతో
జర జర అటు ఇటు దొర్లే వానికి
జ్ఞాన నేత్రం, తెరిపించి, వెలుగు చూపించి
జ్ఞాన మూర్తిని చేస్తాడు సాయి షణ్ముఖుడు
విషయ వలయంలో పడకుండా
విభూదినిచ్చి, వివేకం నేర్పించి
వైరాగ్యమనే కవచం వేసి
విలువయిన మూర్తిగా, చేస్తాడు సాయి శంకరుడు
పంచామృతాలు, పాలు త్రాగించి
పరమేశ్వరతత్త్వ మేమిటో, చూపించి
ప్రపంచంలో ఎలా మెలగాలో చెప్పి
ప్రశాంత మూర్తిని, చేస్తుంది సాయి భవాని.

**-- పి. రాజ్యలక్ష్మి రంగారావు**

బందరులో చిట్టూరి రామారావు అనే ఆయన బియ్యపు వర్తకుడు. తమకు కావలసిన బియ్యం అరువుగా సప్లయి చేయాలనీ, తనకు చేతికి డబ్బు అందినప్పుడల్లా ఇస్తూ ఉంటాననీ సత్యనారాయణగారు అడగలేక... అడగలేక... రామారావుని అడిగారు. రామారావుకు ఎంతో గౌరవం ఆయన మీద. సంతోషంతో అంగీకరించాడు. ఆ కష్టకాలం గడిచిపోయింది. సత్యనారాయణగారు విజయవాడ కాలేజీలో ఉద్యోగం చేస్తూ, తన రచనల మీద డబ్బు బాగా



*స్వయంకృషి లేనివాడికి ఏ భగవంతుడు తోడ్పడడు.*

సంపాయించి అక్కడ మేడ కట్టుకుని సుఖంగా ఉన్నారు. చాలా ఏళ్ల తరవాత-- దాదాపు ముప్పయి ఏళ్ల తరవాత - బందరులో ఆయనకు బియ్యం సప్లయి చేసిన రామారావు విజయవాడలో తన కూతురు గారి ఇంటికి వెళ్లాడు. ఓ రోజున సత్యనారాయణగారి ఇంటికి వెళ్లాడు-- ఆయనను చూద్దామని. అసలు ఆయనకు తను జ్ఞాపకం ఉన్నాడో లేదోననే అనుమానంతో, సత్యనారాయణగారు భార్యతోనూ, పిల్లలతోనూ వరండాలో చీట్ల పేక ఆడుతున్నారు. గేటు దగ్గర ఉన్న రామారావును గుర్తించి, లేచి వెళ్లి ఆయన్ను ఆదరంతో తీసుకు వచ్చి - "ఈయన ఎవరో మీకు తెలియదు. ఈయన నాకు అన్నం పెట్టి, నన్ను బ్రతికించినవాడు. ఆయన అన్నం పెట్టకపోతే నేను ఎప్పుడో చచ్చిపోయి ఉండేవాణ్ణి. మీరెవరూ ఈ భూమ్మీద అసలు అడుగుపెట్టి ఉండేవాళ్లు కారన్నమాట. ఈయన మా కుటుంబ ప్రాణదాత" అని చెమ్మగిల్లిన కళ్లతో గద్గద కంఠంతో పిల్లలకు చెప్పారు. వాళ్లు విస్తుపోయారు. ఆ రామారావు ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాడు. ఆయనకు ఫలహారమే కాకుండా బట్టలు కూడా పెట్టి, సత్యనారాయణగారు ఎంతో ఆదరం చూపారు. రామారావు జీవితాంతమూ కృతజ్ఞతాభావాన్ని ఆప్తులతో చెప్పుకుంటూ ఎంతో ఆనంద పడేవాడు.

మా సారస్వత మండలి సభ్యులం ఆదివారాలు సాయంత్రం బందరు రాబర్టుసన్‌పేటలోని ఆకెళ్లవారి మేడ మీద(ఇప్పుడు జిల్లా గ్రంథాలయ సంస్థ ప్రక్కన ఉన్న పెద్ద మేడ) సాహిత్య గోష్ఠి సమావేశాలు ఏర్పాటు చేసుకునేవాళ్లం. ఓ రోజున అలాంటి సమావేశంలో సత్యనారాయణ గారు మా చేతులు చూసి (ఆయనకు పామిస్ట్రీకూడా తెలుసు) మా జాతకాలు చెప్పారు. చివరికి నేను "మీ జాతకం చెబుతాను చెయ్యి ఇవ్వండి" అన్నాను. "ఓహో! నీకు ఇందులో కూడా ప్రవేశం ఉందన్నమాట! అయితే చూడు" అంటూ చెయ్యి చాపారు.

నేను ఆయన చేతిని పరిశీలిస్తూ "జరిగిపోయిన విషయం చెప్పటం అనవసరం. అవి మీకు తెలుసు కనక చెప్పను.... మీ చేతిలో Line of Intuition చాలా Prominent గా ఉంది. Sun Line కూడా బాగా క్రింది నుంచి మొదలై అంత Prominent గానూ ఉంది. అంచేత మీకు మహాకవిగా recognition మీ జీవితంలో త్వరగానే వస్తుందనుకుంటాను..." అంటూ వుండగా ఆయన అందుకుని -"బాగానే చెప్పావు. అయితే ఒక్కమాట చెప్పనా? అసలు మనవాళ్లు కవి బ్రతికి ఉండగా - వాడు ఎంత గొప్ప కవి అయినా సరే - ఏమీ పట్టించుకోరు. వాడు చచ్చిపోయిన తరవాత వాడికి బ్రహ్మరథం పడతారు. అయితే ఆ స్థితి నాకు రాదు. కాని నేను పోయిన తరవాత నాకు Noble Prize రానందుకు మీరందరూ బాధపడతారు" అన్నారు. ఆయనకు ఈ ఆత్మ విశ్వాసం అప్పటి నుంచీ ఉండేది. అది అహంకారం అని కొందరు అపార్థం చేసుకొనడం దురదృష్టం.

సత్యనారాయణ గారు ఎన్నో ఖండకావ్యాలకి పీఠికలు రాశారు. ఒక యువకవి తన ఖండ కావ్యానికి పీఠిక రాయాలని సత్యనారాయణగారిని అర్థించాడు. చాలాసార్లు తిరిగాడు. కానిఆయన రాయలేదు. ఓ రోజున ఆ హరిజన కవి మళ్లీ వచ్చాడు. సత్యనారాయణ గారు అతణ్ణి ఆదరంతో పలకరించి కూచోపెట్టి -"చూడు, నాయనా! నా అంత బద్ధకపు ముండాకొడుకు ఇంకొకడు ఉండడు. నీ పుస్తకానికి పీఠిక ఇంకా రాయనేలేదు. నువ్వు ఒక పని చేస్తే నా రోగం కుదిరి నేను పీఠిక రాస్తాను. పుస్తకం అచ్చు వేయించు. టైటిలు పేజీ లేకుండా ఆ కాగితాలను పుస్తకంగా కుట్టించి, దాన్ని నాకు పంపించు. నాకు అప్పుడు వేడి పుడుతుంది. పీఠిక రాస్తాను..." అంటూ ఇంట్లోకి వెళ్లాడు. ఒక వంద రూపాయలనోటు, కొత్త బట్టలూ తెచ్చి ఆ కవి చేతిలో పెట్టి -"ఈ బట్టలు నేను కొనలేదు. ఎవరో ఒకరు నాకు బట్టలు పెడుతూనే ఉంటారుగా! అవి నీకిస్తున్నాను..." అంటూ అతని రెండు చేతులూ పుచ్చుకున్నారు. ఆ యువకవి ఆనంద బాష్పాలతో సత్యనారాయణ గారికి పాదాభివందనం చేసి, ఎంతో సంతోషంతో



*తెలుసుకోవడం కంటె తెలుసుకున్న దాన్ని జీర్ణించుకోవటం ముఖ్యం.*

వెళ్లాడు. అదీ సత్యనారాయణగారి సహృదయత!ఒకసారి సత్యనారాయణ గారు కబురు చేయగా నేను విజయవాడకు వెళ్లాను. నన్ను చూస్తూనే ఎందుకు కబురు చేశానో తెలుసా? అన్నారు. ఆయన కబురు చేయగా నేను వెళ్లినప్పుడల్లా వేసే మొదటి ప్రశ్న ఇది. "మనం కలుసుకొని చాలా రోజులైంది కనక..." అన్నాను. "అదీ ఒక కారణమేననుకో. అంతకన్నా ముఖ్యమైనది ఉన్నది. మా అన్నయ్య లక్ష్మీకాంతం (అంటే పింగళి లక్ష్మీకాంతం గారన్న మాట) చనిపోతే వచ్చి నన్ను పలకరించాలని నీకు తెలీదూ?" అన్నారు డగ్గుత్తికతో, చెమ్మగిలిన కళ్లతో. "అవును. పొరపాటయింది" అన్నాను.

"అది సరే. నాకు తమ్ముళ్లు పుట్టారు గాని అన్నలు పుట్టలేదు. నాకు అన్నగారు లక్ష్మీకాంతమే. అసలు నేను ఇంతవాణ్ణి కావడానికి అతనే కారణం. ఎలాగో తెలుసా? నేనూ, వెంకటేశ్వరరావూ (అంటే కాటూరి వెంకటేశ్వరరావుగారు) ఒక ఈడు వాళ్లం. లక్ష్మీకాంతం మాకంటే పెద్ద. నాకంటే ముందు వెంకటేశ్వరరావు కవిత్వం చెప్పటం మొదలు పెట్టాడు. నేను కూడా ఏవో పద్యాలు రాసి, అప్పటికే కవి అనిపించుకున్న లక్ష్మీకాంతానికి చూపించాను. "నీమొహం లాగున్నాయి పద్యాలు. కవిత్వం చెప్పటం అంత తేలిక కాదు. ఇంతటితో ఇహ కవిత్వం చాలించు..." ఇలాంటి మాటలతో నన్ను అపహాస్యం చేశాడు. అప్పుడు నాకు చాలా రోషం వచ్చింది. పట్టుదలతో కృషి చేశాను. దైవకృపవల్లా మాగురుదేవులు వెంకటశాస్త్రి మహోదయుల అనుగ్రహం వల్లనూ ఇప్పటికి ఈ స్థితికి చేరుకున్నాను. అంచేత నేను ఇంతవాణ్ణి కావటానికి లక్ష్మీకాంతమే కారణం అంటాను" అన్నారు. అదీ సత్యనారాయణ గారి కల్లా కపటం లేని మనసు. సత్యనారాయణ గారి చేత రామాయణ కల్పవృక్షం పఠనం, వ్యాఖ్యానం బందరులో ఏర్పాటు చేయాలన్న నా కోరిక కొంతకాలానికి కార్యరూపం దాల్చింది. ఆ నాలుగు రోజులూ ఆయన మా ఇంట్లోనే ఉన్నారు. మా ఇష్టం వచ్చినవి కాకుండా ఆయన చెప్పిన వాటిని మాత్రమే చేసిపెట్టే షరతు మీద. సభలు అయిపోయాయి. ఆ రోజు సాయంత్రం విజయవాడకు తిరుగు ప్రయాణం. ఆయనకు ఖద్దరు పంచె, ఖద్దరు సిల్కు ఉత్తరీయమూ కట్టపెట్టాను. "ఇవి కట్టుకోవాలా, పెట్టెలో పెట్టుకోనా?" అన్నారు. "కట్టుకోండి. లేకపోతే... ఎవరికైనా... దానం... చేసేస్తారు" అన్నాను. సరేనని నవ్వుతూ పంచె కట్టుకుని, ఉత్తరీయం పైన వేసుకున్నారు. బస్సు స్టాండుకు వెళ్లాం. అంతకు ముందు వారం రోజులనుంచీ ఊళ్లోలేని కొడాలి ఆంజనేయులుగారు ఇల్లు చేరగానే సత్యనారాయణ గారు బస్సు స్టాండుకు వెళ్లారని తెలుసుకుని అక్కడికి వచ్చారు. అక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం.

ఆంజనేయులు గారు వేసుకున్న ఖద్దరు ఉత్తరీయం కొద్దిగా చిరుగుపట్టి ఉంది. ఆ ఉత్తరీయాన్ని సత్యనారాయణగారు తీశారు. "అదేమి టి?" అన్నారు ఆంజనేయులుగారు. "ఉండు.. తొందర పడతావేం?" అంటూ తన మెడలోని ఖద్దరు సిల్కు ఉత్తరీయాన్ని ఆంజనేయులుగారి భుజాలకు కప్పారు. "ఇదేమిటి?" అన్నారు ఆంజనేయులుగారు. "నీకు ఇంతవరకే ప్రాప్తి. నాలుగు రోజులనుంచీ ఈ నరసింహారావు వాళ్ల ఇంట్లో నాతోపాటు నిన్ను కూడా ఉంచుకోవాలనుకున్నాడు. నీకూ నాకూ బట్టలు కొన్నాడు. మరి... నువ్వు రానేలేదు. నాకు ఒక్కడికే బట్టలు పెట్టాడు. ఇదుగో... పంచె కట్టుకున్నాను. ఖండువా మాత్రం నీకు ప్రాప్తి ఉంది" అంటూ కావిలించుకున్నారు. ఆంజనేయులుగారు ఆనందంతో కళ్లు తుడుచుకున్నారు. అదీ సత్యనారాయణగారి స్నేహ మాధుర్యం!

ఇక్కడ ఒక విషయం జ్ఞాపకం చేసుకోవాలి. తమ గురువులు తిరుపతి వేంకట కవుల బాటలో సత్యనారాయణగారూ, ఆంజనేయులుగారూ "సత్యాంజనేయ కవులు" అనే అభిదానంతో కొంతకాలం జంట కవులుగా ఉండేవారు. తరవాత గాంధీజీ పిలుపుతో ఆంజనేయులుగారు స్వాతంత్ర్య సమరయోధులైనారు. సత్యనారాయణగారు కవి సమ్రాట్టు లైనారు.

ఆంజనేయులుగారిని గురించి తన రామాయణ కల్పవృక్షంలో సత్యనారాయణగారు. "ఆతడె తోడు కల్గినను నచ్చముగా గలకంద లచ్చులున్‌బోతలుపోసి యుండెదము పోతనగారి విధాన..." అని చెప్పుకున్నారు కదా!

సత్యనారాయణగారూ, "హంపీ క్షేత్రం" కర్త కొడాలి వెంకట సుబ్బారావుగారూ గుంటూరు ఎ.సి.కాలేజీలో సహోపాధ్యాయులు మాత్రమే కాదు. ప్రాణస్నేహితులూ కూడా. ఒక్క హంపీ క్షేత్ర రచనలో ఎంతో ప్రతిభను చూపించి, ఇంకా ఎన్నో గొప్ప కావ్యాల్ని సృష్టించగలడనుకున్న సుబ్బారావుగారిని మృత్యుదేవత కబళించింది. సత్యనారాయణగారు అత్యంత శోకతప్తులైనారు. తరవాత "హంపీక్షేత్రా"న్ని కాలేజీ తరగతులకి పాఠ్యగ్రంథంగా చాలాసార్లు నిర్ణయించి సుబ్బారావుగారి కుటుంబానికి చాలా సహాయం చేశారు. ఇంకా విశేషం ఏమిటంటే - సుబ్బారావుగారు తన ఏకైక పుత్రుణ్ణి డాక్టరు చదివించాలనుకునేవారట. అంచేత ఆ అబ్బాయిని సత్యనారాయణగారు తన స్వంత ఖర్చు మీద డాక్టరు చదివించారు. సత్యనారాయణగారు కీర్తి కాయులై కృష్ణాతీరాన అగ్నికి ఆహుతి అవుతున్నప్పుడు రుద్రభూమిలో రుద్ధకంఠంతో సుబ్బారావుగారి అబ్బాయి చెప్పిన విషయం ఇది. ఎంత గొప్ప సంగతో చూడండి! సత్యనారాయణగారి ఆదర్శ మైత్రీ వాత్సల్యానికి ఇది పరాకాష్ఠ అంటాను.

ఇలాంటి సంఘటనలు సత్యనారాయణ గారిని గురించి ఎన్ని చెప్పుకున్నా, ఇంకా చెప్పుకోతగ్గవి ఇంకా మిగిలి ఉంటాయి. కవిసమ్రాట్టుగా సత్యనారాయణ గారు లోక ప్రసిద్ధులు. ఆయన రచనల వైశిష్ట్యాన్ని గురించి పెద్దలు ఎందరో వివరించి ఉన్నారు. మహా మనీషిగా నేనెరిగిన సత్యనారాయణ గారిని చూపడానికి చేసిన ప్రయత్నం ఇది.

శ్రీ పరమ హంస చిన్న కథలు

# భక్తురాలు

ఒక గొల్లపడుచు యేటి అవతల ఉన్న ఒక బ్రాహ్మణునికి పాలు ప్రతిదినము పోయు చున్నది. ఆమె ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డుకు వెళ్ళు సరికి నావ కారణంగా, యేటి లోని నీరు హెచ్చు తగ్గుల కారణంగా, ప్రయాణీకుల కారణంగా ఆలశ్యమవుతూ ఉండేది.
'స్వామీ ! మీ వద్దకు వచ్చుటకు ప్రతి దినమూ ఈ కారణముల వలన ఆలశ్యమగు చున్నది. కనుక దీనికి సరియైన మార్గము తెలుపండి" అంది.
" ఓసీ పిచ్చిదానా ! ఈ యొక్క సంసారాన్ని ఈదిన దానివి ఈ చిన్న యేటిని దాటలేవా ? భగవన్నామ కీర్తన చేస్తూ ఈ సంసారాన్ని ఈదుతున్నావు. ఈ యేటిని దాటలేవా !" అన్నాడు హిత బోధ చేస్తూ.
ఆ మర్నాటి నుంచి ఆ పల్లెపడుచు వేళకి పాలు తేవటం ప్రారంభించింది. కొన్నాళ్ళపాటు ఆ విషయం పట్టించుకోని ఆ బ్రాహ్మణుడు ఒక రోజు ఆ పడుచుని అడిగాడు "నీవు ఈ మధ్య చాలా తొందరగా పాలు తెస్తున్నావేంటి ?" అని అడిగాడు.
"స్వామీ మీరే కదా చెప్పింది. ఆ భగవన్నామము కీర్తన చేస్తూ ఆయేటిని దాటమన్నారు అలానే వస్తున్నాను " అందామె.
" సరే ఈ రోజు నేను నీతో వస్తా పదా !" అని ఆమె వెనకాలే నడక మొదలు పెట్టాడు. ఆమె మాట్లాడుతూ ఏటిలో నడవటం ప్రారంభించింది. ఆ బ్రాహ్మణుడు పంచె పైకెత్తి యేటి మీద నడవటానికి ఉపక్రమించాడు.
"స్వామి భగవంతుని మీద భారం వెయ్యమన్నారు. తమరేమో పంచ పైకి కడుతున్నారు" అన్నదా పడుచు. * * *



అలవాటును నిగ్రహించకపోతే అవసరమై కూర్చుంటుంది.

# గీత అమృతవర్షిణి

సాయి గంగామహదేవ్.

శ్లో|| అసంశయం మహాబాహో, మనోదుర్నిగ్రహంచలమ్
అభ్యాసేనతు కౌన్తేయ, వైరాగ్యేణచ గృహ్యతే ||

ఆత్మనాత్మలకు; లౌకిక, పారలౌకికములకు; ఇహ పరములకు ; మధ్యనున్న అడ్డుగోడయే మనస్సు. ఈ మనో జయము లేక ఏసాధనమూ ఫలింపనేరదు. ఎంత సాధన చేసిననూ, ఏ సాధన చేసిననూ ఈ మనస్సు సంపూర్ణంగా శాంతించినట్లు తోచదు. అందువలననే జీవుల ప్రతినిధియైన దివ్యమూర్తి అర్జునుల వారు మనోనిగ్రహమెంత జటిలమో తెలిపి, దానికి నివృత్తిని సూచింపమని కోరినాడు. తత్ఫలితమే యీ ప్రబోధ.

మనస్సు సదా చంచలము. దీనిని నిగ్రహించుట దుస్తరమైన కార్యము. ఐతే ఈ మనస్సునకు రెండు లక్షణములుంటున్నవి. (1) సంకల్పము (2) వికల్పము. ఒక వస్త్రమునందలి నిలువు, అడ్డము దారముల వంటివి ఈ సంకల్ప, వికల్పములు. ఇందులో వికల్పములను అణచుటకు అభ్యాసము కావాలి. సంకల్పముల నాపుటకు వైరాగ్యము కావాలి. ఐతే అభ్యాస, వైరాగ్యములంటే ఏమిటో మొదట గ్రహించాలి.

## (1) అభ్యాసము :

అభ్యాసము అనగా "అభితః అస్యతే పరిచీయత ఇత్యభ్యాసః" అనగా "అంతట పరిచయము చేయబడునది. మరియు "అభితః అశ్యతేవ్యాప్యత ఇత్యభ్యాశః" అంతట వ్యాపింపబడునది అభ్యాసము. అంతటనూ వ్యాపింపబడునది, లేదా పరిచయము చేయబడునది అనగా -- తాననుష్ఠించు దివ్య భావము అనగా తాను ఆత్మను అను భావము ప్రతి అవస్థలోనూ, ప్రతి కాలములోనూ, ప్రతి ప్రాంతములోనూ, ఎల్లప్పుడూ మరువకుండా యుండు స్మృతిని సంపాదించుట ఇదే అభ్యాసము ఇది మరిచి ఏవేవో సాధనలు నిరంతరము చేయుట అభ్యాస మనిపించుకోదు. నేను ఆత్మను అనుభావమును సదా స్మృతినుంచు కొనుట అను అభ్యాసము వలన వికల్పములు మాత్రమే నివర్తించును గానీ సంకల్పములు నివర్తింపవు. కారణమేమనగా "నేను ఆత్మను" అనునది కూడా ఒక సంకల్పమే. కనుక ఈ సంకల్పమును కూడా జయింపవలసి వున్నది. మొదట వికల్పాలను జయించి తదుపరి సంకల్పములను జయింపవలసి వుంటుంది. దానికి వైరాగ్యము అవసరము.

## (2) వైరాగ్యము :

అనగా రాగములేని స్థితి. సంకల్పమునకు రాగమే ఆధారము. సంకల్పమనగా విశేష సృష్టి(సం + కల్ప) అని అర్థము. రాగమే లేనిచో ఈ సంకల్ప మెందుకావిర్భవిస్తుంది ? కనుక ఏరాగములేకుండా వుండేట్లు చూచుకోవాలి. అదే వైరాగ్యము ఇందుకొరకు సుఖాలలో పొంగకుండా వుండే గుణాన్ని, దుఃఖాలలో ఉద్విగ్నత చెందని గుణాన్ని సంపాదించాలి. ఇవి లేకుండా ఎన్ని చేసినా నిష్ఫలమే. నిరంతర శాంతిని అభ్యాసం చేయాలి. అదే మనో నిగ్రహానికి రాచబాట. దైవ కృపచే ఎల్లరు ఆ స్థితిని సంపాదింతురుగాక ! * * *



దేనికి సాహసించనివాడు దేనిని ఆశించనక్కరలేదు.

# త్రిజటుడు

మల్లాప్రగడ శ్రీరంగారావు

అయోధ్యానగర ప్రాంతమున గల పల్లె యందొక పేద బ్రాహ్మణుడున్నాడు. అతడు నిరక్షర కుక్షి. చదువులేకున్నను సంస్కారం కలవాడు. భగవద్భక్తితో జీవనం సాగిస్తూ సదాచార సంపత్తితో కాలం గడుపుతున్నాడు. ఎవ్వరిని 'దేహీ' అని యాచింపక ఉన్నదానితో తృప్తి పడుచు ధార్మిక జీవితం కొనసాగిస్తున్నాడు. ఒకనాడు శ్రీరామచంద్రుడు తండ్రి యాజ్ఞానుసారం సీతా లక్ష్మణులతో అడవికి బయలుదేరుచు బ్రాహ్మణులందరికి పుష్కలంగా దానం చేసి వారి ఆశీర్వాదాలందుకొనుచున్నాడని విని నడవలేక నడవలేక మెల్ల మెల్లగా నడిచి ఆయాస పడుతూ శ్రీరామచంద్రుని దగ్గరకి వచ్చి ఓపిక లేక చతికిలపడి పోయినాడు. అలా వచ్చిన త్రిజటుడనే ఆ నిరుపేదని చూచి శ్రీరాముడు "బ్రాహ్మణోత్తమా ! నమస్కారం. నేనరణ్యానికి వెళ్లుచున్నాను. మీకేమి కావలయునో కోరుకొను" దన్నాడు. ఆ త్రిజటుడు "శ్రీరామచంద్రా ! నీవరణ్యానికి బయలుదేరబోయే ముందు అడిగినవారికి దానమిచ్చి ఆనందింపచేస్తున్నావని యీ సమయంలో మీరు వెళ్లి శ్రీరాముని దర్శించండని నాభార్య బలవంతం చేసి పంపితే నీవద్దకు వచ్చాను. ఓపికలేక పోయినా నీదర్శనం చేసుకొని పోదామని పడుతూ లేస్తూ వచ్చాను. నా జీవితాన్ని సార్థకం చేయుమని" శ్రీ రాముని కోరాడు. ఆ బ్రాహ్మణుని మాటలకు లోలోన సంతోషించి శ్రీరాముడు "ఓ త్రిజటా ! ఆ కనపడుచున్న సరయూనదీ తీరాన గోవులు సంచరిస్తున్నాయి చూచావా ! నీ చేతినున్న ఊత కర్రను విసరివేయుము. ఎంత దూరాన ఆ కర్ర పడితే ఆ ప్రాంతమంతా ఉన్న వస్తు సంపదలతో నీకిస్తానని" పరిహాసంగా పలికాడు. త్రిజటుడామాటలను విని నడుమునకు తుండుగుడ్డ గట్టిగా చుట్టుకొని పళ్లు బిగించి లేని ఓపిక తెచ్చుకొని బలాన్నంతా కూడ గట్టుకొని తన చేతికర్రను విసరవేసెను. ఆనందము సరయూనదీ తీర ప్రాంతమునకు పోయి పడింది. శ్రీరాముడు చిఱునవ్వుతో "మహాత్మా ! నీ చేతి దండము పడినంత వరకు యీ భూభాగము, యీ గోవులు నీకు సమర్పిస్తున్నాను. ఎన్నడు ఎవరిని యాచించని ధీరుడవు. నీకంటే సదాచార సంపన్నునికి ఏమిచ్చినా ఎంత యిచ్చినా నాకు అల్పంగా తోస్తుంది. నీ చేతిలోని దండం నీలో దాగియున్న తేజశ్శక్తిని స్పష్టం చేసింది. ఆ దండం పడిన ప్రాంతమంతా మీరుగైకొనుడని" సవినయంగా పలికెను. అయోధ్యా పురవాసులందరు ఆ సన్నివేశమును చూచి పట్టాభిషిక్తుడు కావలసిన శ్రీరాముడు అరణ్యానికి వెళ్లుతూ కూడ ఆవగింజంత అధైర్యము చెందక మానసిక వికారము నొందక అడిగిన బ్రాహ్మణునకు సమర్పించిన దానమునకు వేనోళ్ల కొనియాడి శ్రీరాముడు మానవమాత్రుడు కాదు. మర్యాదా పురుషోత్తముడు. ఆయనను చూచి మనమంతా కష్టాలను సంతోషంగా ధైర్యంగా అనుభవించడం నేర్చుకోవాలని. ఆర్తితో, ఆకలితో అలమటిస్తున్న వ్యక్తికి చేతనైనంత సహాయం చేసి ఆదుకోవడం అలవరచు కోవాలని 'రామో విగ్రహవాన్ ధర్మః' శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మదేవత యని భావించి నమశ్శతములర్పించారు. అంత మంచివాడు అరణ్యానికి వెళ్తున్నాడని బాధతో ఆయనతో పాటు అనుసరించారు. చివరకు ఆరాత్రి తమసా నదీ ప్రాంతము వరకు పోయి తెల్లవారిన పిమ్మట శ్రీరాముడు కన్పడకపోవుటచే విచారంతో నిర్జీవాలవలె తిరిగివచ్చారు. ఈ రామాయణ గాథ ఆపదలందు ఆర్తులను ఆదుకోవాలనే ధర్మాన్ని మనకు గుర్తు చేస్తున్నది.

"శ్రీవాణి" శత సంచిక సందర్భముగా మీకివే మా శుభాకాంక్షలు

స్థాపితం : 1984 Phone : 429




# శ్రీ సత్యసాయి విజ్ఞాన్ విహార్

ఇంగ్లీషు & తెలుగు మీడియం రెసిడెన్షియల్

జగ్గయ్యపేట – 521 175 కృష్ణాజిల్లా

* L. K. G. నుండి 10 వ తరగతి వరకు
* ప్రభుత్వ పరీక్షలలో 100% ఫలితాలను సాధిస్తున్న ఉత్తమ విద్యాసంస్థ
* ఆధునిక పద్ధతులలో ఆడియో, వీడియో సహాయముతో ఉత్తమ శిక్షణ
* మానవతా విలువలను "బాలవికాస్" తరగతులద్వారా బోధించుట
* అనుభవజ్ఞులైన అధ్యాపకవర్గం, చక్కటి హాస్టల్ వసతి కలదు.
* శ్రీ సత్యసాయి విద్యాసంస్థల నిర్వహణ తీరు ననుసరించి చక్కటి ఆటపాటలతో, యోగాభ్యాసములతో, నీతిబోధనలతో పిల్లలను పరిపూర్ణమైన ఆరోగ్యవంతులుగా, విద్యావంతులుగా, చక్కటి భావిభారత పౌరులుగా తీర్చిదిద్దుట మా లక్ష్యము.
* స్వయముగా గాని, post ద్వారా గాని రు. 15/-లు పంపి అప్లికేషన్ ఫారము, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

ఇట్లు

K Rama Krishna Rao
M.A., B.Ed.,
( Old Student of Bhagavan's College
Brundavan, Bangalore )

# కొమరగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి.

ది. 1-12-1976

చిరంజీవులకు ఆశీస్సులు

మీరందరూ వ్రాసిన ఉత్తరాలు అందినాయి. చాలా సంతోషం. సమస్త ద్రవ్యములలో విద్యయే ఉత్తమ ద్రవ్యమని లోగడ లేఖలలో వివరించాను. అనుభవించడం వల్ల, ఇతర భౌతిక ద్రవ్యములలాగే విద్యాధనం ఏమాత్రం తరగిపోదని నిరూపించదలచి, ఇదే భావమును వివరించేటటువంటి ఈ క్రింది శ్లోకములతో ఈ ఉత్తరాన్ని ప్రారంభిస్తున్నాను.

"నచౌ గహార్యా న బన్ధుహార్యా
న భర్తృహార్యా నచ రాజ హార్యా
స్వదేశమిత్రం పరదేశబన్ధుః
విద్యా సుధాం యేపురుషాః పిబన్తి "

అనగా "విద్యాధనము అనుభవించుట చేత తరగదు- బంధువుల చేతనూ, అన్నదమ్ముల చేతనూ, రాజుల చేతనూ అపహరింపబడదు. స్వదేశమునందు మిత్రుని వంటిది. పర దేశమునందు బంధువు వంటిది. అట్టి విద్యయను అమృతమును ఏ పురుషులు త్రాగుదురో గదా !" అని అర్థము.

విద్యా ధనము అనుభవించుట వలన అది ఏమాత్రం తరగదు, అయిపోదు, నశించిపోదు. దానిని దానం చేయటం వలన, అనగా మరొకరికి యిచ్చినందువల్ల, నేర్పినందువల్ల -- అది ఏ మాత్రం ఖర్చు కాదు, వ్యర్థా కాదు. ఎవరైనా సరే తన విద్యను, సంపాదించిన విద్యాధనమును, పది మందికి నేర్పడం వల్ల, యివ్వడం వల్ల, ప్రావీణ్యత అనుభవము పెరుగుతుందే కాని ఏమాత్రం నష్టపోరు. పై పెచ్చు ప్రసిద్ధిచెందిన విద్యావేత్తలుగా, విద్వాంసులుగా పేరు ప్రఖ్యాతలు అందుకుంటారు. దొంగల చేత సహితం దొంగిలింప శక్యము కానటువంటి ఈ విద్యా ధనమును బంధువులుగాని, అన్నదమ్ములు గాని చివరికి రాజులు గాని ఏమాత్రం అపహరించలేరు. కాజేయలేరు. భౌతికమైన స్థిరాస్థులను, ఏదో ఒక మిషతో, మాయోపాయంతో, కొంతమంది స్వార్థ పరులైన బంధువులుగాని, సోదరులుగాని ఒక వేళ జేస్తే కాజేయ వచ్చును. చేసిన మేలును మఱచిన కృతఘ్నులు, నమ్మించి మోసం చేసి ఒకవేళ కబళించ వచ్చును. ప్రభుత్వం విపరీతమైన పన్నులను విధించినగాని, గరిష్ఠ పరిమితి చట్టముల ద్వారా గాని, మరియు అనేక నియమ నిబంధనల ద్వారాగాని, ఆంక్షల ద్వారాగాని, ఏవ్యక్తి ఆస్థినయినా స్వాధీనం చేసుకో వచ్చును గాని, విద్యాధనమును మాత్రం ఎవ్వరూ కాజేయ లేరు. నీరు చిమ్మిన కొద్దీ జలము ఏవిధంగా ఊరుతుంటుందో, అదేవిధంగా పదిమందికీ నేర్పినకొద్దీ ఈ విద్య దిన దిన ప్రవర్థమానంగా పెరిగి అభివృద్ధి జెందుతుంది. అంతే కాదు ఈ విద్య స్వదేశమునందు మిత్రునిగా, ప్రాణ స్నేహితునిలా ఉపయోగపడుతుంది, ఆదుకొంటుంది.

అసలు మిత్రుడుంటే ఎవరు ? అతని లక్షణములు ఏవిధంగా ఉంటాయి ? కొంచం వివరిస్తాను అభివృద్ధిలో



*నీయందు నీకు విశ్వాసం కలుగునంత వరకు నీవు దేవుని విశ్వసించలేవు.*

నున్నప్పుడు, సకల సంపదలతో విలసిల్లుతున్నప్పుడు, భోగభాగ్యములతో తులతూగుతున్నప్పుడు, ప్రతి ఒక్కరూ, స్వలాభం కోసం, స్వప్రయోజనం కోసం మిత్రులుగా వ్యవహరిస్తుంటారు. అంతేకాదు ఏమాత్రం విడవకుండా వెంటబడి తిరుగుతూవుంటారు. ఇంద్రుడని, చంద్రుడని పొగుడుతూంటారు. ఒక వేళ దురదృష్టవశాత్తు, ఆపదలకు లోనై, భౌతిక సంపదలు కోల్పోయినప్పుడుగాని, ఊహించనటువంటి ప్రమాదాలు, కష్టాలు సంభవించినప్పుడుగాని -- అప్పటి వరకు అమిత ప్రాణ స్నేహితులుగా వుంటూ, వెంట తిరిగిన వారిలో చాలామంది దూరమై పోతారు. కంటికి కనపడకుండా మటుమాయమై పోతారు. నిజమైన మిత్రులు, ఆప్తులు, ప్రాణస్నేహితులు తప్ప మిగతా వారందరూ అదృశ్యమవుతారు. కష్టకాలంలో కూడా విడవకుండా ఛాయవలె ఎవరు వెంట వుంటారో వారే నిజమైన మిత్రులు. మనకు కలిగిన, సంభవించిన సుఖ దుఃఖములలో సమానంగా పాలు పంచుకుంటూ, నిరంతరం మనల్ని వదలకుండా, మన వెంబడి ఎవరు ఉంటారో వారే నిజమైన స్నేహితులు. ఇదే భావమును చక్కగా ఈ క్రింది సుభాషితమములలోని పద్యము వివరిస్తున్నది.

"అఘము వలన మఱల్చు హితార్థకలితు
జేయు గోప్యంబు దాచు బోషించు గుణము
విడువడా పన్ను లేవడి వేళ నిచ్చు
మిత్రుడీ లక్షణంబుల మెలగుచుండు"

అనగా "పాపపు పనుల నుండి మఱల్చుట, మంచి పనులు చేయుటకు పురుగొల్పుట, రహస్యమును దాచుట, మంచి గుణమునులనే వెల్లడి చేయుట, ఆపద కలిగినప్పుడు విడిచిపోకుండుట, లేనప్పుడు అవసరమైన దానిని యిచ్చుట మొదలైనవి నిజమైన మిత్రుడి లక్షణములు " అని అర్థము. "మాతామిత్రం పితాచేతి స్వభావాత్త్రితయం హితమ్ " అనగా ' తల్లి దండ్రుల తరువాత సహజంగా ప్రేమించుచూ మేలు కోరువాడు మిత్రుడే ' అనే ఆర్యోక్తి కూడా కలదు. అటువంటి ప్రాణ స్నేహితుడగు మిత్రుని కలిగి వుండటం అందరికీ లభించదు. పూర్వ జన్మ సుకృతం వలననే అటువంటి మిత్రులు లభిస్తారు. ఒక వేళ అటువంటి ప్రాణ మిత్రులు లేనప్పటికీ మంచి విద్య గనుక వుంటే మిత్రులు లేని లోటు పూరించ బడుతుంది. ఎటువంటి విపత్కర పరిస్థితులలోనైనా సరే, ఈ విద్యా ధనంతో సునాయాసంగా ఎంతటి కష్టాలనైనా దాటివేయవచ్చును. అందువలననే విద్య కూడా గుణవంతుడైన మిత్రునితో పోల్చారు పెద్దలు. ఇకపోతే విద్యను పరదేశమునందు బంధువునిగా కూడా వర్ణించారు పెద్దలు, బంధువులు అంటే కేవలం రక్తసంబంధీకులు, చుట్టములు మాత్రమే కాదని లోగడ వివరించాను. అసలు నిజమైన బంధువు లక్షణాలు ఏవిధంగా వుంటాయో తెలుసుకోవటం ఎంతైనా అవసరం. ఒక వ్యక్తి ధనమును బాగా సంపాదించి మంచి స్థితిలో గనుక వుంటే అతని చుట్టూ చాలా మంది చేరుతుంటారు. ఎక్కడి వారో వచ్చి బంధుత్వమును కలుపుకొని ఇంట్లో తిష్ఠ వేస్తారు. రోజులరబడిదే భావమును ఈ క్రింది సుమతీ శతకం పద్యం చక్కగా వివరిస్తున్నది.

## శ్రీ సాయి వాణి

కృషి ఉంటే కృప ఉంటుంది
గుణము లేని జీవితము దీపములేని గుడి వంటిది
చలించని మనస్సు భ్రమించని దృష్టి ఉండాలి
చేసిన మేలు వ్యర్థం కాదు, చేసిన కీడు వృథా పోదు.
దర్పము ఎదుట ధీరులుగ, ధర్మము ఎదుట విధేయులుగ ఉండాలి.
ద్వైతం దేహలక్షణం, అద్వైతం ఆత్మ లక్షణం
మానము కలవాడే మానవుడు
రాగద్వేషాలే రాహు కేతువులు
విష్ణు వాంఛ గోపి, విషయ వాంఛ పాపి
హరిని వరిస్తే జీవితం తరిస్తుంది.



నిత్యశంకితులు ఏమి సాధించలేరు.

"ఎప్పుడు సంపద కలిగిన
నప్పుడు బంధువులువత్తురది యెట్లన్నన్
దెప్పలుగ చెఱువు నిండిన
కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ".

అనగా ఎప్పుడు మానవునికి సిరి సంపదలు కల్గునో, అప్పుడు వాని ఇంటికి ఎక్కడలేని బంధువులు పిలువకుండానే వచ్చెదరు. అది ఎట్లనగా చెఱువు సమృద్ధిగా నీటితో నిండియున్న తరుణంలో కప్పలు అనేకం చేరుతాయి.

అప్పటి వరకు బెక బెకలాడుతూ గందరగోళం చేసే కప్పలు, చెఱువు ఎండి పోయేటప్పటికీ ఎక్కడా కనిపించవు. ఎక్కడికో వెళ్లి పోతాయి. అదే విధంగా సంపదలు తరగి, కరిగిపోయినప్పుడు, అప్పటి వరకూ ఇంట్లో వుండి బాగా మెక్కిన బంధువులందరూ మటుమాయమై పోతారు. ఏదైనా సహాయం చేయవలసి వస్తుందేమోననే భయంతో కనిపించనయినా కనిపించరు. సహాయం చేయకపోగా అవహేళన కూడా చేస్తారు. కనీసం సానుభూతిని కూడా ప్రకటించరు. భౌతిక సంపదలను చూచి మోహ పడకుండా, వ్యక్తి యొక్క మంచితనమును, మనసును గ్రహించినవారు మాత్రమే, సంపదలు పోయిన తరుణంలో కూడా వదలిపెట్టి పారిపోరు. అట్టివారినే మాత్రమే నిజమైన బంధువులనని చెప్పుకుంటే బాగుంటుంది. మిగతా వారందరూ విశ్వాస ఘాతకులే. ఒక్క సుఖసమయంలోనే కాకుండా, కష్టకాలంలో కూడా విడనాడనివారే నిజమైన బంధువులు. రాజాధిరాజైనప్పటికినీ, సాక్షాత్ భగవత్ స్వరూపుడైనప్పటికినీ- శ్రీ కృష్ణపరమాత్మ బీదవాడైన కుచేలుని మరువలేదు, విదురుని విస్మరించ లేదు. కుచేలుడు పెట్టిన అటుకులనే ఆనందంతో ఆరగించాడు. అదే నిజమైన మిత్రత్వానికి నిదర్శనం. రాయబారానికి వెళ్లిన శ్రీ కృష్ణుడు దుర్యోధనుడు యివ్వబూనిన పంచభక్ష్య పరమాన్నములను స్వీకరించక, సామాన్యుడైన విదురుని ఇంటనే భుజించాడు. మన 'రా ప్రేమిస్తున్న ఆత్మీయుడైన విదురుడినే శ్రీకృష్ణుడు గౌరవించాడు గాని సంపదలను, అధికారమును కాదనే విషయం యిక్కడ మరువరాదు అటువంటి ఉన్నతము

## వా॥ శ్రీవా॥

నీవు అందిస్తున్నావు ఆధ్యాత్మిక మకరందం
చిందిస్తున్నావు నిర్మల విజ్ఞానామృతం
అందుకే నీవంటే మాకంతో ఆనందం
వేస్తున్నావు నీ అందాలతో మాకు బంధం!

-కొవ్వూరి సాయిరామారెడ్డి

లైన భావాలు కలవారినే నిజమైన బంధువులు అంటే బాగుంటుంది. విదేశాలకు వెళ్లినప్పుడు అటువంటి మంచి బంధువులు లభించటం కష్టం. అయినప్పటికీ 'విద్య' అనే ద్రవ్యము గనుక మనవద్ద వుండివుంటే ఆ బంధువులు లేని లోటును పూరిస్తుంది. మంచి విద్య మంచి బంధువునితో సమానము. అందువల్లనే యిక్కడ విద్యను కూడా ఆత్మీయుడైన మంచి బంధువునితో పోల్చారు పెద్దలు. అట్టి ఉత్తమోత్తమమైన, పవిత్రమైన, అమూల్యమైన విద్య యను 'అమృతమును' ఎవరు త్రాగుదురో అనగా ఎవరు అట్టి విద్యను శ్రద్ధగా అభ్యసించుదురో, వారు వాల్మీకి, వ్యాస, కాళిదాసుల వలె శాశ్వతకీర్తి వంతులగుదురు. అట్టి అదృష్టవంతులు ప్రపంచంలో ఏమూలకు వెళ్లినా గౌరవించబడుతారు, పూజింపబడుతారు. అట్టి మహనీయుల చరిత్ర సువర్ణాక్షరములతో, చరిత్రలో లిఖించబడుతుంది వారి భౌతికమైన దేహములు అంతరించినప్పటికి, వారి కీర్తి ప్రతిష్ఠలు మాత్రం చిరస్థాయిగా వెలుగొందుతునే వుంటాయి. కనుక మీరందరూ విద్యయను అమృతమును త్రాగి ఆదర్శవంతులైన విద్యావేత్తలుగా తయారు కావాలని నా ఆశయం, ఆకాంక్ష. ఇక ఉంటా...

ఇట్లు, 'మీ నాన్న'



ఆనందానికి మించిన ఔషధం లేదు. అసూయకు మించిన రోగము లేదు.

# గౌతమి మహర్షి

పురాణపండ శ్రీచిత్ర

గౌతముడు బ్రహ్మ మానసపుత్రుడు. సప్త మహర్షులలో ఒకడు. ఈతడు గౌతమ వంశమున జన్మించాడు. పూర్వకాలమున శ్రీహరి మోహినీ రూపం ధరించగా, ఆ రూపమును చూచి దేవతలందరూ బ్రహ్మసృష్టిని అవహేళన చేశారు. అంత బ్రహ్మ అఖిల లోకాల వారిని ఆశ్చర్యపరిచే విధంగా అతి సౌందర్యవతి యగు అహల్యను సృష్టించాడు. ఆ బాలికను గౌతమునకు సపర్య చేయమని నియోగించాడు. అహల్యకు యుక్త వయస్సు వచ్చింది. ఆమె రూపసంపదకు ఇంద్రాదులు ముగ్ధులైనారు. అహల్య గౌతమునకే యిచ్చి వివాహం చేయ నిశ్చయించాడు బ్రహ్మ అయితే దేవతలు నాకిచ్చి చేయండి! నా కిచ్చి చేయండి! అని ఎవరికి వారే ముందుకు వచ్చారు. బ్రహ్మ ఆలోచించి ఎవరు ముందుగా భూప్రదక్షిణ చేసి వస్తారో అహల్యను వారికిచ్చి వివాహం జరిపిస్తానని చెప్పాడు. అది వినిన ఇంద్రాది దేవతలు భూ ప్రదక్షిణకు బయలు దేరారు. ఇంతలో గౌతముడు ద్విముఖ గోవుకు ప్రదక్షిణం చేసి అహల్యను తన కిచ్చి వివాహం చేయమని కోరాడు. ద్విముఖ గోవుకు ప్రదక్షిణ చేసిన భూమిని తిరిగి వచ్చినట్లేయని, అది ధర్మసమ్మతమని యెంచి బ్రహ్మ, అహల్యను గౌతమునికి యిచ్చి అతి వైభవంగా వివాహం జరిపించాడు.

అహల్యను వెంటబెట్టుకొని గౌతముడు దండకారణ్య ప్రాంతమున నివసించసాగాడు. చాలాకాలం బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షముకాగా "ప్రజాపతీ! నే చల్లిన విత్తనములు జాములో పరిపాకమొందునట్లు వరము ప్రసాదించు" అని కోరగా ఆ విధాత నీ కోరిక ఫలించునని పలికి అంతర్ధానమయినాడు అనంతరం గౌతముడు తన భార్యతో శతశృంగగిరికి వెళ్లి అచ్చట ఆశ్రమం నిర్మించుకొని, తన ఆశ్రమమునకు వచ్చి పోయే అతిధులకు సుష్టుగా భోజనం పెట్టి సుఖంగా జీవయాత్ర సాగిస్తున్నాడు.

గౌతముని ఆశ్రమం సస్యశ్యామలమై శోభిస్తున్నది ఉన్నట్టుండి ఆ ప్రాంతంలో కరువు ఏర్పడింది పంటలు లేక, ఆకలి మంటలతో ప్రజలు చనిపోతున్నారు. వరప్రభావం చేత గౌతముని భూములు మాత్రం పండుచున్నాయి. ఆ విషయం తెలుసుకొని వచ్చినవారందరికీ గౌతముడు భోజనం పెట్ట సాగాడు గౌతముని కీర్తి దిశ దిశలా వ్యాపించింది. ఇంద్రాదులు కూడా గౌతముని కీర్తించారు. విఘ్నేశ్వరుడు బ్రాహ్మణ రూపమున వచ్చి గౌతముని పరీక్షించి చేయునది లేక, తాను కూడా ఆ ఆశ్రమమునందే ఉండిపోయాడు. తన తల్లి పార్వతికి సవతి బాధ లేకుండా చేస్తానని లోగడ మాట యిచ్చాడు వినాయకుడు. అందువలన గంగను శివజటాజూటమునుండి ఏదో విధంగా భూలోకానికి పంపాలనే ప్రయత్నంలో వుండి పోయాడు వినాయకుడు. ఈ పని ఒక్క గౌతముని వల్ల తప్ప మరెవరివల్లా నెరవేరదని భావించాడు భావించడమే తడవుగా పార్వతి చెలికత్తెను మాయా గోవుగా చేసి గౌతముని పంట చేలో మేయమని, ఆ మహర్షి ఏమి చేసినను వెంటనే చని పొమ్మని ఆదేశించాడు. గోవు వచ్చి చేలో మేయసాగింది. దానిని చూచిన గౌతముడు పంట పాడగునని భావించి దానిని గరిక గడ్డితో అదలించాడు. అంతే అది మరణించింది. గౌతముడు గోహత్యకు పాల్పడినాడని నిందించి అందరూ వెళిపోయారు.



*నిర్మల హృదయం లేనివాడు ఉద్రేకాలను అణుచుకోని వాడు విజ్ఞానవంతుడు కానేరడు.*

ఈ పాప పరిహారమునకు ఉపాయం తెలియపరచమని గణపతిని కోరగా, శివుని జటాజూటము నందలి గంగను ఈ గోవుపై ప్రవహింపజేసిన అది తిరిగి బ్రతుకుతుందని చెప్పినాడు. అనంతరం గౌతముడు శివుని గూర్చి తపస్సు చేసి మెప్పించగా, గంగను భూతలానికి పంపించినాడు. మాయాగోవు బ్రతికినది. అహల్య గౌతములు సుఖ శాంతులతో కాపురం చేయసాగారు. కొంతకాలమునకు అహల్య కుమారుని గన్నది. అతని పేరు శతానందుడు. కుమార్తెను కూడా కన్నది. ఆమె పేరు అంజన. కాలం గడిచినా ఇంద్రునకు మాత్రం అహల్య మీద కామదృష్టి పోలేదు. ఒకనాటి రాత్రి ఇంద్రుడు కోడి రూపం దాల్చి కొక్కురోకో యని కూయగా, తెల్లవారినదని భావించి గౌతముడు స్నానం చేయటానికి వెళ్లాడు. కొంతసేపటికి ఇంద్రుడు గౌతముని రూపు దాల్చి వచ్చి అహల్యను పొందుచుండగ అసలు గౌతముడు తిరిగి వచ్చి చూచి, అహల్యను శిలయై ఉండమని, ఇంద్రుని వడలంతా యోనులతో వుండమని శపించాడు.

గౌతముడు ఈ లోకమునకు ధర్మసూత్రములు, స్మృతి, న్యాయ, తర్క, సంహితలు అందించాడు. వాటిని వ్యాసుడు ఖండింపగా గౌతముడు కోపించి వ్యాసుని చూడనని శపథం చేశాడు. ఒకనాడు వ్యాసుడు రాగా, తన పాదమున నేత్రమును సృష్టించుకొని వ్యాసుని చూచాడు. నాటి నుండి గౌతముడు అక్షపాదుడయ్యాడు. గౌతమ సంహిత గొప్ప జ్యోతిశ్శాస్త్రంగా పేరొందింది. ఋషులు సాధించలేని పనులు వుండవని గౌతముని చరిత్ర చాటుచున్నది. మహర్షులే లేకున్న లోకమంధకారబంధురమే అయివుండేది. ఋషులు లోకోపకారపరాయణులు.

# మహనీయుల లౌక్యం

ఒక కేసులో ప్రతివాది పక్షాన మాడపాటి హనుమంతరావుగారు, వాది పక్షాన మాదిరాజు రామకోటేశ్వరరావుగారు ఉన్నారు. ఇద్దరూ మితవాదులే. బంధుత్వం కూడా ఉన్నది. రామకోటేశ్వరరావుగారు హనుమకొండ వచ్చినప్పుడు హనుమంతరావు గారింట్లోనే బసచేసేవారు. ఇద్దరూ కలిసి కోర్టుకు వెళుతూ ఉండేవారు.

పంతులుగారు (హనుమంతరావుగారు) తన కూడా తెచ్చుకున్న 'నీలగిరి' పత్రిక సంపుటాలను తిరగేస్తుంటే - 'ఏమయ్యా! కోర్టుకు కూడా పత్రిక ఎందుకయ్యా! అక్కడా నీ సాహిత్యం గొడవేనా' అన్నారు రామకోటేశ్వరరావుగారు హేళనగా. పంతులు గారు చిరునవ్వుతో మిన్నకున్నారు.

ఆ రోజు కోర్టులో ప్రతివాది సాక్షులు రాలేదు. కనుక తీర్పు చెప్పవలెనని రామకోటేశ్వరరావు గారు గట్టిగా వాదించారు.

పంతులుగారు లేచి తన కక్షిదారు, అతని సాక్షులు పెనుతుఫాను మూలంగా రాలేకపోయారని, మరొక వాయిదా యిప్పించాలని కోరారు.

రామకోటేశ్వరరావుగారు లేచి ఇది కుంటిసాకు. దీనికి ఈ కేసుకు ఏ మాత్రం సంబంధం లేదని గర్జించారు.

పంతులుగారు చిరునవ్వుతో లేచి 'నీలగిరి' పత్రిక తీసి అందులో వర్ణింపబడ్డ తుఫాను భీభత్సం వార్తను కోర్టు వారికి చదివి వినిపించి కేసును వాయిదా వేసారు.

'బావా, ఇందుకా 'నీలగిరి' పత్రికలు తెచ్చావు. ఎంత మోసం చేశావయ్యా' అని మేలమాడారు.



*మనిషి మాటలు కావు. అతని నడవడే అతని నిజాయితికి కొలబద్ద.*

# ముట్నూరి ఆస్థాన కవీంద్రులు కాటూరి

*కంచి వాసుదేవరావు*

బందరు కృష్ణా పత్రిక ఆఫీసులో ముట్నూరి కృష్ణారావు గారి దర్బారులో కాటూరి వెంకటేశ్వరరావుగారు దర్బార్ పొయట్- ఆస్థాన కవి. ఆ దర్బారులో జరిగే కవితా గోష్ఠులు, సాహిత్య చర్చలలో కృష్ణారావుగారితో సమాన స్థాయిలో కాటూరి వారు పాల్గొనేవారు ఆ దర్బారులో కవులు గానం చేసిన కవిత్వ నిగ్గు దేల్చి సహృదయ సమీక్ష చేయడం వెంకటేశ్వరరావుగారి వంతు. ఆయన సరసత్వం, అజాత శత్రుత్వం, వ్యక్తిత్వం వలన ఆయన దర్బారులో పాల్గొన డానికి వచ్చిన ప్రతి వొక్కరికీ ఆయన ఆత్మీయుడైన సాహిత్య బంధువు. సద్విమర్శకుడు. కృష్ణారావు గారికి అత్యంత సన్నిహితంగా నిల్చిన ఇద్దరు ముగ్గురులో కాటూరి వెంకటేశ్వర రావుగారు ఒకరు. చెరకువాడ వెంకట నరసింహంగారు, డా.పట్టాభిగారు, మిగిలిన ఇద్దరు. వెంకటేశ్వరరావుగారు బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలో పనిచేస్తున్నప్పుడు దాదాపు ప్రతి ఉదయం కృష్ణా పత్రికకు వచ్చేవారు. అప్పటికి కృష్ణారావుగారు వచ్చేవారు. ఇంకా వర్కర్లు, ఆఫీసు సిబ్బంది వచ్చేవారు. ఆ సమయంలో కృష్ణారావుగారు కృష్ణాపత్రిక ఆఫీసులోని తోటలో తిరుగుతూ ప్రతి పువ్వునూ పలు కరిస్తూ ప్రతి మొక్కను స్పృశిస్తూ ఆకుల మీద ముత్యాలులా మెరుస్తున్న మంచు బిందువులు, పూలపై వ్రాలుతున్న సీతా కోకచిలుకలు- నీలాకాశ సముద్రంలో తేలియాడ్తున్న చిన్న చిన్న పడవలవంటి పక్షులను చూస్తూ ప్రకృతి సౌందర్యా రాధనలో పరవశులయి వుండగా కాటూరి వారు వచ్చేవారు. తన రసానందాన్ని కృష్ణారావుగారు, వెంకటేశ్వరరావుగారికి పంచిపెడ్తూ వుంటే ఆయన కవితా హృదయం పులకించి పోయేది

కృష్ణారావుగారితోనూ కృష్ణా పత్రికతోనూ కాటూరి వారికి గల సన్నిహిత సంబంధం కారణంగా, ముట్నూరివారి మరణానంతరం కృష్ణా పత్రిక సంపాదకత్వ బాధ్యత ఆయనపై పడింది స్వయంగా కొన్నాళ్లు- కోలవెన్ను రామ కోటేశ్వరరావుగారితో కలసి కొన్నాళ్ల 1932 వరకు ఆయన కృష్ణా పత్రిక సంపాదకులుగా వ్యవహరించారు. కాటూరు --కోలవెన్ను సంపాదకులుగా కమలాకర వెంకట్రావుగారు, రావూరు వెంకట సత్యనారాయణగారు ఉపసంపాదకులుగా పనిచేసిన ఆ రోజులు- కృష్ణా పత్రిక చరిత్రలో మరపురాని ఘట్టంగా పేర్కొనవచ్చు. ఐతే కృష్ణా పత్రిక యాజమాన్య పరంగా ఒడిదుడుకులు కారణంగా యాజమాన్యం మారి- వెంకటేశ్వరరావుగారు తప్పుకోవలసివచ్చింది. ఐనా ఆయనకు కృష్ణా పత్రికకు వున్న సంబంధం జీవితాంతం కొనసాగేది. బందరుకు వచ్చినప్పుడల్లా వెంకటేశ్వరరా వుగారు తప్పనిసరిగా కృష్ణా పత్రికకు రావలసిందే. ఆయన రాగానే సంపాదకులు కమలాకర వెంకట్రావుగారు తన కుర్చీ లోంచి లేచి, ఆయనను ఆ కుర్చీలో కూర్చోపెట్టేవారు.

## సౌందర్యనందన మహాకావ్యం

శతాబ్దపు ఆధునిక కావ్యాలలో సౌందర్యనందన మునకు విశిష్ట స్థానం వుందని సాహిత్య విమర్శకులందరూ ఏకగ్రీవంగా అభిప్రాయపడ్డారు. సంస్కృతంలో అశ్వ ఘోషుడు రచించిన కావ్యం ఆధారంగా కాటూరు వెంకటేశ్వర రావుగారు పింగళి లక్ష్మీకాంతంగారు జంటగా రచించారు. తెలుగుదేశంలో ఈ శతాబ్దం తొలి భాగం జంటకవుల యుగంగా పేర్కొనవచ్చు. తిరుపతి వెంకటకవులు, వేంకట



*వివేకం గల మనసుకంటే యోగ్యుడైన మిత్రుడు మరొకడుండడు.*

పార్వతీశ కవులు, కొప్పరపు సోదర కవులు, వేంకట రామ కృష్ణ కవులు - ఎందరో ఆధునిక తెలుగు కవితాలోకాన్ని అలరించారు. తిరుపతి వేంకట కవులలో ఒకరైన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని బందరులో పనిచేస్తున్నప్పుడు వీరిద్దరూ ప్రియ శిష్యులు. తమ గురువుల అడుగుజాడలలో పింగళి -- కాటూరు జంట కవిత్వం ప్రారంభించారు. ఒకరు భావం అయితే ఒకరు రసం, ఒకరు శబ్దం- ఒకరు అర్థం- ఇద్దరి మధ్య అపూర్వ శైలీ సమన్వయనం-- అందువలన జంట కవులలోనే తలమానికమయ్యారు

పింగళి --కాటూరు ఇద్దరూ కృష్ణాజిల్లా వారే. ఒకరు విజయవాడ సమీపంలోని కాటూరు వాస్తవ్యులయితే, రెండవ వారు బందరు సమీపంలోని అత్తమూరు. కాటూరు వారు 1895లో పుడితే పింగళి వారు 1894 లో పుట్టారు. ఇద్దరూ బందరు నోబులు కళాశాలలో చదివారు. ఐతే జంటగా వీరు కవిత్వం చెప్పినా జీవన మార్గాలు వేరు అయ్యాయి. పింగళి కాంతంగారు ఎం.ఎ. కూడా ప్యాసయి అధ్యాపక వృత్తిలో అంచెలు అంచెలుగా ఉన్నత పదవులు చేపట్టారు

## మంపె మొగు

కాటూరు వెంకటేశ్వరరావుగారు జాతీయోద్యమం వైపు మళ్లారు మహాత్మాగాంధీ నాయకత్వంలో ప్రారంభమయిన జాతీయోద్యమం ఆయన దృష్టిని ఆకర్షించింది. ఉప్పు సత్యాగ్రహం సమయంలో రెండున్నర సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు. భారతీయ జాతీయ విద్యా విధానానికి ప్రతీకగా నిలిచిన బందరు ఆంధ్ర జాతీయ కళాశాల వైస్ ప్రిన్సిపాల్, ప్రిన్సిపాల్ పదవులు అధిష్ఠించారు. ఆంధ్రప్రాంతంలో హిందీ అభివృద్ధికి కృషిచేశారు.

కాటూరి వారు స్వయంగా రాసిన కావ్యం పౌలస్త్య హృదయం- పౌలస్త్య బ్రహ్మ మనవడయిన రావణుడిని వేంకటేశ్వరరావు కావ్య దృష్టితో దర్శించి- పౌలస్త్య హృదయంలో అతన్ని బంధించారు.

"సమీక్షి సంపాదకత్వం సమిష్టి రచన సత్యాగ్రహం సంకలనం అధ్యాపకత్వం, అవధానం అకువారం ఆధ్యాత్మికత్వం- అనేక పథాల పయనించి జీవిత గమ్యాన్ని కాటూరి వారు చేరగలిగారు. ఆర్షౌన్నత్యాన్ని ప్రాచీనధర్మ ప్రాభవాన్ని జాతీయతా ప్రబోధాన్ని యుగయుగాలకు మరువని రీతిలో మలచి నిలువెత్తున నిరారుగా మనిషిని నిలిపిన మహా మనీషులు కాటూరి వారు.

ప్రకృతిలో పరమాణువులు పలుకరించే సౌందర్యాన్ని ఆత్మీయతను పలుకరించి మానవతను మరల మరల గుర్తు చేసిన రస పిపాసి కాటూరి వారు.

పాత వార్తల మేలు కలయికలో తన యుగాన్ని సృష్టించుకున్న పరబ్రహ్మమూర్తి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి ప్రియ శిష్యులయి పండిత ఉన్నత వంశజులే కనుక సహజంగానే బహుభంగుల గురువును మించిన శిష్యులై కాటూరి వారు పింగళి వారితో కలసి కమనీయమైన కవన మల్లారు సర్వజ్ఞులయ్యారు. " శ్రీ కాటూరి వేంకటేశ్వరరావులో ఒక అశ్వఘోషుడ్ని ఒక పోతనను ఒక రవీంద్రుని ఒక వర్డ్స్‌వర్త్‌ను చూడగలిగే వారు" అని ఆయన మరణించిన సందర్భంగా ఒక సాహిత్య విమర్శకుడు (అడుసుమిల్లి పూర్ణచంద్రరావు) నివాళి ఘటించాడు.

వైతాళికులలో ముద్దుకృష్ణ కాటూరు -- పింగళిల కవిత్వాన్ని పరిచయం చేస్తూ "తన నూతనాలంకారాల చేతను పాత పద్ధతుల వారు పరిహసిస్తున్నారని నవ్యసాహిత్యం నలుగురిలోకి రావడానికి బిడియపడ్తున్న రోజులలో ఆ వినూతనకైసేవను ప్రశంసిస్తూ ప్రచారం చేసిన కవులు వీరు. తెలుగునాట కనుల పండువగా కనబడే సంక్రాంతి దృశ్యాలకు ఒక

శాశ్వతత్త్వం కల్పించడంలో వీరు మాటలను రంగులుగాను, కలాన్ని కుంచెగాను వాడిన విచిత్ర చిత్రకారులు. కృషీవలుడికి తొలకరి చినుకుల విలువల వలె వీరి "తొలకరి" కూడా భావి కృషికి ప్రయోజనకారి అయినది. వీరి కవిత్వానుభవం పదునెక్కిన తరువాత వెలువడిన సౌందర్య నందనం వీరి విలువను వ్యక్త పరుస్తుంది అని అన్నారు.

## నన్నయ్య నుంచి నారాయణరెడ్డి వరకు

ఆంధ్ర సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా నిలిచిరి. కేంద్ర సాహిత్య అకాడమీ తరఫున ఆయన సంకలనం చేసిన "తెలుగు కావ్యమాల" ఆదికవి నన్నయ్య నుంచి అత్యాధునిక కవి జ్ఞానపీఠ అవార్డు గ్రహీత నారాయణరెడ్డి వరకు - దాదాపు వెయ్యేళ్ల తెలుగు కవితా రీతులను కాటూరి వెంకటేశ్వరరావుగారు- కదంబమాలగా సంకలనం చేశారు. తెలుగులో అంతకు పూర్వం వివిధ కవుల కవితా సంకలనాలు లేక పోలేదు. వేంకట పార్వతీశ కవుల మటాకారయం- ముద్దుకృష్ణ వైతాళికులు - తెలంగాణా కవుల కవితా సంకలనం ఉదయ ఘంటలు- వీటిలో కొన్ని మాత్రమే. వీటిలో వైతాళికులకు లభించిన ప్రాచుర్యం మరే సంకలనానికి లభించలేదు. కాని వీటన్నిటినీ మించినది - తెలుగు కావ్యమాల - అది రేఖా మాత్రంగా తెలుగు సాహిత్య పరిచయమాల.

## విశిష్ట వ్యక్తిత్వం

కాటూరి వారిది విశిష్ట వ్యక్తిత్వం. దబ్బపండు శరీరచ్ఛాయ. ఆజానుబాహు విగ్రహం- సూటిగా యితరుల హృదయాల్లోకి దూసుకు వెళ్లగల కళ్లు- ముఖానికి మరింత ఠీవిని తెచ్చిపెట్టే గుబురు మీసాలు. ఒకసారి చూడగానే ఎవరికయినా గౌరవంతో నమస్కరించాలని అనిపించే రమూర్తి- ఆయన ఎప్పుడూ ధరించే మల్లెపూవు వంటి బార్డరు పంచె లాల్చీ, ఖద్దరు కండువా ఆయన వ్యక్తిత్వాన్ని మరింత పెంచేవి.

ఆధునిక కవులలో- తన సమకాలికులలో- కాటూరి వెంకటేశ్వరరావుగారు అజాత శత్రువు ఆ స్థాయికి ఎదిగిన వారందరి కవులలో కన్పించే ఈర్ష్యాద్వేషాలు ఆయనలో కన్పించేవి కావు. దురహంకారం స్వాతిశయం ఆయనలో వుండేవి కావు. కావ్యమాలలో కవుల గురించి చేసిన పరిచయ వాక్యాలలో తమ గురించి అతి క్లుప్తంగా రాసుకున్నారు. అది ఆయన వినమ్రతకు చిహ్నం. 1966 లో అనుకుంటాను- గుడివాడలో కవిసామ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారికి ఆంధ్ర నలంద అనే సాహిత్య సంస్థ కాటూరివారు తన మిత్రులతో ఆధ్వర్యంలో గజారోహణ సత్కారాన్ని ఘనంగా జరిపించారు. ఆనాటి ఉత్సవాలకు ఆనాటి ప్రసిద్ధ కవులందరూ హాజరయ్యారు.

ఆయన ఎక్కడ వున్నా... వచ్చి పోయే కవులతో కళకళలాడుతూ వుండేది. విజయవాడలో ఆయన కుమారుడు విజయసారథి ఆకాశవాణి కేంద్రంలో పనిచేస్తున్నప్పుడు- తన తండ్రిగారిని చూడ్డానికి వచ్చిపోయే వారి సదుపాయం కోసం అవసరానికి మించి పెద్ద యింటిని అద్దెకు తీసుకున్నానని ఒకచోట చెప్పారు. విజయసారథి కూడా మంచి కవి రచయిత. ఆయన రచించిన పితృవనం- ఆంధ్రప్రభ నిర్వహించిన నవలాపోటీలలో ప్రథమ బహుమతి గెల్చుకుంది. ఆయన శిష్యులు ఆయనను పితృతుల్యులుగా భావించేవారు చాలామంది వున్నారు. వారిలో బాలకొండ నరసింహమూర్తిగారు. త్రివేణి సంపాదకులు భావరాజు నరసింహారావుగారు ముఖ్యులు. కాటూరి వెంకటేశ్వరరావుగారు మరణించినప్పుడు బందరు నాగేశ్వరస్వామి దేవాలయంలో సంతాపసభ జరిగింది. గద్గద స్వరంతో నరసింహారావుగారు కాటూరి వారి పట్ల తనకు గల పితృభావాన్ని ప్రకటిస్తున్న ప్రసంగం చాలా మందిని కదలించివేసింది. నరసింహమూర్తిగారు సౌందర్య నందనాన్ని హిందీలో దీక్షిత్- అనువదించారు. అనువాదం పూర్తి అయ్యేవరకు ఆయన గడ్డం గీసుకోలేదు. అంత నిష్ఠతో ఆయన కొంత వరకయినా, గురు ఋణాన్ని తీర్చుకున్నారు. ★



*సరియైన నాయకత్వం లేనివారు. దేనిని సాధించలేరు.*

# ఎవరికెవరు ?

సాత్వికుడై సాధకుడైన యువకుడొకడు పగలంతయూ ఊరి వెల్పలనుండు తన గురువాశ్రమమున శ్రవణ భజన ధ్యానాదులతో గడిపి సూర్యాస్తమయము కాగానే గురువాజ్ఞ పొంది గ్రామములోని తన గృహమునకు ప్రతిదినము వచ్చుచుండెడివాడు

గురువు ఆతనికి జ్ఞాన బోధ చేయనెంచి "నాయనా! పగలంతయూ నా చెంతనుండు వాడవు. ప్రతిదినము రాత్రి ఇంటికేల పోదువు? ఇచటనే యుండి ధ్యానము సల్పుకోరాదా?" అన్నాడు.

"స్వామీ! తాము శలవిచ్చినది మంచిదే కాని నా తల్లిదండ్రులకు, నా ఇల్లాలికి నాపై అత్యంత ప్రేమ. ఒక్కరోజు కూడా నన్ను చూడక వారు జీవించలేరు. అందుకై రాత్రి గృహమునకేగు చుంటిని " "బాబు! నీవు చెప్పిన నీవారందరూ వారి యొక్క స్వార్థమునకే నీ యెడల ప్రేమ చూపుతున్నారే కానీ అది నిజమైన ప్రేమ కాదు"

"గురూజీ! మీరు పొరబడుచున్నారు. వారట్టి వారు కాదు. నా కోసం ప్రాణములైనా అర్పిస్తారు"

"అటులైన నీకు ఒక మాత్ర ఇచ్చెదను. అది ఇంటికి వెళ్లిన పిదప ఆ మాత్ర వేసుకొని నీరు త్రాగుము. అప్పుడు చచ్చినవానివలె పడెదవు. ఆ తర్వా దంతయూ నీకే తెలియును" అని చెప్పి ఒక మాత్ర ఇచ్చెను.

అతడు ఇల్లు జేరి గురువు చెప్పినట్లుగానే ఆ మాత్ర వేసుకొని మృతునివలే పడిపోయెను.

ఆతని మృతికి చింతించుచూ ఇంటిలోని వారందరూ ఏడవసాగిరి. కన్నీరు మున్నీరుగా విలపించసాగిరి.

అంతలోనే అటుగా వచ్చునట్లుగా, ఏమి తెలియని వారిగా గురువుగారు ఆ యింటికి వచ్చి తన శిష్యుని మృతికి ఆయన కూడా చింతించ సాగెను. అంత ఆ గురువు "నేను చెప్పినట్లు చేసినచో మీవాడు బ్రతకగలడు" అనెను.

"స్వామీ! మీరేమి చెయ్యమన్న ఆ విధంగా చేసెదము" అన్నారా జననీజనకులు మరియు భార్య.

"నేను ఒక గ్లాసు ద్రవము ఇచ్చెదను. అది త్రాగిన, త్రాగినవారు మరణించి శిష్యుడు బ్రతుకగలడు" అనెను.

వేయి కారణాలు చెప్పి జననీ జనకులు, అంతకన్ననూ సతీ తప్పుకొనిరి.మృతుని రీతిగా పడి యుండిన ఈ నాటకమంతయూ చూచుచుండిన శిష్యుడు లేచి "స్వామీ! మాతపితృ భార్యాపుత్రాదుల ప్రేమ యెట్టిదో నా కర్థమైనది. ఇక చాలు ఈ సంసారముపై మమకారము. మీ సన్నిధినే సర్వదా నిల్చి తరింతును. లౌకిక ప్రేమలన్నియు స్వార్థపూరితములే, నాటకములే, బూటకములే. తస్మాత్ జాగ్రత్త.

(శ్రీ సత్యసాయి కథాసుధ నుండి )



*ఎవరికీ సాయం చేయకపోయినా పరవాలేదు కాని అపకారం మాత్రం చేయకు.*

# భక్తిరేవ గరీయసి

-'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

## సూ. సంకీర్త్య మానః శీఘ్రమేవావిర్భవతి అనుభావయతి చ భక్తాన్

ఈశ్వరుడు కీర్తనీయుడు, స్తవనీయుడు. అతడు సంకీర్తనకు సంతోషించి సత్వరం సాక్షాత్కరిస్తాడు. భక్తులకు భవ్యమైన దివ్యానుభవం ప్రసాదిస్తాడు.

ఆ దయామయుణ్ణి భక్తులు ఏ రూపంలో ధ్యానిస్తే ఆ రూపంలో ఆ దివ్య విభూతులతో అతి శీఘ్రంగా ఆ స్వామి ప్రత్యక్షమై భక్తుల కోరిక తీరుస్తాడు. ఆవు వెంట లేగదూడవలె భక్తి వెంట భగవంతుడు పరువెత్తుకొని వస్తాడు. ఆ స్వామి దేవకీ వసుదేవులకు, అదితి కశ్యపులకు, యశోదానందులకు పుత్రరూపంలో వచ్చి అనుగ్రహించాడు. గోపాలురకు సుదామ అక్రూర ఉద్ధవ అర్జునాదులకు మిత్రరూపంలో వారి ఈప్సితం నెరవేర్చాడు. రాధా గోపికలకు అష్ట మహిషులకు భర్త రూపంలో విలాసం చూపించాడు ప్రహ్లాదునికి నృసింహ రూపంలో ప్రత్యక్షమైనాడు.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప !
మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వ భూతేషు యస్సమామేతి పాండవ !

అర్జునా ! నా భక్తుడు నన్ను తెలుసుకోగలడు, చూడగలడు, నాలోనికి జేరగలడు. వాడు సంగవర్జితుడు, అజాతశత్రువు, తత్త్వజ్ఞుడు, సర్వభూతహితుడు. వాడంటే నాకు చాల ఇష్టం. నేను వానికి ఇష్టమైన రూపంలో ఇష్టమైనప్పుడల్లా ఇష్టమైన చోటల్లా దర్శనం ఇచ్చి వాని కోరిక తీరుస్తుంటాను అంటాడు శ్రీ కృష్ణుడు.

ఇక్కడ సగుణ నిర్గుణ సాకార నిరాకారాది భేదాలు లేవు భక్తుడు ఎలా ఉపాసిస్తే భగవంతుడు అలా అవతరిస్తాడు.

ఆ విశ్వమయునికి ఎవరి సహాయసహకారాలు అక్కర లేదు. సర్వశక్తులు ఆ దేవుని వశంలో ఉంటాయి. అతడు మూల కారణభూతుడు, సర్వసృష్టికి బీజ ప్రాయుడు. విశ్వ విరాట్ రూపం అతనిదే. ఇతరులను మోహపెట్టగలడు, మోక్షం ప్రసాదించగలడు. ఆ స్వామి గుణాలకు అతీతంగా ఉంటాడు, గుణాత్మకంగానూ ఉంటాడు.

ఆ భువన మోహనమూర్తిని చూచినపుడు ఎట్టి వారైన, ఎంతటి యోగీంద్రులైన పరవశులు కావలసిందే. ఆ దివ్య దర్శనాన్ని మహా భాగ్యంగా భావించి రసానందం అనుభవిస్తుంటారు ధన్యజీవులు. లౌకికవస్తు మోహం దూష్యం కాని, పరమాత్మునిపై గల మోహం పూజనీయం, స్తవనీయం.

ఈ భక్తియోగానికి అందరూ అర్హులే. స్త్రీ పురుష వయోభేదం లేదు.

పుంస్త్వే స్త్రీత్వే విశేషోవా
జాతినామాశ్ర మా దయః
న కారణం మద్భజనే
భక్తి రేవ హి కారణమ్ !



క్రోధాన్ని మించిన అగ్నిలేదు జ్ఞానంకంటే సుఖం లేదు.

సూ. త్రిసత్యస్య భక్తి రేవ గరీయసి భక్తి రేవగరీయసి

త్రిసత్యాలు - దైహికమైనది వాచికమైనది మానసిక మైనది ఈ మూడు విధాల ముమ్మాటికి భక్తి యోగం ఇతర జ్ఞాన కర్మాది యోగాలకంటె సర్వశ్రేష్ఠమైనది.

భూత భవిష్యద్వర్తమానలలో త్రికరణ శుద్ధిగా భక్తి మాత్రమే శ్రేష్ఠం. సాంఘీక ధార్మిక నైతిక ప్రమాణాలు మార వచ్చు కానీ భక్తి నిత్యం. భక్తి ప్రేమస్వరూపిణి. ఇది పర మాత్మవలె సత్యమయింది, నిత్యమయింది. భక్తి గొప్పదనం ఎప్పటికీ తరుగనిది, సర్వత్ర మాన్యమయింది.

ఉనిషత్తులు ఇలా ఘోషిస్తున్నాయి --

సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తి మాశ్రయ
భక్తి నిష్ఠోభవన - భక్తి నిష్ఠోభవ -
భక్త్యా సర్వ సిద్ధయః సిధ్యంతి
భక్త్యా సాధ్యం న కించిదస్తి

అన్ని ఉపాయాలు మానుకో. భక్తిని మాత్రం ఆశ్రయిం చు. భక్తి పరుడవుకమ్ము. భక్తి నిష్ఠ పొందుము. భక్తివలన అన్ని సిద్ధులు సిద్ధిస్తాయి. భక్తి సాధించలేనిది అంటూ ఏదీ లేదు. భక్తియే సాధ్యం. పొందదగింది భక్తి మాత్రమే.

యథాగ్నిః సుసమృద్ధార్చిః
కరోత్యేధాంసి భస్మసాత్
తథా మద్విషయా భక్తి
రుద్ధవైనాంశి కృత్స్నశః

ఉద్ధవా ! అగ్ని ఎండు కట్టెలను కాల్చి వేసినట్లు భక్తి సర్వ పాప జాలాన్ని భస్మం చేస్తుంది. భక్త జనుల సాధనలను కూడా దేవుడే సంరక్షించి వృద్ధి పరుస్తుంటాడు. భగవత్ ప్రీతి కూరుస్తాడు. ఈ భక్తి వ్రతానికి సర్వులు అధికారులే. రామాయణ భారత, భాగవతాది గ్రంథాలలో భక్తిని గూర్చి విపుల ప్రశంస ఉంది. ఇది సత్యం. ఇందుకే చివరకు నారద మహర్షి నొక్కి చెపుతున్నాడు. మనసా వాచా కర్మణా ఆలో చించి నిర్ధారించాను భక్తి సర్వ శ్రేష్ఠం భక్తి సర్వసులభం అని,

శ్రేయములు కురియు భక్తిని
జేయక కేవలము బోధ సిద్ధికి
తపమున్ సేయుట విఫలము పొల్లున
ఆయము సేకురునె తలప అధికంబైనన్. * * *

## ఓ అల్లూరి !

ఓ అల్లూరి!
మొక్కవోని నీ స్థైర్యం
ముక్కంటిలోని నీ శౌర్యం
నవ భారత నిర్మాణానికి
నేటి యువత కందించు-
చెక్కు చెదరని నీ విశ్వాసం
చక్కనైన నీ నాయకత్వం
సమ సమాజ సాధనకై
నేటి యువత కందించు-
నిస్వార్థమైన నీ భావాలు
నిరుపమానమైన త్యాగాలు
రేపటి తరాల కందించు-
భరత మాత ముద్దుబిడ్డ అల్లూరి
భారత చరిత్రకు స్ఫూర్తి సిరి...

-- బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

*(అల్లూరి సీతారామరాజు వర్ధంతి ఏప్రిల్ 12 తేదీ)*

*నోరారా భగవంతుని కీర్తించని నోరు కుమ్మరి మన్ను కోసం తీసిన గుంటలాంటిది.*

# రచనకు మూడు రకాల అస్తిత్వం

డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం.

ఏకాలంలోనైనా ఒక రచనకు విలువకట్టే విమర్శకుడు దాని అస్తిత్వాన్ని గురించి ముందుగా నిర్ణయించవలసి వస్తుంది. నిజానికది సాహిత్య మౌలిక సమస్య. రచన కుండేది ఒకే ఒక అస్తిత్వం. కాని ఆ ఒక్కటీ మూడు రకాలుగా గోచరించడం లోక సహజం. ఆ మూడు రకాలివి :-

1. రచయిత తన రచన కున్నదని చెప్పుకుంటున్న అస్తిత్వం.

2. పఠితగాని, విమర్శకుడు గాని ఆ రచనకున్నదని చెపుతున్న అస్తిత్వం.

3. ఆ రచనకున్న అసలైన అస్తిత్వం.

ఈ మూడూ త్రికరణాల్లాంటివి. మూడూ కలిసి ఒకటిగా మనగలిగితే అంతకంటే ముచ్చటైన సత్యం మరొకటి ఉండ బోదు. కాని అలా మూడూ ముడివడటం సామాన్యంగా సాధ్యపడదు. ఒక వేళ సాధ్యమైతే దానిమీద చర్చకు పెద్దగా అవకాశ ముండదు. ముడిపడకపోతే మిగిలేదంతా చర్చయే. సమకాలీన సాహిత్యంలో ముడిపడే సమస్యలు తక్కువ; పడనివి ఎక్కువ మనం పడనీయనివి మరీ యెక్కువ

ఈ మూడు రకాల వింగడింపులు ఒక రచన కెంత వర్తిస్తాయో, ఒక వాక్యానికీ, రచనకూ, సాహిత్యానికీ కూడా అంతే అనువర్తిస్తాయి.

కవులు తమ కావ్యావతారికల్లోనూ, కావ్య ఘట్టాల లోనూ, తమ తమ రచనల అస్తిత్వాలను గురించి సూచిస్తారు. కాని, ఆ అంశాలలో కవుల అభిరుచులు, ఆశయాలు, కవితా లక్షణాలు, రచనాస్వభావాలు ఎక్కువగా గోచరిస్తుంటాయి. అయితే, అవన్నీ ఆయా రచనల్లో ఎలా చోటు చేసుకున్నాయో వివేచించవలసిన విషయం విమర్శకుల బాధ్యత గానే మిగిలి పోతుంది. ఆదర్శాలకూ ఆచరణలకూ ప్రయోగాలకూ ప్రమా ణాలకూ ఎంత వరకు పొత్తు కుదిరిందో, రచయిత రచనలో ఎంత వరకు కృతకృత్యుడయ్యాడో ఉత్తమ విమర్శకుడు వివేచిస్తాడు. మరికొందరు అలాకాదు. రచయిత భావ జాలంతో తన భావజాలం పడిరాకపోతే ఒక్కొక్కసారి నిర్దాక్షిణ్యంగా తమ ప్రమాణాలతో ఆ రచనను పడ తిట్టవచ్చు కూడా ! ఇదంతా విమర్శకుడు ఆ రచన అస్తిత్వాన్ని రచయిత దృక్పథంతో ఏకీభవించి నిర్ణయిస్తున్నాడా? లేక - విభేదించి విలువ కడుతున్నాడా ? అన్నదానిమీద ఆధారపడి ఉంటుంది.

ఒక ఉదాహరణ నన్నయ తన కవిత్వంలో 'ప్రసన్న కథా కలితార్థ యుక్తి '' ఉన్న దన్నాడు. దానిని విమర్శకులు దర్శించి వ్యాఖ్యానించారు. కథాకథనశిల్పంలో ఆ లక్షణాన్ని అందరూ అంగీకరించారు ఏకగ్రీవంగా. అందువలన అది వివాదగ్రస్త విషయం కాలేదు. కానీ పాల్కురికి సోమనాథుడు తన కవితాగుణంగా సూచించిన 'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' ఆయన కవితకు సర్వత్రా అన్వయించడం లేదు. అందు వలన దానిమీద అందరికీ ఏకాభిప్రాయం లేదు. దీనివలన తేలిందేమిటంటే - కవి చెప్పుకున్న కవితా లక్షణాన్ని ఆయన

కావ్యాలలో ఉండాలనే నియమం లేదు. నన్నయ తన ఆశయాన్ని ఆచరణలో అక్షరాలా నిరూపించాడు సోమన ఆపని చేయలేకపోయాడు. అంటే - కవి తన రచనకు ఒక నిర్దిష్టమైన అస్తిత్వాన్ని కల్పించడానికి ఆశించవచ్చు; దానికై ప్రయత్నించవచ్చు. కాని, ఆ ప్రయత్నంలో సఫలు డయ్యాడా? లేదా? అయితే ఎంతవరకు అయ్యాడు ? అనే ప్రశ్నలమీదనే అతని రచన యొక్క అసలైన అస్తిత్వపు విలువ ఆధారపడి ఉంటుంది.

రచన యొక్క అస్తిత్వం విమర్శకుని దృక్పథం మీద కూడా అధారపడి, ఒక్కొక్కసారి తీవ్ర వాదోపవాదాలకు నిలయమౌతుంది. కవిత్రయంవారు ఆంధ్రమహాభారతాన్ని మత ప్రచారం కోసం వ్రాశారా, సాహిత్యస్పృహతో రచిం చారా అనే అంశం మీద నేటికీ చర్చ సాగుతూనే ఉంది. రచన యొక్క సాహిత్యపు అస్తిత్వాన్ని సాహిత్యేతర ప్రమాణాలతో నిర్ణయించేవారు ఆంధ్రమహాభారత సాహిత్య వ్యక్తిత్వాన్ని గుర్తించరు.

చరిత్రలో ప్రతిఘట్టంలోనూ సాహిత్యాన్ని ప్రచార సాధనంగా ఒక వర్గంవారో, ఒక రాజకీయ పక్షంవారో, ఎప్పుడూ వాడుకుంటూ ఉంటారనీ, అంతకంటే సాహిత్యానికి ఉత్తమమైన అస్తిత్వం సమాజంలో ఉండ టానికి వీలు లేదనీ భావించేవారు భారతాన్నే కాదు, ప్రతి కవితనూ భావజాల ప్రచారంకోసం పుట్టినట్లే చూస్తారు. దానికి తగినప్రమాణాలతోనే పరిశీలిస్తారు. ప్రమాణాలకు నిలబడలేకపోతే వారి దృష్టిలో ఎంత ఉదాత్తసాహిత్యమైనా ఎందుకూ కొరగానిదై పోవచ్చు. లేదా, కొన్నాళ్ళకు ఆ విమర్శకుల ప్రమాణాలే ప్రజల దృష్టిలో పనికిరానివై పోవచ్చు. ఈ రెండూ ఇప్పుడు ప్రపంచంలో చూస్తున్నాం.

రచన యొక్క అసలైన అస్తిత్వం నిర్ణయించటం అంత తేలికైన పని గాదు. పదహారవ శతాబ్దంలో వెలువడిన తెలుగు కావ్యాలను ప్రబంధాలని పిలుస్తున్నాం. వాటి సమగ్ర అస్తిత్వ సందర్శనం కోసం, ఎన్ని వాదోపవాదాలు నడుస్తున్నా, మనం ఇంకా అన్వేషిస్తున్నాం.

పదకవిత్వ అస్తిత్వ వ్యక్తిత్వాలను గురించి ఇంకా లోచూపు సారిస్తూనే ఉన్నాం. కవిత్వంలో ఛందశ్శిల్పం, లయాత్మకత ఇప్పటికీ చర్చనీయాంశాలుగా సాగుతున్నాయి. భావకవితా ప్రయోగాలను గురించి నవ్య సంప్ర దాయోద్యమం గురించి, ఆధునిక మహా కావ్య స్వరూప స్వభావాలను గురించి, అనుభూతివాద కవితా తత్త్వాన్ని గురించి ఇంకా గాఢంగా పరిశోధనలు నడుస్తున్నాయి. భిన్నా భిప్రాయాలుండవచ్చు. మథనం మంచిదే.

సామాజిక చైతన్యం అన్ని రంగాల్లో సాహిత్య అస్తిత్వాన్ని నియతం చేస్తుందా ? సాహిత్య అస్తిత్వం సామాజిక చైతన్యం పరిధిని తనలో విలీనం చేసికొని కళాత్మకంగా సమున్నతంగా ప్రతియుగంలో ఉండగలు గుతుందా ? సాహిత్య అస్తిత్వానికి ముఖ్యమైంది సాహిత్య పరమైన అస్తిత్వమా ? సాహిత్యేతరమైన అస్తిత్వమా ? అనే ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించే రచయితలు, పరితలు, విమర్శకులు, కళాకారులు అనుసరించే వారి వారి దృక్ప థాలను బట్టి రచనల అసలైన అస్తిత్వాలను నిర్ణయించటం జరుగుతోంది. అందుకే ఇన్ని అభిప్రాయ భేదాలు, ఇంత వైవిధ్యం, అయినా, మూడు విధాల ఏకత్వం కోసం ఆగని ప్రగతి సాగిస్తున్నాం.

అసలైన అస్తిత్వాన్ని, ఏకత్వాన్ని దర్శించి నిర్ణయిం చటం సాహిత్యేతర దృక్పథాలతో ఎన్నటికీ సాధ్యంకాదు. సాహిత్య స్పృహలతో నిర్ణయించటం మాత్రం అసాధ్యం కాదు. కాని, అపూర్వం! అందుకే సాహిత్యానికీ, రచనకూ సమాజ జీవితంలో విలువకట్ట లేనంత విలువ !

* * *

*ఒక దీపం మరో దీపాన్ని వెలిగిస్తుంది. తన కాంతి తగ్గకుండానే.*



# రామాయణ పాత్రల ఆదర్శం

కొమరగిరి జయప్రద

రామాయణం ఆదికావ్యం. అది ఒక సంస్కృత వాఙ్మయమునకే గాక, సర్వ వాఙ్మయములకును అది ఆది కావ్యమే. భారతీయ కుటుంబ జీవితమును గురించి, సత్సంప్రదాయములను గురించి, ఉన్నంతగా, సమగ్ర సుందరంగా చిత్రించిన మహాకావ్యం. ఈ మహాకావ్యములోని వివిధ పాత్రల ఆదర్శ జీవితాలు. వారి నడవడి, నైతిక విలువలు అత్యున్నతములు. పరిపాలకులు పాటించవలసిన సామాజిక ధార్మిక కర్తవ్యములు, వారనుసరించవలసిన నైతికాచరణ, వారనుష్ఠింపదగిన ఆధ్యాత్మిక సంబంధమైన విషయాలు ఎన్నో చక్కగా, సమయోచితంగా నిర్దేశించడం జరిగింది. వివిధ పాత్రల మధ్య సంఘర్షణలకు తావివ్వకుండా, పాత్రలకు జీవం పోసి, పోషించి, చైతన్యాన్ని కలుగ జేసి, క్రమబద్ధమైన సమాజమునకు అవసరమైన ఆదర్శములను ప్రసాదించి, లోక కళ్యాణమునకు విశ్వశాంతికి దోహదం చేసే పాత్రలను సృష్టించిన ఘనత రామాయణ మహా కావ్య రచయిత వాల్మీకి మహర్షికే దక్కింది. ఈ మహాకావ్యములోని కొన్ని ముఖ్యమైన సంఘటనలను మాత్రమే శ్రీవాణి పాఠకులకు అందించ సంకల్పించుకొనినాను.

శ్రీరామచంద్రుడు ఆదర్శవీరుడు. యుద్ధనీతిని, మర్యాదను, తూ.చ. తప్పకుండా ఆచరించిన ధర్మశ్రేష్ఠుడు, సత్యసంధుడు, యుద్ధనీతికోవిదుడు. ఒకసారి యుద్ధభూమిలో రావణునితో ఎదురుపడి యుద్ధం చేయవలసి వస్తుంది. రామ బాణం ధాటికి తట్టుకోలేక, రావణుడు తన ఆయుధాల నన్నింటిని కోల్పోయి, యుద్ధ భూమిలో నిరాయుధుడై నిస్సహాయ స్థితిలో నిలబడి ఉంటాడు. అటువంటి స్థితిలోనున్న రావణుని చంపడం ధర్మం కాదని భావించి "ఓ రాక్షసరాజా! లంకా పట్టణంలోనికి వెళ్లి కొంచెం విశ్రాంతి తీసుకో! పాపం! అలసిపోయినావు! కొంతసేపు విశ్రాంతితీసుకొని, తిరిగి రథారూఢుడవై, ధనస్సును ధరించి తిరిగి మళ్లీ యుద్ధభూమికి రా! అపుడు నాపరాక్రమము చూచెదవు గాక!" అని శ్రీరాముడు ఎంతో హుందాతనంగా ఔదార్యంతో ప్రవర్తిస్తాడు. ప్రియాతి ప్రియమైన తన అర్ధాంగి సీతను అపహరించిన పరమకిరాతకుడు తన చేజిక్కినప్పటికీ, అవకాశం దొరికిందికదా యని, అధర్మంగా రావణుని చంపదలచలేదు. అదే శ్రీరాముని గొప్పతనం.

శత్రువులకు కూడా శ్రీరాముని సచ్ఛీలము యెడల అత్యున్నతమైన విశ్వాసం, గౌరవం వుండేదని ఈ క్రింది సంఘటన వలన తెలుస్తున్నది. యుద్ధ భూమిలో రావణుని కుమారుడైన మేఘనాధుని (ఇంద్రజిత్) లక్ష్మణుడు వధిస్తాడు. భార్య సులోచన సహగమనము చేయ సంకల్పించు కుంటుంది భర్త శవం యుద్ధభూమిలో ఉంటుంది గదా! రావణుడు విలపిస్తున్న కోడలిని పిలిచి శ్రీరాముని శిబిరానికి వెళ్లి, అడిగి భర్త శవాన్ని తెచ్చుకో మంటాడు. శత్రుశిబిరానికి వంటరిగా వెళ్లటానికి సులోచన సంకోచిస్తుంది, సంశయిస్తుంది. అపుడు రావణుడు "బాలబ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు, ఏకపత్నీ వ్రతుడు శ్రీరాముడు వున్నచోటుకి నీవు నిర్భయంగా వెళ్లవచ్చును అమ్మా!" అని ఎంతో విశ్వాసంతో అంటాడు. అప్పుడు మంత్రులు "ప్రభూ! మీరు రాముని భార్యను తెచ్చారే ! అలాంటి రాముని దగ్గరకు మీ కోడలిని పంపడం ఉచితమా



*పరనింద గృహ క్షయం యతి నింద కులక్షయం.

! "అనే సందేహమును వెలిబుచ్చారు. అప్పుడు రావణుడు "పరస్త్రీలను అపహరించడం రావణుని పని, రాముని పని కాదు." అని అంటాడు. శత్రువులకు సహితం రాముని యెడల ఎంతటి విశ్వాసం వుండేదో ఈ సంఘటన వల్ల మనం బాగా అర్థం చేసుకొనవచ్చును. శ్రీరాముడు ఉత్తమ సచ్ఛీల సంపన్నుడు. సీత యొక్క పాతివ్రత్య మహిమను రావణుని భార్య మండోదరి సహితం గుర్తించింది రావణ వధానంతరం మండోదరి తన భర్త మృతదేహం మీద పడి విలపిస్తూ "పతివ్రతా యాస్తప సానూనం దగ్ధోసియే ప్రభో!" అని విలపిస్తుంది. అనగా నీవు పతివ్రతయగు సీత యొక్క తేజము చేతనే దగ్ధమైనావని అర్థము. సీతయొక్క పవిత్రత, శీల సంపదలను గురించి రాక్షసస్త్రీలు అందులో రావణుని భార్య మండోదరి కూడా ప్రశంసించడం విశేషం. సీత యొక్క ఉన్నత శీలస్వభావాలు శత్రువుల చేత వెల్లడి చేయబడ్డాయంటే, సీతయొక్క శీలసంపద ఎంత విశిష్టమైనదో అర్థం చేసుకొనవచ్చును

హనుమంతుని అద్భుత సాహసకృత్యాలను గురించి ఒక పర్యాయం శ్రీరాముడే స్వయంగా ప్రశంసిస్తాడు. యుద్ధభూమిలో అతడు చాకచక్యంగా, సమయస్ఫూర్తితో నిర్వహించిన తీరును శ్రీరాముడు అభినందిస్తూ"ఇటువంటి మహత్తర కార్యాలను నిర్వహించ గల సమర్థులు, ఈ భూమండలంలో, హనుమంతుని వలె మరెవ్వరూ నిర్వహించ లేరు. ఇతడు చేసిన సాహసకృత్యాలన వలన మొత్తం రఘు వంశమే విపత్తుకు గురికాకుండా రక్షింపబడింది." అని కొనియాడుతాడు. అంతే కాదు త్రిలోక విజేతయగు రావణుడే, హనుమంతుని పరాక్రమమును చూచి నివ్వెరపోయి "సాధు వానర వీర్యేణ శ్లాఘనీయోఽసి మేరిపుః" అని అంటాడు. అనగా ఓ వానరా! శభాష్! నీవు ప్రశంసలనందుకొనుటకు తగిన శత్రువుడవని అర్థము. దీనిని బట్టి హనుమంతుని శక్తి ఎటువంటిదో బోధ పడుతున్నది. ఈ మహాకావ్యంలో ప్రతినాయకుడుగా సృష్టించబడిన రావణుడు గూడా సాధారణ పురుషుడు కాదు. అతి బలపరాక్రమ సంపన్నుడు. సకల విద్యాపారంగతుడు. అతనిమహత్తర శక్తి ముందు అనంతమగు ప్రకృతియే మోకరిల్లింది. అతని తేజము ముందు దేవేంద్రాది దిక్పాలకులే నిస్తేజులైనారు. అతని పేరు స్మరించినంత మాత్రముననే సకల చరాచరకోటి హడలి పోయేది. అతడు అనంత శక్తి సంపన్నుడు. లంకాపురి సువర్ణభూమి. సకల భోగభాగ్యములతో విలసిల్లుతుండేది. హనుమంతుడంతటి వాడు అతని శక్తిని చూచి నివ్వెరపోయి"అతని యందు అధర్మము లేకుండిన యెడల, అతడు సర్వలోకములను రక్షింపగల, మహాసామర్థ్యముగల శక్తి సంపన్నుడు. పరస్త్రీ వ్యామోహం అతనిలో లేకుండినచో, అతనిని ఓడించగల శక్తిమంతుడు త్రిలోకములలో వుండేవాడు కాదు" అని రావణుని శక్తి సామర్థ్యములను చూచి ఆశ్చర్యచకితుడై చెబుతాడు. అంతటి శక్తి వంతుడుకూడా పరస్త్రీ వ్యామోహముతో పతనమైనాడు.కనుక సచ్ఛీలత (Good Character) కుమించి శక్తి వేరొకటి లేదని స్పష్టమవుతున్నది. స్నేహితుల గుణగణాలను మెచ్చుకోవటంలో గొప్పతనం లేదు. శత్రువులలోని మంచిని ప్రశంసించడంలోనే ఉన్నది గొప్పతనం. ఈ కావ్యంలోని పాత్రల గొప్పతనం అదే. రామాయణ పాత్రల ప్రవర్తనలు ఆదర్శంగా గైకొని, ఆచరణలోపెట్టి మన జీవితాలను సార్థకం చేసుకుందాం * * *

## చందాదారులకు మనవి

1) తమ చందాలను కనీసం ఒక నెల ముందుగా రెన్యూవల్ చేయవలెను. 2) తమ చందాలను రెన్యూవల్ చేయదలచనివారు కనీసం ఒక నెల ముందుగా తెలియపరచవలెను. 3) చిరునామా మార్పు కావాలని కోరేవారు విధిగా తమ చందా నంబరును పేర్కొంటూ పాత చిరునామా మరియు క్రొత్త చిరునామా వివరంగా పేర్కొనవలెను



శ్రద్ధ ఎన్నడూ సలహా కొరకు నిరీక్షించదు.

# నోరు మంచిదైతే. . .

— సాయిప్రియ

"ఇమ్ముగ చదువని నోరున్
అమ్మాయని పిలిచి అన్నమడుగని నోరును
తమ్ముల పిలువని నోరును
కుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ!"

చక్కగా చదువని నోరును, అమ్మాయని నోరార తల్లిని పిలిచి అన్నము అడుగనినోరు, తోబుట్టిన వారిని ప్రియముగా పలుకరించని నోరు -- అది నోరే కాదు. కుమ్మరి వాడు మన్ను తీసుకొనుటకై తీసిన గొయ్యితో సమానమని సుమతి ఏనాడో చెప్పారు చక్కగా చదువుట అంటే... సత్యమైన, ప్రియమైన నీతిని బోధించే మంచి పుస్తకములను చదివి, ఇతరులను నొప్పించని విధముగా సంభాషణ చేయటం. తేనె పలుకులలాంటి మధురమైన మాటలు మాట్లాడటం కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లుండకూడదు. అది కూడా ఒక కళే (Art) భగవాన్ బాబా వారు Art is external, Heart is Internal అన్నారు గదా ! కనుక మనం మాట్లాడే మాట హృదయాంతరాళము నుండి రావాలి గాని, పెదవులపై నుండి కాదు. అనగా ఏది మాట్లాడినా హృదయ పూర్వకంగా మాట్లాడటం నేర్చుకోవాలి 'అడుగందే అమ్మయినా అన్నం పెట్టదన్నారు' మన అనుభవజ్ఞులు కనుక అమ్మా ! అని ప్రేమతో పిలవాలి. 'అమ్మ' అనే పదంలోనే ఉన్నది కమ్మదనం, ఉట్టిపడుతుంది ఆప్యాయత. అయితే ఈనాడు ఇంగ్లీషు మీడియంలలో చదివే పిల్లలు 'అమ్మ' అని పిలవటం ఏదో చిన్నతనంగా భావించి 'మమ్మీ' అనటం నాగరికత అయింది. ప్రేమ స్థానంలో 'ఫాషన్' నేడు నిలిచింది. 'ఈజిప్టు' దేశంలో శవపేటికలను 'మమ్మీ' అని పిలుస్తారని చాలామందికి తెలియదు అది తెలుస్తే ఎవరూ 'మమ్మీ' అని పిలువరేమో! తమ్ముళ్లతో, చెల్లెళ్లతో ప్రేమతో మాట్లాడని వారు ఈ రోజులలో ఎంతో మంది కనిపిస్తున్నారు అసలు ఈనాడు ఎన్నో కుటుంబాలలో ఒకరు లేక ఇద్దరే గదా ఉండేది. ఉన్నవాళ్లను కూడా చిన్న నాటి నుంచే రెసిడెన్షియల్ కాన్వెంట్స్‌కు పంపిస్తున్నారు గదా. ఈనాడు పిల్లలకు తల్లిదండ్రులతో చనువు వుండటం లేదు. తోబుట్టిన వారి యెడల ఆప్యాయతే కరువై పోయింది ఈనాడు చాలామంది పిల్లలకు తల్లి ప్రేమ తెలియదుకాని 'ఆయా' మాత్రం తెలుసు. తల్లి లక్షణాలు అబ్బవుకాని ఆయా లక్షణాల ప్రభావమే కాన్వెంట్స్ పిల్లలపై పడుతున్నదని చెబుతూ భగవాన్ బాబా వారు "ఈనాటి పిల్లలు తల్లిమరణిస్తే బాధపడరు అని ఆయా మరణిస్తే ఏడుస్తారు" అని చమత్కారించారు ఇది చమత్కారం కాదు దీనిలో ఎంతో వాస్తవమున్నది ఇది ఈనాటి స్థితి, దుస్థితి. సత్యముగా, ప్రియముగా సంభాషణ చేయటం, సద్గుణ సచ్ఛీల సంపత్తిని పెంచే చదువులను చదవటం, తల్లిదండ్రులను, పెద్దలను వినయ విధేయతలతో, భక్తి ప్రేమలతో గౌరవించడం నేర్చుకోవాలి. ఇది పెద్దయిన తరువాత అలవడదు 'శైశవేఽభ్యస్త విద్యానాం" విద్య వినయములు బాల్యావస్థ యందే అలవడాలి. అప్పుడు నేర్చుకున్నది, అలవర్చుకున్నది మాత్రమే జీవితాంతం గుర్తుంటుంది. మధ్యలో నేర్చుకున్నది, మధ్యలోనే పోతుంది. కనుక అటువంటి అమూల్యమైన బాల్య దశను సద్వినియోగపరచే విధంగా చూడవలసిన బాధ్యతముఖ్యంగా తల్లిదండ్రులదే అనే విషయం విస్మరించరానిఇ నగ్న సత్యం. ఇదే వాస్తవమును సుమతీ శతకం బోధిస్తున్నది. * * *



వాతువు శుభ ప్రదమైనప్పుడు ఆత్మ ఎన్నటికీ కలుషితం కాదు.

# నీ తోడుగా నీ వెంట ఉంటా!

మల్లాజోశ్యుల పాండురంగ విఠల్

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు భక్తులకు ఎల్ల వేళలా ఎప్పుడూ తోడుగా ఉంటానని అభయమిస్తూ ఉంటారు. అపారమైన ప్రేమతో వెంట ఉండి అనుక్షణం రక్షిస్తూ ఉంటారనేది సత్య వాక్కు. ఆ అభయ హస్తం రామబాణంవలె తిరుగులేనిది. ఎప్పుడు, ఏస్థితిలో, దృశ్యపరంగా లేక అదృశ్యరూపంగా తోడు ఉంటారనేది తెలుసుకోవడం కష్టం. భక్తుల అవసరాన్ని బట్టి, స్వామి కృప ఆధారపడి ఉంటుంది తన దాకా వస్తే కాని తెలుసుకోలేకపోవడం భక్తుల త్రుటి సహ ఆధ్యాత్మిక జీవులతో స్వానుభవాన్ని వ్యక్తపరచుకోవడమే సత్సంగానికి నిదర్శనం. అందుచేత నా స్వానుభవాన్ని వ్రాస్తున్నాను

స్వామి అనుగ్రహం వల్ల నేను ఐరోపాకి వెళ్లవలసి వచ్చింది. గత అక్టోబరులో. ముఖ్యంగా జర్మనీలో తొమ్మిది నెలలపాటు పని చేయాల్సిన అవసరం కలిగింది. తెలిసిన వెంటనే స్వామికి మనస్సులో కృతజ్ఞతలు తెల్పుకొని, ప్రశాంతి నిలయం వెళ్ళి స్వామి ఆశీస్సులు తీసుకొని వెళ్దామని సంకల్పించుకొన్నాను. పుట్టపర్తి వెళ్దామని ఏవిధంగా ప్రయత్నించినా, వెళ్ళేముందు, మిగతా ఆఫీసు పనులు పూర్తి చేయడంలో నిమగ్నమై ఉండటంవల్ల, జరగలేదు, హైద్రాబాదులో కల్యాణ మంటపం ప్రారంభిస్తారని తెలిసి, వెళ్దామనుకుంటే, గొడవలు వచ్చి అది కూడా జరగలేదు. హైద్రాబాదు నుండి తోటి సాయి భక్తులు శ్రీ రామారావు గారి ద్వారా ఆశీస్సులు అందాయి. వెళ్ళేముందు మద్రాసు వెళ్ళడం అయితే, సుందరంలో స్వామిని ప్రార్థించాను. "స్వామీ! మీ అనుగ్రహం, ఆశీస్సులు కావాలి" అని . వెళ్ళడానికి ముందు, ఒక ఆదివారం మాత్రమే మిగిలింది మద్రాసు నుండి తిరిగి వచ్చేసరికి, ఆ ఆదివారం సాధనా శిబిరం ఉంటుందని తెలిసింది మీరు జర్మనీ వెళ్తున్నారు కదా, అందుచేత స్వామి ఆశీస్సులకోసం, ఈ సాధనాశిబిరం ఏర్పాటుచేస్తున్నాము అని స్వామి భక్తులు శ్రీ సాయిరాం తెలియచేసారు. ఆనందంగా శిబిరం జరిగింది. ఆనందంగా ప్రయాణ సన్నాహాలు ప్రారంభించాము. నేను సమంగా యూరప్ చేరుకునే సమయానికి, ఇంట్లో భజన చేస్తాము అని సమితి వారు తెలియచేసారు. అక్టోబరు 1 రాత్రి ఢిల్లీ ఇందిరాగాంధీ విమానాశ్రయానికి చేరుకున్నాము. అయితే మనస్సులో ఇంకా కొంత అసంతృప్తిగా ఉంటే, స్వామి విభూతి తీసుకొన్నాను విమానంలోకి వెళ్ళి చేతి సామాను పై లాకర్‌లో పెట్టి "సాయిరాం" అని పైకి గట్టిగానే అనుకున్నా. కళ్ళముందు మెరుపు మెరిసినట్టయింది. రాత్రి రెండు గంటలు సమయం, నిద్రమత్తుకి అలాగ అయిందనుకొని మళ్ళీ సాయిరాం అనుకొని, ఆ మెరపు వచ్చిన వేపుకి చూసా! నా ఆశ్చర్యానికి అంతులేదు. ధగధగమని మెరిసిపోతున్న ఉంగరంలో స్వామి అభయ హస్తం దర్శనం కలిగింది. ఆ ఉంగరం వ్యక్తిది, నా ప్రక్క సీటే. నెమ్మదిగా నవ్వుతూ 'సాయిరాం!' అని ప్రక్కన కూర్చున్నారు. నా ఆశ్చర్యం గమనించి, నాలుగు రోజులక్రితం స్వామి ఇంటర్వ్యూ ఇచ్చి, ఉంగరాన్ని సృష్టించి ప్రసాదించేరు అని తెలియ చేసారు నా ఆనందానికి అంతులేదు. స్వామి ఈ విధంగా దర్శనమిచ్చి, నాతోపాటు, ప్రక్కసీటులోనే కూర్చుని, నాతోడుగా ఉండి, నన్ను అనుగ్రహించారు. సాయిమాట సత్యమైన మాట అని మరొకసారి తెలుసుకొన్నాను. మిగతా ఆలోచనలన్నీ దూరం అయ్యాయి. జై సాయిరాం !



*సరియైన ఆలోచన మంచిదే : సరి అయిన ఆచరణ ఇంకా మంచిది.*

# మోక్షగుండం విశ్వేశ్వరయ్య

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

"ప్రజల సంపాదనా శక్తిని, నైపుణ్యాన్ని, కార్యదక్షతను వివిధములైన చేతి పనుల ద్వారా పెంపొందించాలి. చేతనైన వారందరూ కష్టపడి పని చేసే వీలు కల్పించాలి. యాంత్రిక శక్తిని వినియోగించుకొని దేశ పారిశ్రామిక ప్రగతికి ముందంజ వేయాలి. భారతీయులలో ప్రబలంగా ఉన్న 'అంతా విధివ్రాత' అన్న ఆలసభావం తొలగించి నిరంతర కృషి ద్వారా సంపదను సాధించే దీక్షను ప్రజలలో రేకెత్తించుట ప్రభుత్వ కర్తవ్యం".

1912 లో మైసూరు సంస్థాన దివానుగా అధికారాన్ని చేపడుతూ శ్రీ విశ్వేశ్వరయ్య గారు చేసిన ప్రసంగంలోనివి పై వాక్యాలు.

విశ్వ విఖ్యాత ఇంజనీర్‌గా, పాలనా దక్షుడుగా, రాజనీతిజ్ఞుడుగా, నవ భారత నిర్మాతగా అఖండ కీర్తిని ఆర్జించిన మహనీయుడు డా।। మోక్షగుండం విశ్వేశ్వరయ్య. వంద సంవత్సరాల క్రియా పూర్ణమైన జీవితం సాగించిన విశ్వేశ్వరయ్య, కర్ణాటక రాష్ట్రంలోని చిక్కబళ్ళాపూర్‌కు సమీపంలోని ముద్దేనహళ్ళిలో 1861 సెప్టెంబర్ 15వ తేదీన జన్మించారు తల్లి దండ్రులు శ్రీమతి వెంకట లక్ష్మమ్మ, శ్రీనివాస శాస్త్రి గార్లు వారిది అతి సామాన్య కుటుంబం. వీరి పూర్వీకులు కర్నూలు జిల్లా (ప్రస్తుతం ప్రకాశం జిల్లా ) మోక్షగుండం గ్రామానికి చెందినవారు.

బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన విశ్వేశ్వరయ్యను తల్లి ఎంతో కష్టపడి చదివించింది. చిక్కబళ్ళాపురంలో చదువు పూర్తి చేసిన విశ్వేశ్వరయ్యను మేనమామ చేరదీసి బెంగుళూరు సెంట్రల్ కాలేజిలో చేర్చాడు. మేనమామ ఇంట్లో భోజనం. కాలేజీ ఫీజులకోసం ప్రైవేట్ ట్యూషన్లు చెప్పేవాడు విశ్వేశ్వరయ్య గణితంలో అసాధారణ ప్రతిభ కల విశ్వేశ్వరయ్య నుండి అధ్యాపకులే తమ సంశయాలను తీర్చుకొనే వారు. సెంట్రల్ కాలేజ్ ప్రిన్సిపాల్ ఛార్లెస్ వాటర్స్ విశ్వేశ్వరయ్యను బాగా ప్రోత్సహించేవాడు. శిష్యుని కుశాగ్రబుద్ధికి ముగ్ధుడైన ప్రిన్సిపాల్, తాను ఉపయోగిస్తూ వచ్చిన బంగారు బొత్తాములను విశ్వేశ్వరయ్యకు కానుకగా పంపారు.

ఇలా ఉపాధ్యాయుల, పెద్దల ఆదరణవల్లనే విశ్వేశ్వరయ్య చదువులో దిట్ట అనిపించు కొన్నాడు. 1880 లో బి.ఏ. పాసైన తర్వాత, అప్పటి మైసూరు దివాన్ రంగా చార్లు గారు మైసూరు ప్రభుత్వం నుండి ఉపకార వేతనం మంజూరు చేయించి పూనాలో ఇంజనీరింగ్ చదవటానికి పంపారు. 1883లో విశ్వేశ్వరయ్య బొంబాయి రాష్ట్రంలో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు వెంటనే అసిస్టెంట్ ఇంజనీర్‌గా నియమింపబడినాడు. 1908 సూపరింటెండెంట్ ఇంజనీర్‌గా పదవీ విరమణ చేశారు. పూనాలో ఉన్నప్పుడు ప్రముఖనాయకులైన లోకమాన్య తిలక్, గోఖలే వంటి పెద్దలతో కలసి పూనాలో దక్కన్ క్లబ్ స్థాపించుటలో ప్రధాన పాత్ర వహించారు. సహోద్యోగులుగా వుండిన విదేశీ అధికారులు విశ్వేశ్వరయ్య ప్రతిభను ప్రశంసించేవారు.

బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం సుక్కూర్ బరాజ్, ఏడెన్ నగర నీటి సరఫరా మున్నగు మహత్తర కార్యక్రమాలకు

విశ్వేశ్వరయ్యగారిని ఎన్నుకొన్నది. సుక్కూర్ బరాజ్ నిర్మాణ కాలంలోనే విశ్వేశ్వరయ్య ఆటోమేటిక్, స్లూస్‌గేట్లను రూపొందించారు కొత్త పరిశోధనను పేటెంట్ చేసుకోమని మిత్రులు సూచించారు కాని, తమ కార్య నిర్వహణలో భాగంగా సాగిన పని అంటూ పేటెంట్ తీసుకోలేదు. అలా చేసి వుండిన ఆయనకు లక్షలు లభించేవి.

పలుచోట్ల పెద్ద పదవులను చేపట్టమని ఆహ్వానాలు వచ్చాయి అన్నిటినీ తిరస్కరించి ఇటలీ, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ మున్నగు దేశాలలో పర్యటించి, ఆయా దేశాలలోని బృహన్నిర్మాణములను పరిశీలించి, ప్రముఖ ఇంజనీర్లతో చర్చించి 1909 లో స్వదేశం తిరిగి వచ్చారు.ఇటలీ పర్యటనలో ఉన్నపుడు నైజాం నవాబ్‌గారి పిలుపు అందింది. హైదరాబాద్ నగరం వరద భీభత్సాలకు గురి కాకుండా పథకాన్ని సిద్ధపరచారు. హైదరాబాద్ నగరాభివృద్ధి పధకం విశ్వేశ్వరయ్య గారిదే.

స్వరాష్ట్రమైన మైసూరు సంస్థానాన్ని ఆదర్శ సంస్థానంగా తీర్చి దిద్దాలన్న ఆకాంక్షతో ఛీఫ్ ఇంజనీర్‌గా వెళ్ళారు. 1912 లో మైసూరు దివానుగ నియమితులయ్యారు. విశ్వేశ్వరయ్యగారి ప్రజ్ఞాప్రాభవాల ఫలితమే కృష్ణరాజసాగర్ జలాశయం లక్షలాది ఎకరాల మెట్టభూములు సస్యశ్యామల మయినాయి. బృందావన్ ఉద్యానవనం విశ్వేశ్వరయ్యగారి ప్రకృతి ప్రేమకు నిదర్శనం. భారత సంస్థానాల్లో మొట్ట మొదటి ఉక్కు ఫ్యాక్టరి "భద్రావతి ఐరన్ అండ్ స్టీల్ ఫ్యాక్టరి". దీనిని ఇప్పుడు 'విశ్వేశ్వరయ్య ఐరన్ అండ్ స్టీల్ వర్క్స్'స్ అంటారు.

మహారాజాగారితో అభిప్రాయభేదాలవల్ల దివాన్ పదవికి రాజీనామా చేసి బొంబాయి వెళ్ళిపోయారు. ప్రారంభింప బడిన భద్రావతి స్టీల్ కర్మాగారం నష్టాల ఊబిలో కూరుకొంది. 'ఈ పథకంమీదే. దీనిని పూర్తిచేయటం మీకే సాధ్యం' అంటూ మహారాజా అభ్యర్థించగా, సర్వాధికారాలు చేపట్టి రెండేళ్ళలో లాభాలు చూపించారు విశ్వేశ్వరయ్య

ఈ పర్యవేక్షణకు ప్రతిఫలంగా మహారాజా పంపిన లక్షాయాభైవేల రూపాయలను తిప్పి పంపుతూ, ఆ పైకంతో బెంగుళూరులో పారిశ్రామిక శిక్షణా సంస్థను ప్రారంభింప కోరారు. ఆ సంస్థకు తమ పేరు పెట్టడం భావ్యం కాదని 'జయచామరాజేంద్ర ఆక్యుపేషనల్ ఇన్‌స్టిట్యూట్' అని నామకరణం చేయమని కోరారు.

వారికి పెక్కు సంస్థలతో ప్రత్యక్ష సంబంధం వుండేది. 1921 లో అఖిల భారత ఉత్పత్తిదారుల సమాఖ్య నెలకొల్పి జీవితాంతం ఆ సంస్థ అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు 1923 లో అఖిల పక్ష ప్రతినిధుల సభకు అధ్యక్షులుగా 1923 లోనే లక్నోలో జరిగిన ఇండియన్ సైన్స్ కాంగ్రెస్ అధ్యక్షులుగా, 1927 నుండి 1955 వరకు టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ డైరెక్టర్‌గా ఇలా ఎన్నో సంస్థలకు ఊపిరి పోశారు

కర్తవ్య నిర్వహణలో, నిజాయితీలో అట్టివారు అరుదు. దివాన్ పదవి స్వీకరించే ముందు బంధుమిత్రులను విందుకు ఆహ్వానించారు. 'నేను దివాన్ పదవిలో వుండగా ఎటువంటి ఉద్యోగాలు కోరమని, సిఫార్సులు చేయమని వాగ్దానం చేయమని కోరారు. తమ బంధువులను ప్రభుత్వోద్యోగాల నుండి తప్పించి ఇతర వృత్తులను చేపట్టుటకు కావలసిన పైకం ఇచ్చి ప్రోత్సహించారు. మైసూరులో విశ్వవిద్యాలయం, మైసూరు బ్యాంక్, సోప్ ఫ్యాక్టరి, మోటార్ కార్ల ఫ్యాక్టరి వారి చలవే. విశ్వేశ్వరయ్యగారి సలహా మేరకే బెంగుళూరులో విమాన కార్ఖానా నెలకొల్పబడింది. గాంధీజీ, విశ్వేశ్వరయ్య గార్ల దృక్పథాలు భిన్నమైనవి. గ్రామీణ పరిశ్రమల పట్ల మక్కువ కలవారు గాంధీజీ.

(తరువాయి 102వ పేజీలో)



*మనిషిలో మానవత్వం లోపిస్తే జాతిలో సమానత్వం లోపిస్తుంది.*

# సర్దార్ జమలాపురం కేశవరావు

హరి అప్పారావు.

ఆంధ్రమాత ఎందరో మహనీయులకు జన్మ ప్రసాదించింది. పౌరుషానికి, పరాక్రమానికి, ధైర్య సాహసాలకు, నీతి నిజాయితీలకు మారు పేరుగా నిలిచిన మహాపురుషులకు కన్నతల్లి. ఎందరో శాస్త్రవేత్తలు, సాహితీవేత్తలు, విద్యావేత్తలు, రాజకీయనాయకులు, కళాకారులు ఈ గడ్డపై జన్మించారు. సామాన్యులుగా జన్మించి అసామాన్యులై- మాన్యులైన మహనీయు లెందరో తమ మాతృభూమికి కీర్తిప్రతిష్టలు సంపాదించారు. "Men of good conduct are conscience to the society to which they belong" అని ఎమర్సన్ మహనీయుడన్నట్లు, భగవద్గీతలో "యద్యదాచరతి శ్రేష్ఠ తత్తదేవేతరోజనాః" అని చెప్పబడినది. మహాపురుషులు ఈ సమాజాన్ని ఎప్పటికప్పుడు తమ త్యాగనిరతితో సంరక్షించుతూ ఉంటారు. అటువంటి మహాత్ముల కోవకు చెందినవాడే తెలంగాణా వీరకేసరి సర్దార్ జమలాపురం కేశవరావుగారు. ఆయన జీవితాన్ని పరిశీలించిన ఎవ్వరైనా వారి నిస్వార్థత, త్యాగశీలత, మధుర స్వభావికతలను గ్రహించగలుగుతారు. ధృఢమైన దేహ సౌష్టవంతో, నిత్య నూతన ధవళ ఖాదీ వస్త్రములతో, గొంగళిపై కండవాతో చిరునవ్వులు చిందించు ఆయన విగ్రహము చూపరులకు మహానందాన్ని కలిగిస్తుంది. అప్రయత్నంగా రెండుచేతులతో నమస్కరించాలనిపిస్తుంది. ఇట్టివారు దేశంలో చాలా కొద్ది మంది మనకు దర్శన మిస్తారు.

కేశవరావుగారు ఆనాటి వరంగల్ జిల్లా మధిర తాలూకా ఎర్రుపాలెం గ్రామములో 1908వ సంవత్సరములో జన్మించిరి. వారి తండ్రిగారు వెంకటరామారావు, తల్లి వెంకటనర్సమ్మగారు. ఈ గ్రామము జాతీయోద్యమ మహానాయకులకు జన్మనిచ్చిన పున్నెంపు గడ్డ. కేశవరావుగారు ప్రాథమిక విద్య నుండి మంచి విద్యార్థిగా వాసి కెక్కిరి మంచి జ్ఞాపక శక్తి, చురుకుదనం, సమయస్ఫూర్తి వారి ప్రత్యేకత. వారి తొమ్మిదవ సంవత్సరములోనే తల్లిగారు పరమపదించిరి. మెట్రికు పరీక్ష పూర్తి అయిన వెంటనే అన్నపూర్ణమ్మగారు సహధర్మచారిణిగా వారి జీవితములో ప్రవేశించిరి. కేశవరావుగారు ఉన్నత విద్యకై నిజాం కళాశాలలో ప్రవేశించి మొదటి సంవత్సరములోనే వారిలో రాజకీయాలు ప్రవేశించినవి. ఆ రోజులలో జాతీయోద్యమము, తెలంగాణాలో ఆంధ్ర మహాసభ కార్యకలాపములు తీవ్రముగా నుండెను.

పూజ్య బాపూజీ పిలుపుతో ఉత్తేజితుడై 1924 లో మహాత్ముడు రాజమహేంద్రవరం వచ్చినపుడు కేశవరావుగారు వారిని దర్శించి వారి ఆశీస్సులు పొందిరి. గాంధీ మహాత్ముడు తిరిగి ఖమ్మం వచ్చిన సందర్భములో కేశవరావుగారి నాయకత్వంలో ఘనమైన స్వాగత సన్నాహం ఏర్పాటుచేయబడెను. నాటి మహాసభలో స్వచ్ఛంద భావాలు, భక్తి ఉద్వేగాలు, నూతనోత్సాహం ఉన్న కేశవరావుగార్ని బాపూజీ భుజం తట్టి ప్రశంసించిరి. ఈ సంఘటన కేశవరావుగార్కి స్వాతంత్ర్య పోరాటంలో ముందుకు సాగటానికి కొండంత బలం చేకూర్చినది.

ఒకవైపు వివాహం, మరో వైపు రాజకీయాలు వారి ఉన్నతవిద్యకు ఆటంకము కలుగజేసాయి. తండ్రిగారి పట్టుదల వల్ల, ఇష్టం లేకపోయినా, రోజురోజుకు పైబడిన బాధ్యత

లవల్ల, కాలేజీ విద్యకు స్వస్తి చెప్పి ఉద్యోగంలో ప్రవేశించిరి. అవినీతికి ఆలవాలములైన ప్రభుత్వ ఉద్యోగములో ఇమడ లేక, కొనసాగించలేక తుదకు శాశ్వతంగా వదలిపెట్టి తెలంగాణా విముక్తి పోరాటంలో ప్రవేశించిరి.

తెలంగాణా విముక్తి పోరాటంలో ప్రతి పల్లెను దర్శించి నైజాం ప్రభుత్వం వారి తాబేదార్లయిన జమీందార్లు, జాగీరుదార్లు కొనసాగించే అవినీతి, అక్రమాలకు వ్యతిరేకముగా బహుళ ప్రచారం గావించిరి. బానిసత్వం, అజ్ఞానం, నిరాశతో గూడు కట్టుకొని యున్న తెలంగాణా ప్రజా జీవితంలో చైతన్యాన్ని కలిగించిరి. వారు తెలంగాణా ప్రజల కొక ఆశాజ్యోతిగా, మణిపూసగా కొద్దిరోజులలోనే రాణింపు పొందిరి. వారి ఆదర్శాలు, విలువలు తెలంగాణా ప్రజలకు మహత్తర ఉత్తేజాన్ని కలుగజేసాయి.

సర్దార్ కేశవరావుగారు తమ స్వాతంత్ర్య ఉద్యమ నిర్వహణలో అనేకసార్లు జైలు జీవితమును అనుభవించిరి. పరిపూర్ణమైననాయక లక్షణాలున్న ప్రజానాయకుడిగా తెలంగాణాకు ఆశాజ్యోతిగా వెలుగొందుతున్న ఈ మహావ్యక్తిని నిర్బంధించుటకు ప్రభుత్వము సహితము గజగజ లాడిపోయెను. సర్దార్జీ జైలు జీవితంలో ఎదురైన అసౌకర్యాలను, కష్టాలను సహితము సంతోషంగా భరించి జైలు జీవితానికే శోభను చేకూర్చిన మహామనిషి.

కేశవరావుగారు తన రాజకీయ జీవితంలో ఎందరో జాతీయ నాయకులను సందర్శించిన వారిలో మహాత్మా గాంధి, నెహ్రూ, వల్లభబాయి పటేల్, జయప్రకాశ్ నారాయణ, సుభాస్ చంద్రబోస్ మరియు ఆంధ్ర నాయకులైన ఆంధ్రకేసరి ప్రకాశంగారు, పట్టాభి సీతారామయ్యగారు, కళా వెంకట్రావు, కాళేశ్వరరావుగారలు ముఖ్యులు. తెలంగాణా సమస్యల గురించి సర్దార్జీ ఈ నాయకులతో తరచు సంప్రదించి సలహాలు పొందేవారు.

కేశవరావుగారు విశాల హృదయులు వారి దృష్టిలో అన్ని మతములు పూజనీయములే. హిందూ మహమ్మదీయుల సఖ్యతను సంపూర్ణంగా కోరే మతాతీతుడు ఆయన. మత మౌఢ్యం కొనసాగితే దేశం విచ్ఛిన్నం కాగలదని భావించే వారు. మానవుడు మానవునిగా మనుగడ సాగించడమే మహా ధర్మమని, స్వధర్మం కంటె, స్వదేశం గొప్పదని వారి భావన. అభిప్రాయాలు వేరైనా, మత విశ్వాసాలు ఏవైనా నివసించుచున్న దేశం మాత్రం ఒక్కటేనని ప్రబోధించేవారు. ఈ దేశంలో నివశించే ప్రజలందరికి వారు ఏ మతము వారైనా అందరికి స్పష్టమైన సరి సమాన హక్కులు గలవని సర్దార్జీ వాదించేవారు. ఆ మహనీయుడు హిందూ మహమ్మదీయుల సఖ్యత కోసం ఆదర్శంగా నిలిచి తెలంగాణాలో మంచి సంప్రదాయాలను గట్టి పునాదులు వేసిన మూలపురుషుడు.

దాదాపు మూడు శతాబ్దాలు విశ్రాంతి ఎరుగని ఆయన నిరంతర కఠోర పరిశ్రమ ఆయన దృఢ కాయాన్ని క్షీణింపచేయగా 1953 మార్చి 29 వ తేదీన ఈ లోకాన్ని వదలి వెళ్ళినారు. ఆనాటి తెలంగాణా వీరకేసరి, బీదప్రజల పెన్నిధి, తెలంగాణా విముక్తి పోరాట సారథి, మహానాయకుడు, తాను అత్యంతంగా ప్రేమించే తెలంగాణా మాతృభూమిని, ప్రజలను, మిత్రులను, కుటుంబ సభ్యులను విడిచి శాశ్వతంగా శెలవు తీసుకున్నారు. తెలుగు తల్లి తన ముద్దుబిడ్డ అయిన కేశవరావు భౌతిక కాయాన్ని తనలో లీనం కావించుకున్నది. ఇట్టి మహోన్నత ఆదర్శ వ్యక్తికి జన్మ నిచ్చిన తెలంగాణా, ముఖ్యంగా నేటి ఖమ్మం జిల్లా ధన్యమైనది. ఇంతటి మహోన్నత వ్యక్తి నేటి వరకు తెలంగాణాలో జన్మించలేదని చెప్పుట అతిశయోక్తి కాదు.

కేశవరావుగారు స్వాతంత్ర్యోద్యమములోకాని, స్వాతంత్ర్యానంతరముగాని ఎటువంటి పెద్ద పదవి గాని మరో రూపంగా ప్రతిఫలం గాని ఆశించని నిరాడంబరుడు, నిస్వార్థి. ఆయన తన జీవితమంతా తెలంగాణా ఉద్యమానికి



*బుద్ధి, వాక్కు మానవునికి లభించిన రెండు అపూర్వవరాలు.*

అంకితము చేస్తూ చిన్న అద్దె ఇంటిలో నివసించి నిత్యము చాపపై పరుండెడివారు. "నేను భూదేవిని ప్రేమిస్తాను. ఆమెకు నాకు మధ్య దూరాన్ని సహించలేను" అనేవారు. సర్దార్‌జీ తన జీవితాంతం అవినీతి, అన్యాయం, అధర్మాల మీద తిరుగులేని పోరాటం సాగించిన మహాయోధులు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ధ్వజ మెత్తిన మేటి నాయకుడు. క్షణికమైన సుఖభోగాలకు ఆయన అతీతుడు. సర్దార్‌జీ జీవితం గంగా ప్రవాహంవలే అవిచ్ఛిన్నంగా నిరంతరంగా ప్రజల హృదయాలలో నిలిచిపోయింది.

తెలంగాణా స్వాతంత్ర్య సముపార్జన మహాసంగ్రామములో విశిష్టపాత్ర వహించి, నిర్విరామ పోరాటం సల్పి, జీవితాన్ని నిస్వార్థంగా అంకితము చేసిన మహోన్నత వ్యక్తి అయిన కేశవరావుగారికి, రాష్ట్ర స్వాతంత్ర్యానంతరము రాష్ట్ర చరిత్రలో సముచిత స్థానాన్ని నేటి ప్రజానాయకులు లభింప చేయలేదు. కాని సర్దార్ మిత్రులు- సమకాలికులు, స్వాతంత్ర్య సమరయోధులు- మహా రచయిత అయిన శ్రీ హీరాలాల్ మోరియాగారు వారి కవితా మాధుర్యంతో, అతిలోక సౌందర్యంగా సర్దార్‌జీ జీవితాన్ని రచించి చరిత్ర పుటలలో అమరునిగా మలిచారు. శ్రీ మోరియా గారు చేసిన ఉర్దూ రచనలను తెలుగులో మనోహరంగా అనువదించిన శ్రీ కవి రాజమూర్తిగారు, కౌముది, రామానుజాచార్యులుగారు ధన్యులు. వారు రచించిన 'మహాపథం' లోని మచ్చుకు ఈ క్రింది నాలుగు పంక్తులు వారి రచనా ఔన్నత్యానికి గీటురాయిగా నిలిచాయి.

"నీవు వెలిగించిన దీపం
నింగికి కాంతిని చేరవేస్తున్నది
నీ గుండె నుండి నినదించిన నాదం
ఓంకారమువలె ధ్వనిస్తున్నది-ప్రతిధ్వనిస్తున్నది"

స్వార్థంతో, అసూయతో, దురాలోచనలతో, అవినీతి అక్రమాలతో, పదవీ వ్యామోహంతో, జాతీయ భావం, దేశ భక్తి, అంకిత భావం, పట్టుదల రాహిత్యమైన నేటి భారతీయులకు, దేశభక్తుడు, నిరాడంబరుడు, దయామయుడు, నిగర్వి, త్యాగధనుడయిన సర్దార్ కేశవరావుగారి జీవితం ఆదర్శప్రాయమైనది. వారి ప్రబోధం సర్వులకు ఆచరణీయమైనది.

(99వ పేజీతరువాయి )

నాకెంతో గౌరవం ఉంది' అన్నారు విశ్వేశ్వరయ్యగారికి వ్రాసిన లేఖలో గాంధీజీ.భారతదేశంలోని పెద్ద జలాశయాలు, వంతెనలు, కర్మాగారాలు, వారి సూచనల మేరకే నిర్మింపబడినాయి.'పారిశ్రామికీకరణయో, పతనమో' అన్నది వారి ధ్యేయం.భారతదేశ దాస్య విముక్తికి బాపూజీ ఎంత కృషి చేశారో, అంతకు దీటుగా విశ్వేశ్వరయ్య భారతదేశ ఆర్థిక వికాసానికి కృషి చేశారు. విశ్వేశ్వరయ్యగారి నిష్కళంక జీవితం అందరికీ ఆదర్శప్రాయం. 1961 లో విశ్వేశ్వరయ్యగారి శత జయంతి ఉత్సవాలు బెంగుళూరులో గొప్పగా జరిగాయి. ఆ ఉత్సవంలో పాల్గొన్న ప్రధాని నెహ్రూ "అయ్యా మేము మాటలతో కాలయాపన చేశాం. మీరు నిరంతర క్రియాశూరులై, నవభారత నిర్మాణానికి కృషి చేసిన మహనీయు"లంటూ ప్రస్తుతించారు. దేశ, విదేశీ యూనివర్సిటీలు వారిని గౌరవ డాక్టరేట్లతో సత్కరించాయి. భారత ప్రభుత్వం 1955 లో 'భారతరత్న' ప్రశస్తి నిచ్చి సత్కరించింది. విశ్వేశ్వరయ్యగారు 'ప్లాన్‌డ్ ఎకానమి ఫర్ ఇండియా', 'రీకన్‌స్ట్రక్టింగ్ ఇండియా', 'మెమోయిర్స్ ఆఫ్ మై వర్కింగ్ లైఫ్' మున్నగు రచనలు చేశారు.దేశభక్తి, మహాప్రజ్ఞ, పాలనాదక్షత, నిజాయితి, సాహసం, సామర్థ్యం అన్నీ మూర్తీభవించిన మహనీయుడు శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య.'గంధపు చెక్కవలె సేవలో అరిగిపో, కాని ఇనుములా తుప్పు పట్టవద్దు' అన్నది వారి దివ్య సందేశం.



(12-4-93 వర్ధంతి సందర్భంగా ఈ వ్యాసం)



*సాధన క్షేత్రంలో కర్షకుడిలా నీవు శ్రమపడితేనేగాని నీకు సిద్ధి కలుగదు.*

# చాణక్యుని మాణిక్యాలు

డాక్టర్ కె. ఎస్. రత్నాకర్

చాణక్య నీతి అంటే రాజనీతి లేదా కుటిల నీతి అనేది సామాన్య వ్యావహారిక భావన. నీతి అంటే నైష్ఠిక ధర్మ కర్మాచారణ. సామాజిక, వైయక్తిక, క్షేమ, పురోభివృద్ధిని వుద్దేశించి నిర్దేశించేది నీతి. అందువలన ధార్మిక దృష్టి లేని నీతి వుండదు. ధర్మవర్జితమైనది నీతి కానేరదు చాణక్యుడు వచించిన అసంఖ్యాకమయిన నీతి వాక్యాలలో నిత్యజీవితంలో అనుభవైకవేద్యమయిన కొన్నిటిని ఏరి నిత్య జీవితానికి ఎలా ఉపయోగ పడతాయో తెలియపరచడానికి చేస్తున్న ప్రయత్నం ఇది.

## సుఖస్యమూలం ధర్మః

మానవ జీవిత లక్ష్యం సుఖ సాధన అనుకుంటే ధర్మాన్ని ఆశ్రయించాలి. ధర్మమే సుఖానికి మూలం అని చాణక్యుడు అంటాడు. సుఖానుభవానికి ఏం కావాలి అనుకుంటే, పంచేంద్రియాలని, అంతఃకరణములను ధర్మ పథంలో పయనించేటట్లు చేయాలి. అసలు ధర్మమంటే ఏమిటి?యత్ అభ్యుదయ నిఃశ్రేయససిద్ధిః సధర్మఃఋ అంటుంది దర్శన వాక్యం. అంటే సామాజిక పురోభివృద్ధి, మోక్షసిద్ధి కలుగజేసేది ధర్మం అని. మోక్షమంటే విడుదల దుఃఖం నుండి విడుదల అదే సుఖం. సుఖము, ధర్మము, విడువలేని జంట. అందువలన ధర్మనిరతి మానవుని సుఖ సంతోషములకు మూలము.

## అహింసాలక్షణో ధర్మః

ధర్మాచరణ అహింసాగుణ సమన్వితము. ఎక్కడ అహింస వుంటుందో అక్కడ ధర్మం వుంటుంది. చాణక్యుడు అహింసాలక్షణమే ధర్మం అని చాటి చెప్పాడు సర్వదా సర్వభూతానాం అనభి ద్రోహం అహింసః అన్ని ప్రాణుల ఎడ అన్ని వేళల శతృభావం లేకుండా వుండటం అహింస అని నిర్వచించారు ఆర్యులు. అహింస కేవలం శారీరక హాని చేయకుండా వుండటం కాదు మనసా, వాచా, కర్మణా ప్రాణులను హింసించడం అనేది భావనామాత్రంగా కూడా వుండని స్థితి అహింస. మనసు వాక్కుని నడిపిస్తే, ఆ వాక్కే మరొకరి మనసుని హింసిస్తుంది. అందుచేత మధుర వాక్యాలు, తనలోను మరొకరి హృదయం లోనూ చేతల్లోనూ మాధుర్యాన్ని పండిస్తాయి. త్రికరణ శుద్ధిగా వుండే సత్ప్రవర్తనుడి లక్షణం అహింస.

## ధర్మేణ ధార్యతే లోకః

లోకానికాధారం ధర్మం. ధర్మాన్ని ఆశ్రయించేది లోకం. లోకమనే బండిచక్రాలకి ధర్మం ఇరుసు లాంటిది. చాణక్యుడు ధర్మాన్ని ధరించని లోకానికి నిలుకడలేదంటాడు. ఏ ప్రపంచంలో జనులు ధర్మప్రవర్తనులై వుంటారో వారిలో క్రమశిక్షణ, కర్తవ్య పాలన వుంటుంది. అక్కడే నీతి నిజాయితి వుంటాయి అట్లాంటి లోకంలో లోకులు కాకులు కాకుండా ఆముష్మిక కాముకులు అవుతారు.

## దయా ధర్మాస్య జన్మ భూమిః

ధర్మం యొక్క నైసర్గిక స్వరూపం దయ. దయకి ధర్మం పుట్టినిల్లు అంటాడు ఆర్యచాణక్యుడు. 'దయ ధర్మ బినా సత్‌కర్మ నహీ' అని భగవాన్ శ్రీసత్య సాయి బాబావారు అమృత కంఠంతో ఆల పిస్తారు. దయ అనేది మానసిక

సంస్కృతి లక్షణం. దయయనే భగీరథికి, గంగోత్రి ధర్మం. స్వపర భేధములు కాని, జాతి మత విచక్షణలకు కాని అతీతమైన ధర్మగుణం దయ.

## ధర్మ మూలే సత్యదానే

ధర్మావలంబన ప్రాపంచిక దృష్టిలో కష్టమయినది, అసాధ్యమయినది. కాని చాణక్యుడు సత్యదానశీలతలు ధార్మిక జీవన సౌధానికి పునాదులు అంటాడు. లౌకికంగా దానం అంటేనే ధర్మం. 'అమ్మా ధర్మం చెయ్యండి' అనే మాటలోనే వున్నది దాన ధర్మాలు ఒకటేనని. మరో గుణంకూడా ధర్మ వృక్షానికి వేరు చేయ్యలేని వేరు, అది సత్యం. నిత్యానిత్య బేధములను అనుక్షణం గ్రహిస్తూ తదను గుణంగా వ్యవహరించడమే సత్యవ్రతం. ఇది త్రికాలములలో త్రికరణశుద్ధిగా పాటించవలసినది. సూక్ష్మంగా చెప్పాలంటే సత్యదూరమయిన, దానశూన్యమయిన ధర్మమనే వస్తువుకు తేడాలేదు.

## ధర్మేణ జయతిలోకాని

మానవుడు ఎప్పుడూ జయాన్నే కోరుకుంటాడు ప్రతి కార్యంలోనూ. ఎందుకంటే సుఖ సంపదలని, కీర్తి ప్రతిష్టలని దృష్టిలోవుంచుకునే ఏ కార్యానన్నా తలపెడ్తాడు. కనుక లౌకిక ప్రపంచంలో వైయుక్తిక ప్రగతి ఆధ్యాత్మిక పథంలో వున్నతి మనుగల లక్ష్యాలని అనుకుంటే, ఈ కార్యసాధనలో జయానికి ఒకేఒక మార్గం ధర్మం.

అధర్మప్రవర్తనతో ప్రస్తుత కాలం అన్నీ ఆనందిస్తున్నవారి సంగతేమిటని ప్రశ్నిస్తే - గాలితో నిండిన బెలూను ఆకాశంలో ఎంత ఎత్తు ఎగిరినా, కంటికి కనుపించనంత దూరంలో విహరించే పక్షులకు మాత్రం సాటికాలేదు. ధర్మానువర్తనుడు ఆశలకు ఆకర్షణలకు లొంగకుం జీవితంలో పొందవలసిన అంతిమ విజయాన్ని అనే ఆనందం అతనిదే.

## మృత్యురపి ధర్మిష్ట రక్షతి

మానవుడు భయపడేది మృత్యువు. తిరుగుతున్న కాల చక్రంలో గడుస్తున్న వసంతాలు, మనుష్యణ్ణి మృత్యువుకు చేరవేస్తున్నాయని. ఇంతేకాక అష్టమదములు, అరిషడ్వర్గములు, వ్యాధులు బాధలు అందిస్తున్నాయి. 'నళినిదళగత జలమతి తరళం, తద్విజ్జీవిత మతిశయచపలం విధివ్యాధ్యభిమానగ్రస్తంలో కతచౌకహతంచ సమస్తం' అన్నారు శంకరులు. ధర్మానుష్ఠానపరుడు, సత్యాదానశీలుడై, అహింసా దయాగుణ సంపన్నుడై పరులను రక్షిస్తూ తాను రక్షింపబడతాడు అంటాడు జ్ఞాని చాణక్యుడు. 'ధర్మోరక్షతి రక్షితః' అన్నది ఆర్యోక్తి. అధర్మ వర్తనుడు బ్రతికి వుండియూ చచ్చిన వాడితో సమానం, ధర్మపరాయణుడు అమరుడు, అమృత పురుషుడు.

## ఉగాది

శ్లో॥ నూతన సంవత్సర కీర్తనాత్ ప్రారంభః
ప్రతి గృహే ధ్వజారోహణం।
నింబ పత్రాశనం సంవత్సర
పంచాంగ శ్రవణం నవరాత్రారంభః ॥

నూతన సంవత్సరము కీర్తనతో, అభ్యంగన స్నానముతో దినచర్య ప్రారంభమగును. ప్రతి గృహమునందు ధ్వజారోహణము చేయ వలయును. వేపాకులను నమలవలయును. వేపపూవుతో చేసిన పచ్చడి షడ్రుచులు కలదిగా తయారు చేసి తినవలయును. తదుపరి నూతన వస్త్రములను ధరించి నిత్యకర్మ పూర్తి చేసికొని పంచవిధ భక్ష్యములతో భోజనము చేసి పిమ్మట పంచాంగ శ్రవణము చేయదగును. ఆ రోజు నుండి వసంత నవరాత్రులు ప్రారంభమగును.



*ప్రవర్తన అనే అద్దంలో ప్రతివాడి నిజరూపం ప్రతి ఫలిస్తుంది.*

# శక్తియే జాతీయ జీవనానికి అమృతం

కీ.శే. శ్రీ గురూజీ గోళ్వల్కర్.

ప్రపంచాన్ని మనం సరీగా అర్థం చేసుకొంటే, మన యొక్క స్వతంత్రం వైభవపూర్వము నైన జాతీయజీవనానికి అజేయమైన జాతీయ శక్తి ఒక్కటే నిజమైన ఆధారము కాగలదనే సామాన్య నిర్ణయానికి వచ్చితీరుతాం. దురాక్రమణ దారుల గుండెల్లో బెదురు పుట్టించి, ఇతర దేశాలు మన మిత్రత్వాన్ని ఆశించేట్లు చేయగల శక్తి మనకుండాలని మనం గుర్తిస్తాం. శక్తియే జాతీయ జీవనానికి అమృతం వంటిది.

నిజమైన శాంతి, గౌరవ ప్రతిష్ఠలను పొందటానికి అజేయమైన జాతీయ శక్తిని నిర్మించటం ఒక్కటే ఏకైక మార్గం. అప్పుడు మాత్రమే మనం ప్రపంచానికి ప్రబోధించే గొప్ప సిద్ధాంతాలకు విలువ, ప్రతిష్ఠ ఏర్పడుతాయి. బలహీనుని యొక్క తత్త్వబోధన ఎంతటి ఉదాత్తమైన దైనా ప్రపంచం వినదు. ప్రముఖ వార్తా పత్రికలలో వెలువడిన పాత ఉదంతం ఒకటుంది. మన ప్రముఖ జాతీయ కవియైన రవీంద్రనాథ్ ఠాగూర్ ఒకసారి జపాన్ వెళ్లారు. హిందూ తత్త్వశాస్త్రం యొక్క శ్రేష్ఠత్వం గురించి అక్కడి విశ్వవిద్యాలయ విద్యార్థుల సభలో ప్రసంగించ వలసి ఉంది. కాని కొద్ది మంది ఆచార్యులను మినహాయించి, ఆ సభాభవనమంతా శూన్యంగా ఉంది. శ్రోతలు అంత తక్కువ సంఖ్యలో ఉండటం గౌరవపాత్రుడైన అతిథికి అవమానకరమౌతోందని భావించి, ఆ సభలోని ఒక ఆచార్యుడు దూరాన నిలిచి ఉన్న విద్యార్థులను ఆ ఉపన్యాసం వినేందుకు రండని ఆహ్వానించాడు. అప్పుడు "ఒక బానిస జాతియొక్క తత్త్వశాస్త్రాన్ని గురించి మేము విన దలచలేదు" అని ఆ విద్యార్థులు నిష్కర్షగా చెప్పి ఆ సభకు రావటానికి నిరాకరించారుట.

కనుక ప్రపంచం శక్తి వంతులనే ఆరాధిస్తుంది. ఏ పరిస్థితిలో నైనప్పటికీ బలహీనుడే బాధలకు గురి అవుతాడు. స్వతఃస్సిద్ధంగా బలహీనమైన జాతిని, ఏ ఒప్పందాలు, మైత్రీ సంబంధాలు కాపాడలేవు బలహీనత ఆత్మనాశనకారియే గాక, ఇతరులలోని హింసా ప్రవృత్తిని కూడా రెచ్చకొడు తుంది. కాబట్టి 'బలహీనత' అనేది ప్రపంచంలో ఒక దారు ణమైన మహాపాపం. భౌతికమైన మనుగడ, మహోన్నతమైన ధర్మంలోని ఒక అంశమని, అట్టి భౌతికమైన అస్తిత్వానికి 'శక్తి' ఒక్కటే ఆధారమని మన పూర్వీకులు చెప్పారు. ఒకప్పుడు తీవ్రమైన కరువు ఏర్పడి, విశ్వామిత్ర మహర్షికి, అనేక దినాల తరబడి తినటానికి ఆహారమేమీ దొరకలేదు. ఒకనాడు ఒక చండాలుని ఇంటిలో చచ్చినకుక్క యొక్క కుళ్లిపోతున్నకాలు ఒకటి అతని కంటబడింది. వెంటనే విశ్వామిత్రుడు దాన్ని చేతబట్టి ముందుగా దాన్ని భగవంతునికి నైవేద్యమిడి తిన బోతుంటే ఆ చండాలుడు "ఓ మహర్షీ! మీరు! కుక్క కాలు తినడమేమిటి?" అని అడుగగా "తపస్సు చేయటానికి గాని, ప్రపంచంలో ఏ పుణ్యకార్యాలు చేయటానికి గాని ముందుగా నేను జీవించాలి, బలంగా ఉండాలి" అని విశ్వామిత్రుడు సమాధానం చెప్పాడు.

ఈనాడు 'శక్తి' అనగానే అదేదో చేయరాని పాప మన్నట్లు, తక్కువ చూపుచూచే ఆలోచన బయలుదేరింది అహింస' అనే పదమునకు చేయబడిన వక్రభాష్యం, జాతీయ మేధలో విచక్షణాశక్తిని నాశనం చేసింది. బలం కలిగి వుండటం 'హింస'గా భావిస్తూ మనలోని బలహీనతను ఘనంగా చెప్పుకోనారంభించారు. అహింస అనేది సకా

రాత్మక భావమని, హింస అనేది భావాత్మక పదానికి ముందు 'అ' చేర్చడం వల్ల అహింస అనే పదం ఏర్పడు తుందని ఒక సాధువు అన్నాడు. 'హింస' చేయటానికి తగినంత బల ముండి; నిగ్రహం, విచక్షణ, కరుణ వలన 'హింస' చేయనివాడే నిజమైన 'అహింస'ను పాటించేవాడు.

ఉదాహరణకు ఒక బలవంతుణ్ణి ఎవరైనా ఢీ కొన్నారనుకుందాం. "ఏం ఫరవాలేదు మిత్రమా! నిన్ను నేను క్షమిస్తున్నాను. అని ఆ బలవంతుడు నిదానంగా చెబితే, అతడు 'అహింస'ను పాటిస్తున్నాడని చెప్పగలం. అతనికి తోటి వ్యక్తి బుర్రను బ్రద్దలు కొట్టగలశక్తి ఉండి కూడా నిగ్రహాన్ని చూపించా డతడు. ఒకడు త్రోవన వెళ్లుతూ ఎదురుగా వచ్చిన బలహీనుడైన వ్యక్తి చెవులను మెలిబెట్టాడనుకుందాం. అప్పుడు ఆ బలహీనుడు ఎంతో ఉదారంగా నటిస్తూ "అయ్యా! నిన్ను నేను క్షమించాను" అంటే ఆ మాటకు విలువ ఉంటుందా? అతడు అహింసను పాటిస్తున్నాడని ఎవరైనా చెప్పగలరా? ఏమీ చేయలేక మాట్లాడాడని అందరూ అనుకోవటం సహజం. కనుక బలహీనుడు ప్రవచించే శాంతి అహింసలకు విలువ ఉండదు. బలవంతుని మాటకే విలువ యిస్తారనే సత్యాన్ని మనం గుర్తించాలి.ఈనాడు ప్రపంచంలో కోరినా, కోరకపోయినా సంఘర్షణలు వచ్చి తీరుతూనే వుంటాయి. మనం మంచి వారమైనంత మాత్రమున, ఇతరులు తమ కుటిల బుద్ధిని విడిచిపెడతారని ఏముంది? అటువంటి అంధ విశ్వాసంతో ఉండటం కన్నా ఆత్మవంచన వేరే ఉంటుందా? బలివేదికకు తీసుకొనిపోతున్న 'యజ్ఞపశువు' (మేక) ఏమాత్రం ప్రతీకారానికి పూనుకోలేదు.

అలాంటి 'అహింసావాది' అయిన ప్రాణిని చంపరాదని కసాయివాడు ఆలోచించడు. క్రూరమృగమైన పులిని బలి యివ్వటానికి ఎవరూ సాహసించరు. కారణం ? పులిలో వుండే శక్తిని చూచి భయపడటం సహజం. మేకలో వుండే బలహీనతయే అది యజ్ఞపశువుగా అంగీకరించబడింది. ఇదే వాస్తవం చెప్పే సుభాషితం ఒకటి ఉన్నది.

## జీవతత్త్వం

మాతృమూర్తి లాలనలోంచి
ప్రకృతిమాత పాలనలోంచి
మానవాళి సౌహార్దం కోసం
మధుపమ్ముల మాధుర్యం కోసం
పరిమళించాలని పరితపిస్తోంది
పుష్పరాజము పవిత్రంగా!
బండరాళ్ళ నడుమ
కొండవాగు ఎడమ
కోట గోడ నెత్తిన
మట్టి రోడ్డు ప్రక్కన
తల ఎత్తాలని తపిస్తోంది
గడ్డిపోచ గర్వంగా!
మమతానురాగాల మణిదీపమై
మహదానందాల సుమ గీతమై
సకలావనికి సుధావర్షంగా
వార్ధక్యానికి నవయవ్వనార్నవంగా
పసిపాప మృదుల హాసం
విరబూస్తోంది కమనీయంగా!
ఆలోచనా లోచనాల లోతుల్లోంచి
ఆవేదనామయ మనోభావాల్లోంచి
సకలావని సౌఖ్యమ్ము కోసం
జనావళి జాగృతి కోసం
భావలోకమ్ము లోంచి సహృదయం
ప్రతిస్పందిస్తోంది సజీవ తత్త్వంగా!

- వేరెడ్డి జగదీశ్వరు



ఇతరుల ఐశ్వర్యానికి సహకరించడమే ఆదర్శవాది.

"అశ్వం నైవ గజం నైవ
వ్యాఘ్రం నైవ చనైవ చ
అజాపుత్రం బలిం దద్యాత్
దేవో దుర్బల ఘాతకః"

(గుర్రాన్ని, ఏనుగును బలి ఇవ్వం. ఇక పులి మాట ఎత్తనే కూడదు. మరి బలి వేసేది మేకపిల్లనే. దేవుడు కూడా బలహీనులనే బక్షిస్తాడు.)

ప్రతీకారం చేయరాదనే మనః ప్రవృత్తికి ప్రతిఫలమిది. అయితే అకారణంగా మనం హింసకు ఉపక్రమించరాదు. ఇతరులు మనలను హింసించే అవకాశం కల్పించరాదు. తన పట్ల హింస జరగటానికి అవకాశం కల్పించడం కూడా హింసయే అవుతుంది. ఆవిధంగా అది అధర్మమే. 'అహింస' అనే పదం ఉచ్చరించగానే బుద్ధుని పేరు మనసులో మెదలుతుంది. ఈ సందర్భములో బుద్ధుని ఉదంతం ఒకటి చెబుతాను. ఒకానొక రాజ్యంలోని సర్వసైన్యాధిపతి బుద్ధుని వద్దకు వచ్చి దీక్ష పొంది భిక్షువుగా మారాలనే ప్రేరణ కలిగిందని చెబుతాడు. ఇటువంటి ప్రేరణ కలగటానికి కారణమేమిటని బుద్ధుడు అడుగగా "శత్రువులు మా రాజ్యం మీదికి దండెత్తి వచ్చారు. నేను వారిని ఎదిరించినట్లయితే అది హింసకూ, రక్తపాతానికి దారి తీస్తుంది. అది మహా పాపం కనుక ఈ సైనిక బాధ్యతను వదులుకుందామని నిశ్చయించుకున్నాను. మీరు చెప్పే శాంతి, అహింస మార్గంలో పయనించదలచుకున్నాను" అని ఆ సర్వసైన్యాధిపతి చెబుతాడు. అప్పుడు బుద్ధుడు "నీవు ఈ మాదిరిగా ఇక్కడకు రావడంవల్ల శత్రువులు దురాక్రమణ చేయడం ఆపరు. మారణహోమం గావించి సర్వనాశనం చేసి తీరుతారు. నీవు నీ బాధ్యతను విస్మరించి, నీవు రక్షించవలసిన అమాయకుల్ని గాలికి విడిచిపెడితే, వారిమీద జరిగిన దౌర్జన్యం యొక్క పాపమంతా నీదే అవుతుంది. మంచి వారిని కాపాడవలసిన బాధ్యత నీ ధర్మం. ఈ విధి నిర్వహించడం వలన నీకే పాపం అంటదు. కనుక వెనక్కు వెళ్లినీ విధిని నిర్వహించు" అని అహింసకు అసలైన అర్థాన్ని బుద్ధుడీ ప్రకారంగా చెప్పాడు. * * *

## సాకారుడు సాయి

సాకారుడు శ్రీకరుడు సకలేశుడు సాయి
యీ లోకము ఏ కాలము ఏలు విభుడు సాయి
సాధనతో వీడకుమనె సద్ధర్మము సాయి
యీ ధరలో జనియించి ధన్యుడవనె సాయి
సామరస్య జీవనమె శాంతియనెను సాయి
యీవి మమత సమతలవీ సద్గుణమనె సాయి
సాధు జనుల సత్సంగతి శుభమనెను సాయి
ఇల దీనుల సేవ చేసి తనియు మనెను సాయి
'సాయిరాం' అనీ వినీ మురియు మనెను సాయి
యీ భజనమె సద్గతులకు మార్గమనెను సాయి

- సి. ఎస్. రంగస్వామి

శ్రీ కృష్ణుడు కూడా ధర్మ సంస్థాపనలో 'వినాశాయ చ దుష్కృతాం' (దుష్టులను నాశనం చేయుట) కూడా ఇమిడి ఉందని స్పష్టంగా ప్రకటించాడు. కనుక కఠోర వాస్తవాలతో కూడిన ఈ ప్రపంచంలో, ఆ మహాపురుషుల జీవితాలు మన కొసంగిన నిజమైన సందేశాన్ని సరీగా అర్థం చేసుకోవలసి ఉంది. నేటి ప్రపంచ తీరును చూస్తే శక్తి యొక్క భాష ఒక్కటి మాత్రమే దానికి అవగాహన అవుతుంది. అనంతశక్తియొక్క అచంచలమైన పునాదిపైన మాత్రమే జాతి అభివృద్ధి చెంది, వైభవోపేతమైన స్థితిలో తనను తాను నిలుపుకోగలుగుతుంది. ఇది విస్మరించరాని నగ్నసత్యం.

(పాంచజన్యం గ్రంథం నుండి)



మేలు కీడుల మేళవింపు మన జీవితం ఎంతో ప్రేమింపదగినది.

# ఆదిలో ఉన్నది వేదమతమే

— శ్రీ చంద శేఖరేంద్ర సరస్వతి.

కంచి కామకోటి 68వ పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారి శతాబ్ది మహోత్సవముల సందర్భమున కృతజ్ఞతాభి వందనతో, 1931 సం. లో స్వామి వారు యిచ్చిన సందేశమును శ్రీవాణి పాఠకులకు అందించు చున్నాను.— సం.

ప్రపంచంలో అనేక మతాలున్నవి. మతాలన్నిటికీ ప్రత్యేకమైన పేర్లున్నవి. ఆయా మత సంస్థాపకుల పేర్లతో అవి వ్యవహరించబడుతున్నవి.

బుద్ధ భగవానుడు కనుగొన్న మతం బౌద్ధం. జినుడి నామంతో జైనమతం. మహమ్మద్ ప్రవక్త పేరుతో మహమ్మదీయ మతం, జీసస్ క్రీస్తు స్థాపించినది క్రైస్తవ మతం. జోరాస్టర్ నెలకొల్పింది 'జోరాస్ట్రియనిజం' (పార్శీల మతం) చైనాలో కన్‌ఫ్యూషియస్ ద్వారా ఆవిర్భవించింది 'కన్‌ఫ్యూషియనిజం'. ఈ విధంగా క్రొత్త మతాలను సృష్టించి అసంఖ్యాక ప్రజలను తమవైపు ఆకర్షించిన వారంతా మహామహులు. ఒక్క మన మతానికి మాత్రమే ప్రత్యేకమైన పేరులేదు.

కాస్త ఇంగ్లీమ చదివిన కుర్రవాణ్ణి "అబ్బాయీ! నీ మతం ఏది?" అని అడిగితే 'నాది హిందూ మతం' అంటాడు. దక్షిణదేశంలో దస్తావేజులు వగైరా వ్రాసే వారిని ప్రశ్నించుతే "మేము శైవులమనో, వైష్ణవులమనో" జవాబిస్తారు. శైవంగాని, వైష్ణవం గానీ మన మతంలో శాఖలే తప్ప, అవి అసలు మన మతం పేర్లు కావు. అవి మనం ఆరాధించే దేవతల పేర్లు, మతాన్ని కనుగొన్నవారి పేర్లుకావు.

### *మన మతానికి పేరే లేదు!*

మన మతం పేరు హిందూమతమనేది నిజమైతే మన పూర్వీకులందరికీ ఆ పేరు తెలిసి ఉండవలసిందే. అతి ప్రాచీనకాలంలో కూడా ఆ పేరు వాడుకలో ఉండి ఉండేదే. మన పూర్వకాలపు వారికే కాదు, కొన్ని తరాల క్రిందటివారికైనా 'హిందూమతం' అనేమాట ఏదో ఒక వింత పదంగా, అర్థంలేని మాటగా అనిపించేది. ఈ పరిస్థితికి కారణమేమిటి? వాస్తవంలో మన మతానికి ఒక పేరంటూ లేదు. మన మతంలోని శాఖలకు మాత్రమే ప్రత్యేకమైన పేర్లు ఉన్నవి. ఆ పేర్లయినా మానవులవి కావు. ఉపాసన కోసం ఆయా మతానుయాయులు ఏర్పాటు చేసుకున్న ఒకే పరమాత్మ యొక్క వేరు వేరు రూపాలు. మన మొత్తం మతానికి ఒకే పేరు చెప్పడం కష్టసాధ్యం. ఇటీవల కాలంలో 'సనాతన ధర్మం' అనే పేరు విశేషంగా వినిపిస్తోంది. అయినా, అది కూడా అనాదిగా వస్తున్న పేరని చెప్పలేము. అదే అయినట్లయితే, మన గ్రామాల్లో నివసించే సామాన్య రైతులకూ, అనాథలకూ కూడా ఆ పేరు సుపరిచితమై ఉండేది.

### *'హిందూయిజం' మన పేరు కాదు*

'హిందూయిజం' అన్నది పరాయివారు మన మతానికి కట్టబెట్టిన పేరు. ఆ పేరు ప్రచారంలోకి ఎలా వచ్చిందో చరిత్ర



*మానవుని యందు జిజ్ఞాస కలిగించేవాడే ఉత్తమమైన గురువు.*

ద్వారా మనకు తెలుస్తూనే ఉంది. మన పూర్వీకులు ఒకప్పుడు సింధునదీ తీరంలో నివసిస్తూ ఉండేవారు. ఆ కాలంలో మన దేశానికి వచ్చిన విదేశీయులు "సింధ్" నదిని "ఇండస్" అన్నారు. 'ఇండస్' ప్రవహించే దేశాన్ని 'ఇందు' దేశమనీ 'ఇండస్' భూభాగమని వ్యవహరిస్తూ వచ్చారు. క్రమేణా 'ఇండస్' ప్రాంతాన్నేగాక, యావద్భారతదేశాన్ని అదే పేరుతో వ్యవహరించారు.

"హైడ్ పార్కుకు ఆవల అంతా ఎడారే అన్న సామెత మనం వినడం లేదా? అట్లా!

## మన మతానికి చిహ్నం లేదు

ప్రతి మతానికి ఒక చిహ్నం ఉంటుంది. దాన్ని బట్టి ఇది ఫలానా మతం అని మనం తెలుసుకోవచ్చు. క్రైస్తవ మతానికి 'శిలువ' గుర్తు. ఆ విధంగా హిందువులందరికీ ఒక ప్రత్యేక చిహ్నం లేదు. మన మతానికి పేరూ లేదు, చిహ్నమూలేదు. పేరులేని, గుర్తులేని మతం మనది. మన మతస్థులు కొందరు ముఖాన విభూతి ధరిస్తారు. మరికొందరు విష్ణుపాదాన్ని చిత్రించుకుంటారు. మనలో కొందరు వీర వైష్ణవులైతే, మరి కొందరు'లింగాయతులు' లేక వీరశైవులు.

అయినా, మొత్తం మీద తామంతా ఒకే మతానికి చెందిన వారమనే భావం కలిగి ఉంటారు. ఏపేరూ లేకుండా ఉండడంలోనే మన మతానికి ఒక మహత్త్వమున్నది. ఒకే విధమైన వస్తువులు అనేకం ఉన్నప్పుడు, ఒక్కొక్క వస్తువును వేరువేరుగా గుర్తించడానికి, వాటికి పేర్లు పెట్టవలసి వస్తుంది. ఒకే విధమైన వస్తువు ఒక్కటే ఉన్నదనుకోండి. అప్పుడు దానికి పేరెందుకు? ఉదాహరణకు, ఒకే ఊళ్ళో'రామస్వామి' అనే పేరు గల వ్యక్తులు నలుగురున్నట్లయితే, ఆ నలుగురిని వేరు వేరు ఇంటి పేర్లతో పిలవాలి. లేదా 'నల్లరామస్వామి' అనో, 'ఎర్ర రామస్వామి' అనో ఏదో గుర్తించదగిన పేరు పెట్టి పిలవాలి. రామస్వామి ఒక్కడే అయినప్పుడు, అతనిని గుర్తించడానికి వేరువేరు పేర్లు అక్కరలేదు. మన మతానికి కూడా ఈ సూత్రమే వర్తిస్తుంది.

## మతం అంటే ఏమిటి?

మతమంటే ఏమిటి? చావు పుట్టుకలనే విషచక్రం నుంచీ, లేదా పాపాలనుంచీ, కష్టపరంపరల నుంచీ మనలను రక్షించేది మతం. ఒక్క హిందూమతం తప్ప, ప్రపంచంలోని తక్కిన మతాలన్నీ ఆయా మత స్థాపకుల పేర్లతో పిలువబడు తున్నవని మొదట మనం చెప్పుకున్నాం. ఏతావాతా తేలిన విషయమేమిటంటే, ఈ మతకర్తలందరూ పుట్టక ముందు ఈ మతాలు లేనేలేవు. అంతేకాదు, ఈ మతాలన్నీ ఎప్పెప్పుడు ఏర్పడినవో, వాటి కాలాలు కూడా నిర్ణయించబడినవి. ఈ మతాలన్నీ రాకపూర్వం నుంచే మన మతం ఉండేదని, ఇందువల్ల నిరూపిత మవుతున్నది. అత్యంత ప్రాచీన కాలం నుండి మానవజాతి కంతటికీ ఆధ్యాత్మిక చింతనను ప్రసాదిస్తూ, విశ్వవ్యాప్తమై ఉండేది మన మత మొక్కటే. ఈ కారణం చేతనే, ఈ మతానికి ప్రత్యేకమైన పేరంటూలేదు. మతమన్నది కేవలం ధర్మం. ధర్మ మన్నది మతానికి మారు పేరు. మన మతానికి ప్రత్యేకమైన పేరు లేకపోయినా 'వేదప్రామాణ్య' మనే సామాన్యసూత్రమున్నది. ఆధ్యాత్మిక విషయాలలో వేదమే కట్టకడపటి ప్రమాణం అనే విశ్వాసం 'అదేమంత వేదాక్షరమా?' అన్న సామెత ఆ విశ్వాసం నుంచి పుట్టినదే.

## ఒకే మతమనటానికి ఆధారాలు

ఒకానొకప్పుడు యావత్ప్రపంచానికి మనది ఒక్కటే మతమైన పక్షంలో "ప్రపంచంలోని మానవులంతా మన మత సిద్ధాంతాలను అవలంబించారా?"అన్న ప్రశ్న ఉదయించటం సహజం. ఈ ప్రశ్నకు 'అవును' అని సమాధానం చెప్పడానికి అనేక ఆధారాలున్నవి. యూదుజాతివారు ఏసుక్రీస్తుకు మరణ శిక్ష విధించారు అందుకు వారు ఆయనపై కొన్ని ఆరోపణలు



కోరికలనే పాశాలను తెంపుకుంటే స్వేచ్ఛను అనుభవిస్తాడు.

మోపారు. హీనజాతి ప్రజల బావి నీటిని జీసస్ క్రీస్తు పుచ్చుకున్నాడన్నది యూదులు మోపిన నేరారోపణలలో ఒకటి. దీనిని బట్టి క్రీస్తుకు పూర్వం ఆ దేశంలో వర్ణవ్యవస్థ ఉన్నట్లు స్పష్టమవుతున్నది కదా! ఇంతేకాదు క్రీస్తుకు పూర్వం 1280 సం. నాటి శాసనం ఒకదానిని ఈజిప్టులో కనుగొన్నారు. రెండవ రామేశన్‌కూ, హిట్టైటెసకూ మధ్య జరిగిన సంధి షరతులు ఆ శాసనంలో పేర్కొనబడ్డాయి. సంధిలో 'మైత్రావరుణ' అనే వేదంలోని దేవత సాక్షిగా ఉదహరించబడినాయి. (H R.L. వ్రాసినHistory of the Near East పుస్తకం 364 పుట) ఇది గాక, ఈజిప్టు రాజవంశావళిలో 1వ రామేశన్, 2వ రామేశన్, 3వ రామేశన్ అంటూ 'రామ' శబ్దానికి సంబంధించిన రాజుల పేర్లు ఎన్నో ఉన్నాయి. దక్షిణాఫ్రికా తూర్పుతీరాన మెడగాస్కర్ ద్వీపంలోని స్థలాల పేర్లు నూటికి 75 వంతులు సంస్కృత భాషకు చెందినవే. వాటిలో చాలా భాగం రామాయణ కథానాయకుడైన శ్రీరాముని పేరుతో సంబంధం కలవి.

### 'సాగర'-'సహారా'

ఉత్తర ఆఫ్రికాలో 'సహారా డిజర్ట్' అనే పేరుతో గొప్ప ఎడారి ఉన్నదని మనకు అందరికీ తెలుసు. ఎడారులన్నీ ఒకప్పుడు సముద్రాలనే సిద్ధాంతం ఉన్నది. 'సాగర' అన్నది సంస్కృత శబ్దం.'సాగర' అన్న పదం భ్రష్టమై'సహారా' కావడం అసంభవం కాదు. సహారా ప్రదేశం జలమయమై ఉన్నకాలంలో దానిచుట్టూ ఉన్న భూమి జనవాసంగా ఉండేదనీ, అచ్చట నివసించే ప్రజల పేర్లు సంస్కృత భాషకు సంబంధించినవేగాక, రామ శబ్దంతో కూడా జతపడి ఉండేవని చెప్పబడుతున్నది. (ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా, 13వ సంపుటం, శీర్షిక-సహారా). మన భూగోళం అవతల దిక్కున ఇట్టి సాక్ష్యాధారాలు కోకొల్లలు. మనకెంతో దూరంగా ఉన్న మెక్సికోలో ఇంచుమించు మన దసరా పండుగ సమయంలోనే, ఆ దేశస్థులు కూడా ఒక పండుగ జరుపుకుంటారు. ఆ పండుగ పేరు 'రామసీత' (T.W.F. గోన్ రచించిన Maya Indians of Southern Yucation, North and British Honduras - 24పుట). ఇది ఒక్కటే కాదు. ఆ దేశంలో జరిగిన త్రవ్వకాలలో ఎన్నో 'గణేశ' విగ్రహాలు బయట పడ్డాయి.(బేరన్ హోమ్ బోల్డు వ్రాసిన ఈ విషయాన్ని హర విలాస్ శారదా 'హిందూ సుపీరియారిటీ' అనే గ్రంథంలో ఉదహరించారు.) ప్రాచీన కాలంలో ఆ దేశంలో నివసించే ప్రజల పేరు Astikas (ఆస్తికులు) అనగా పారాయణంలో నమ్మకం కలవారు. లేక వేదప్రామాణ్యాన్ని అంగీకరించేవారు. ఆ తెగకు చెందిన వారి పేరు ఈనాడు కూడా "ఆజ్‌టెక్సు". దక్షిణ అమెరికా పశ్చిమ భాగంలో 'పెరూ'లోని ప్రజలు సూర్యుని ఆరాధించేవారు.'ఇన్‌కాస్' అని పిలువబడేవారు 'ఇన' అనేది సంస్కృతంలో సూర్యునికి పర్యాయ పదం. వారి ముఖ్యమైన పండుగలు అయనాంతంలో జరుగుతాయి. (ఏషియాటిక్ రీసెర్చెస్, 1వ సంపుటం, 426 పుట).

### కాలిఫోర్నియా కపిలారణ్యమా?

కాలిఫోర్నియాలోని అనేక ప్రదేశాల పేర్లకూ మన పురాణాలలో కనిపించే పేర్లకూ పోలికలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. కపిలముని శాపం వల్ల 60 వేల మంది సగర చక్రవర్తి కుమారులు దగ్ధమై, బూడిద అయినారన్న కథ సుప్రసిద్ధం. వారి ఆత్మలను కాపాడేందుకు, వారి వంశీయుడైన భగీరథుడు గంగను ఆకాశమునుంచి భూమికి కొనివచ్చాడని పురాణగాథ. సగరుని కుమారులు వెతుక్కుంటూ వెళ్లిన గుర్రము పాతాళలోకంలో (Nether Lands) కనిపించిందని మన పురాణం చెబుతున్నది.

అమెరికా, భారత దేశాలు భూగోళం మీద ఒకదానికొకటి ఎదురెదురుగా ఉన్నవి. కాలిఫోర్నియా అన్నది 'కపిలారణ్యుడు' అనే పదానికి భ్రష్ట రూపం అనుకోడం అంత పరిహాసాస్పదం కాదు. దానికి కొద్ది దూరంలోనే ఉన్నవి "The Horse Island, the Ash Island" (హయద్వీపము, భస్మద్వీపము) అనేవి. మొదటిది సగర చక్రవర్తి గుర్రము

పట్టుబడిన ప్రదేశము. రెండవది సగరుని అరవైవేలమంది కుమారులు శాపవశాన భస్మంగా మారిన స్థలమని అను కోవడం కూడా ఊహకు మించిన విషయం కాదు.

## ఆస్ట్రేలియాలో శివనాట్యం

స్పెన్సర్, గిలెన్ అనువారిరువురూ 'NATIVE TRIBES OF CENTRAL ASIA' అనే పుస్తకం రచించారు. ఆ పుస్తకం 621వ పుటలో అటవీ జాతుల నాట్యాలు చిత్రించ బడ్డాయి. ఆ నాట్యాలలో ఒకటి "THE SIVA DANCE" (శివనాట్యం) 1899లో ఈ పుస్తకాన్ని మాక్మిలన్ కంపె నీవారు ప్రచురించారు. జాగ్రత్తగా పరిశీలించి చూస్తే నాట్యం చేస్తున్న ఆటవికుల ముఖాలపై మూడవ నేత్రం చిత్రించ బడ్డట్టు కనిపిస్తుంది.

ఆస్ట్రేలియా వంటి దూరదేశంలో సైతం ఆనాటి ప్రజలకు వైదిక సంస్కృతిలో సంబంధం ఉండేదని దీనిని బట్టి తెలుస్తున్నది. జావా, బోర్నియా వంటి దేశాల సంగతి ఇక అడగవలసిన పనేలేదు. ఆ దేశాలలో మన సంస్కృతికి సంబంధించిన నిదర్శనాలు లెక్కలేనన్ని ఉన్నాయి. హిందూ సంస్కారాలకు, పూజా పునస్కారాలకు తార్కాణాలుగా చెప్పదగినవి జావాలో కావలసినన్ని. బోర్నియాలో మానవుడు ఎన్నడూ అడుగుపెట్టని ఒక అరణ్యం ఉన్నట్టు చాలాకాలంగా ప్రాశ్చాత్య రచయితలు వ్రాస్తూ వచ్చారు. (వాలస్ వ్రాసిన "The Malayarchipelago").

ఆ తరువాత ఒక పరిశోధన బృందం ఆ అడవిలో ప్రవేశించి కొన్ని వందలమైళ్లు ప్రయాణించగా, వారి కొక శిలాశాసనం దొరికింది. దానిపైన ఒక రాజు కొన్ని యజ్ఞయా గాదులు చేసినట్లు వ్రాయబడింది. (Yupa Inscriptions of Mulavar man of Koeti, Borneo) ఒకానొకప్పుడు మన మతమొక్కటే ప్రపంచవ్యాప్తంగా ఉండేది అనడానికి పైన చెప్పినవన్నీ తార్కాణాలు.

## సప్త ద్వీపాలు

ఇకపోతే విశ్వాన్ని గురించి హిందువుల నమ్మకాలు ఎలాంటివో తెలుసుకొనడం కూడా అవసరం. యావత్తు భూఖండం ఏడు ద్వీపాలుగా ఉన్నదని హిందువులు విశ్వ సిస్తారు. శ్రీ ఆదిశంకర భగవత్పాదాచార్యులు తమ రచ నలలో ఒకచోట "సప్త ద్వీపాచ మేదినీ" అని పేర్కొన్నారు. ఈ సప్తద్వీపాలు ఒక్కొక్కటే కొన్ని వర్షాలుగా విభజించ బడ్డాయి. ఆ వర్షాలు మళ్లా 'ఖండాలు'గా ఏర్పడ్డాయి. మనం నివసించే ఈ ఇండియా దేశం'భరతఖండము' అని మన పురా తన గ్రంథాలు చెబుతున్నాయి. భరత ఖండం భరత వర్షంలో ఒక భాగం. ఆ భరతవర్షం జంబూద్వీపంలోది. మేరుపర్వత మన్నది సప్త ద్వీపాలకు ఉత్తర దిక్కున ఉన్నదని మన గ్రంథాలు పేర్కొంటున్నాయి. అంతేకాదు, ప్రతి రెండు ద్వీపాలకు మధ్య సముద్రం ఉన్నదనీ, సూర్యచంద్రులు మెరువు చుట్టూ పరిభ్రమిస్తారని కూడా మన గ్రంథాలలో వ్రాయబడింది.

పై అభిప్రాయాలలో ఇమిడి ఉన్న వాస్తవం ఏమిటో మనం తెలుసుకుందాం. భూగోళ శాస్త్రానికి సంబంధించిన పుస్తకాల ద్వారా భూమి గుండ్రంగా ఉన్నదని పాశ్చాత్యులు మనకు బోధిస్తారు. ఈ సత్యాన్ని ప్రప్రథమంగా ప్రాశ్చాత్యులే మనకు తెలియజేసారని మనం భావిస్తాము. 'జాగ్రఫీ' అనే ఇంగ్లీషు మాటకు సంస్కృత పదం'భూగోళం'. గోళమనే పదమే సూచిస్తుంది భూమి గుండ్రంగా వున్నదని. భూమి వలయాకారంగా ఉన్నట్లు మన పూర్వీకులు విశ్వసించారని ఆ పదం వల్లనే మనకు తెలియటం లేదా? గణిత శాస్త్రాల్లో అంతటా'ఖగోళం', 'భూగోళం' అనే పదాలు ఉండటం కూడా దీనిని బలపరుస్తుంది. మన సంకల్ప మంత్రాలలో భూమిని 'బ్రహ్మాండం' అని చెబుతాము. 'అండం' అంటే గ్రుడ్డు అని అర్థం. కొంచెం ఏటవాలుగా ఉన్నా గ్రుడ్డు గుండ్రనిదే కదా!

భూమి యావత్తూ నిమ్మపండు ఆకారంలో ఉన్నదనీ, మేరువు (హిమాలయం) ఉత్తర దిక్కును సూచించే శిఖరమనీ భావించే పక్షంలో మేరువు భూమికి ఉత్తర ధృవం అవుతుంది. అప్పుడు "సర్వేషామపి వర్షాణాం మేరు రుత్తరతః స్థితః". అన్న వాక్యం సార్థకమవుతుంది. తక్కిన భాగమంతా దక్షిణం అవుతుంది. శిఖరంమీద నిలుచున్న వ్యక్తి కంటికి, దాని చుట్టూ సూర్యచంద్రులు పరిభ్రమిస్తున్నట్టే కనిపిస్తారు. అనగా, సంవత్సరంలో ఎప్పుడో గానీ సూర్యుడు శిఖరానికి ఒక ప్రక్కగా ఉంటాడే తప్ప, పూర్తిగా నెత్తిమీదకి రాడు. మేరువు చుట్టూ సూర్యుడు తిరుగుతాడని మన శాస్త్రాలు చెప్పే మాటకు సరి అయిన అర్థం అది. కాబట్టి ఆధునిక భూగోళ శాస్త్రజ్ఞులు క్రొత్తగా కనిపెట్టిన సిద్ధాంతాలు ఏవీ మన శాస్త్రాలకు విరుద్ధాలుకావు. వర్తమాన భూగోళశాస్త్రకారులు భూమిని గురించి చెప్పే సూత్రాలు మన ప్రాచీన ఋషుల్యాదులకు తెలియనివి కావు. ఆర్యభట్టు, వరాహమిహిర, అప్పయ్య దీక్షితుల రచనలలో కూడా వీటికి నిదర్శనాలున్నాయి

ఈ ప్రపంచంలో మొట్టమొదట వ్యాప్తి చెందిన మతం మనదేనని వీటన్నిటి మూలంగా మనకు ఋజువు అవుతోంది. ఇతర మతాలన్నీ తరువాత పుట్టినవే. సమగ్రమైన మన మతంలోని కొంత కొంత విజ్ఞానాన్ని గ్రహించి, అవి క్రమంగా వృద్ధి చెందాయి.

* * *

## ఇండోనేషియాలో భారతీయ సంస్కృతి

ఇండోనేషియాలో భారతీయ సంస్కృతీ ప్రభావం ఈనాటికీ కనిపిస్తుంది. అక్కడి పరిపాలకులు మహ్మదీయులే అయినప్పటికీ 1965 సం.లో ప్రపంచ రామాయణ మహాసభలు అక్కడి ప్రభుత్వమే నిర్వహించింది. ఆ దేశములోని అచ్చు పుస్తకములలో ప్రారంభమున 'అవిఘ్నమస్తు' అని వుంటుంది మనదేశము యొక్క విమాన సంస్థ పేరుIndian Air Lines' అయితే ఇండోనేషియాలో 'Garuda Air Lines' అంటారు. మన పురాణాలలోని గరుత్మంతుడు విమానసూచకము. మన దేశ ప్రభుత్వ బ్యాంక్ పేరు 'Reserve Bank of India'అయితే ఆ దేశము యొక్క బ్యాంక్ పేరు 'Bank of Kubera'. మన పురాణాలలో కుబేరుడు ధనాధిపతి. ఒక పర్యాయం మన చరిత్రకారుడు డా. రఘువీం అప్పటి ఇండోనేషియా ప్రెసిడెంట్ 'సుకర్ణో' ను కలిసినప్పుడు 'నా పేరునకు అర్థమేమిటి?" అని ప్రశ్న వేయగా, అప్పుడు డా. రఘువీర "మీ పేరు ఆదిలో 'సుకర్ణ' అయి వుండవచ్చు. బుద్ధుని విగ్రహమునకు చెవులు పెద్దవిగా వేయుదురు. కావున ఇది బుద్ధుని పేరై వుండవచ్చును" అని సమాధానం చెప్పాడు. అప్పుడు సుకర్ణో నవ్వి "అట్లు కాదు. నేను పుట్టిన సమయంలో నా తండ్రి మహాభారతం ప్రతిదినం చదువుతుండేవాడుట. భారతంలో కర్ణుడు బాగా నచ్చాడుట. అయితే కర్ణుడు దుష్టచతుష్టయంలోని వాడు గదా! నా కుమారుడు దుష్టకర్ణుడు కాక సుకర్ణుడుగా వుండవలెనని తలంచి నా తండ్రి నాకు సుకర్ణుడని పేరు పెట్టినాడుట" అని చెప్పెను.

ఈ సంఘటనలను బట్టి మన ప్రాచీన సంస్కృతికి ఆదరం మనదేశంలో కన్నా ఇండోనేషియాలోనేఎక్కువగా వున్నట్లు తేటతెల్లమవుతున్నది.



*బంధరహితమైన అనురాగమే భగవంతుడు.*

శ్రీవాణి శత సంచికకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు

శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదట!
స్వామి అనుగ్రహం ఉంటే ఏ పనీ ఆగదు

స్వామి దివ్యఅమృత హస్తాలతో
ప్రారంభించిన రసమయసుధ...

# శ్రీ సత్యసాయి వైభవం



ఆడియో కేసెట్స్ Vol. No. 1, 2, 3 ఇప్పటికి విడుదలై వీనులవిందు చేస్తున్నవి. త్వరలో మరికొన్ని విడుదల కానున్నవి.

Vol. No. 1 _ పాటలు, Vol. No 2, 3 _ భజనలు

పుట్టపర్తిలో అన్ని షాపులలోనూ ఈ కేసెట్లు లభించును.

ఎక్కువ కేసెట్లు కావలసినవారు ఈ క్రింది చిరునామాకు సంప్రదించండి.

## శ్రీ సాయిలక్ష్మి చిత్రమాల

పిడపర్తివారి వీధి

డాబా గార్డెన్స్ - విశాఖపట్నం_20

మావద్ద శ్రీ సత్యసాయి బాబావారి ఫోటోలు, కీచైన్స్, లాకెట్లు, స్టిక్కర్లు, పుస్తకములు మొ॥ లభించును.


S

With best compliments from

# ఆంధ్రప్రదేశ్‌లో
# చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి
# ప్రత్యేక దోహదం ....

* రాష్ట్రంలో నిర్మించబడే తెలుగు చలన చిత్రాలకు వినోదపు పన్ను రాయితీ
* అంతేకాదు, రు. ౩ లక్షల వరకు సబ్సిడీ
* స్టూడియోలు మొదలయిన వ్యవస్థా నిర్మాణానికి ఆర్థిక సహాయం, స్థలాల కేటాయింపు
* వెనుకబడిన ప్రాంతాల్లో, థియేటర్లు లేని మండల కార్య స్థానాల్లో థియేటర్ల నిర్మాణానికి ఋణ సహాయం
* సినీ కళాకారులలోను, సాంకేతిక సిబ్బందిలో స్వల్పాదాయ వర్గాలకు ఇండ్ల స్థలాల ఏర్పాటు యత్నం

మీ కోసం మీ సేవలో,

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధి సంస్థ

ఏ. సి. గార్డ్స్, హైదరాబాదు - 500 028

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు



# జ్ఞానోదయ స్కూలు

( 6 వ తరగతి నుండి 10 వ తరగతి )

తెలుగు మీడియం

స్తంభాల గరువు

గుంటూరు - 522 006

ఫోన్లు : 33026 (ఇల్లు)
35628 (ఆఫీసు)

డైరెక్టర్

కె. రాజారామమోహనరావు

( జాతీయ అవార్డు గ్రహీత )

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు



# జ్ఞానోదయ స్కూలు

( 6 వ తరగతి నుండి 10 వ తరగతి )

తెలుగు మీడియం

స్తంభాల గరువు

గుంటూరు - 522 006


ఫోన్లు : 33026 (ఇల్లు)
35628 (ఆఫీసు)

డైరెక్టర్

కె. రాజారామమోహనరావు

( జాతీయ అవార్డు గ్రహీత )

# మంచి మనస్సు

సి. వేదవతి.

మంచి మనస్సు- సూర్యకాంతి వలె, వెన్నెల కిరణం వలె, మనిషికి గొప్ప తేజస్సును ఇస్తుంది. సన్మార్గంలో నడిపిస్తుంది. అసలు మానవత్వం అంటేనే మంచి మనస్సు కలిగి ఉండటం!

దయ, క్షమ, ప్రేమ, స్నేహం, పరోపకారం, త్యాగం- ఇవన్నీ మానవత్వపు లక్ష ణాలు. ఇవి- మనిషిని మాన వత్వం నుండి దైవత్వం వైపుకు నడిపించే గొప్ప లక్షణాలు ఈకాలంలో ఈ మంచి లక్షణాలు మన మధ్య నుంచి క్రమంగా తప్పుకు పోవడంమనంచూస్తున్నాం. అనేక కారణాల వల్ల - ఈ విషయాలను గురించి ఆలో చించగల తీరికా, శ్రద్ధా మనకు కరువై పోతున్నాయి. సైన్సు మనకు ఎన్నో క్రొత్త విషయాలు నేర్పుతున్నది కాని, మనం- ముఖ్యమైన మానవతా ధర్మాన్ని మాత్రం మరిచిపోతున్నాం.

A good leg fall; a straight back will bend; a curled fate will grow bold; a fair face will whitter; a full eye will way hollow; but, a good heart - is the sun and the moon; for if shines bright, and never changes, but keeps his course truly-
Shakespeare Henry V

అంటాడు షేక్స్పియర్ ఒకచోట!
వయస్సు పైనపడుతూ ఉంటే శరీరం అనేకమైన మార్పులు చెందుతూ ఉంటుంది. కృశిస్తూ ఉంటుంది. కానీ, ఎప్పటికీ మారనిదీ- సూర్యచంద్రుల వలె స్థిరంగా ఉండేదీ- మంచి మనస్సు ఒక్కటేఅని దీని భావం.

ఇవాళ మనం- మానవత అంటే ఏమిటో, మంచి మనస్సు కలిగి ఉండటం అంటే ఎట్లాగో- కొంత ఆలోచించి చూద్దాము.భగవంతుడు మనిషికి బుద్ధినీ, జ్ఞానాన్ని ప్రసాదించాడు. దానితోపాటు స్పందించే హృదయాన్ని కూడా ఇచ్చాడు మనిషైన వాడి హృదయం కరుణకు నిలయం అయి ఉండాలి. ఆలోచించి చూస్తే, ఈ సృష్టి అంతా కూడా కరుణామయంగా తోస్తుంది. ఈ మట్టి, గాలి, నీరు, వెలుతురు - ఇవన్నీ గూడా ప్రభువు దయతో మనకు సృష్టించి ఇచ్చినవే! మట్టి మనకు అన్నాన్ని ఇస్తుంది. చెట్టు ఫలాన్ని ఇస్తుంది. గాలి ప్రాణవాయువై మనకు ఊపిరి పోస్తుంది. మేఘం వర్షించి నీటిని ఇస్తుంది. సూర్యుడు మనకు కాంతినీ, ప్రాణశక్తినీ ఇస్తున్నాడు. ఇట్లా - మనకు కావలసినవన్నీ ఇచ్చి ప్రకృతి తన దయా గుణాన్ని చాటుకొంటున్నది.

ఈ ప్రకృతి ఒడిలో పుట్టి పెరిగిన మనిషికి కూడా సహజ ధర్మంగా ఉండవలసింది ఈ దయాగుణం.ఇతరుల బాధలకు, కష్టాలకు స్పందించి వారికి చేయూత ఇవ్వాలని తపనపడే లక్షణమే మానవత్వానికి నిర్వచనం.

ముసలివాడినీ, రోగిష్టివాడినీ, మరణించినవాడినీ చూచి చలించిపోయి కరిగిపోయిన గౌతమబుద్ధుడి మనస్సు నిండా ఉన్నది ఈ దయా గుణమే! ఇట్లా తనను గురించి తాను ఆలోచించుకోవడంకాక- ఇతరులనుగురించికూడా కొంత ఆలోచించే స్వభావం కలిగి ఉండటమే మానవత్వపు లక్షణం.



స్థిరమగు ఇంద్రియ నిగ్రహమును యోగము అందురు.

## "స్వంత లాభం కొంత మానుకు

"పొరుగు వాడికి తోడుపడవోయ్"- అన్న గురజాడ మహాకవి మాటల్లోని అంతరార్థం ఇదే! ఈ దయా గుణం ఉండటం వల్ల సేవాభావం కలుగుతుంది.

ఫ్లారెన్స్ నైటింగేల్, మదర్ థెరిసా వంటివారు ఈ సేవా భావాన్ని తమ జీవిత లక్ష్యాలుగా భావించారు. దుఃఖంలోనూ, బాధలోనూ ఉన్న దీనులకు తమ సేవల ద్వారా కొంత ఊరట నివ్వటం- వీరు ఎన్నుకొన్న సేవాపద్ధతి. కన్నీళ్లు బాధకు సంకేతం. ఈ బాధ ఆకలి బాధ కావచ్చు. మానసిక బాధ కావచ్చు. ప్రేమ కోసం, ఆదరణకోసం పడే తపన కావచ్చు. ఏ విధమైన బాధనైనా, ఒక చల్లని మాటతో, స్పర్శతో, చర్యతో ఉపశమనం కలిగించే గొప్ప ధర్మాన్ని వారు ఆచరించి చూపించారు.

ఆ మహనీయుల ఆదర్శంతో- మనం మానవత్వపు విలువలను సాధన చేసుకోగలగాలి. తోటి మానవులపట్ల ఓర్పును, సద్భావాన్నీ, సానుభూతినీ అలవరచుకోవాలి. మన జీవితాన్ని త్యాగమయంగా మలచుకోవాలి. మనతోటి మానవుల పట్ల మాత్రమేకాక- సర్వజీవులపట్లా ప్రేమతో, దయతో వ్యవహరించటం- సాధన చేయాలి.

"సేవించు, ప్రేమించు, సత్కార్యములు చేయి' అన్నది అన్ని మతాలూ బోధించే నీతిసారం.

దప్పిగొన్నవాడికి చల్లని నీళ్లు అందించడం, ఆకలి గొన్నవాడికి పిడికెడు అన్నం పెట్టడం, ఆపదలో ఉన్నవాడికి సహాయం చేయడం - వీటివల్ల మనకు కలిగే ఆనందమూ, తృప్తీ మాటలలో చెప్పలేనంత గొప్పవి.

"సర్వేజనా స్సుఖినోభవంతు-"

"సర్వజనులూ సుఖంగా ఉందురు గాక!" అని మన ప్రార్థన కావాలి. అందుకే- మనందరమూ ఈ విధంగా ప్రార్థించుదాము.

"ప్రభూ! మాకు ప్రసాదింపుము
వివేకముకల హృదయాన్ని
ఆదరణా, ఔదార్యమూ కల హృదయాన్ని
అనాథులను ఆదుకోగలిగే దయాంతరంగాన్ని! * * *

## ఇంటర్ వ్యూ!

ఇండియా రాయబారిణిగా శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ 18 నెలల పాటు రష్యాలో ఉంది. కానీ ఆ దేశాధినేత స్టాలిన్‌తో ఏ మాత్రం సత్సంబంధాలు పెట్టుకోలేకపోయింది. ఆ తర్వాత డా. రాధాకృష్ణన్‌ని ఆ పదవిలో నియుక్తులు గావించారు. స్టాలిన్ భౌతికవాది, కరుకుతనానికి మారుపేరు. రాధాకృష్ణన్‌గారు తత్త్వవేత్త, సౌమ్యుడు. వీళ్ళిద్దరికీ పొంతన ఎలా కుదురుతుందో అర్థం కాలేదు. కానీ, రోజుకు పద్దెనిమిది గంటల పుస్తక పఠనంలో నిమగ్నులై వుంటారని రాధాకృష్ణన్‌గారు అని విన్న స్టాలిన్ రాధాకృష్ణన్ మాస్కో వెళ్ళిన కొద్ది కాలానికే ఆయనకు ఇంటర్వ్యూ లభించింది. ఈ వార్త ప్రపంచదేశాల రాజధానులలో ఆశ్చర్యాన్ని కలుగజేసింది. సాధారణంగా స్టాలిన్ విదేశరాయబారులను చూడ్డం జరిగేదికాదు. 1952 లో తిరిగి ఇండియా వస్తున్నప్పుడు (ఉపాధ్యక్ష పదవికి) పోటీ చేస్తున్నప్పుడు స్టాలిన్ కోర్కెపై ఆయన్ని కలుసుకున్నాడు. అప్పుడు స్టాలిన్ ఆరోగ్యస్థితోలో మార్పు కనిపించింది. ఆయన బుగ్గలను, తలను నిమిరి, ఆయన వీపుపై రాధాకృష్ణన్ తట్టేసరికి ఆ నియంత విచలితుడైనాడు. తాను ఎక్కువ కాలం బ్రతకనని స్టాలిన్ డా. రాధాకృష్ణన్‌తో అన్నాడు.ఆ తర్వాత భారత రాష్ట్రపతి గావటంతో తాత్త్వికవేత్తగా పేరున్న డాక్టర్ రాధాకృష్ణన్ రాజనీతి శాస్త్రజ్ఞుడుగా కూడా అందర్నీ ఒప్పించగలిగాడు.చూసారా. విద్యాధికుడు ఏ దేశంలోనైనా గౌరవించబడతాడు అన్నదానికి ఇది ఒక తార్కాణం.



# శ్రీ సిద్ధేంద్రయోగి - భామా కలాపం

పి. భారతీ శాంతారామ్.

దాక్షిణాత్యుల నాట్యశైలులలో ఆంధ్రులకు గర్వకారణముగా నిలిచినది కూచిపూడి నాట్య శైలి. ఇది ఆంధ్రుల జాతీయ నృత్యకళ. దక్షిణ దేశముననున్న ప్రాచీన నాట్యశైలు లన్నిటి యందు ప్రాచీనమై, శాస్త్రీయమై విరాజిల్లుచున్నటువంటి నాట్యకళ ఈ కూచిపూడి నాట్యకళ. ఈ కూచిపూడి నాట్యకళ నేడు ఖండాంతర ఖ్యాతితో ప్రపంచము నందంతటను నీరాజనముల నొందుచున్నది.

కూచిపూడి నాట్యకళాక్షేత్రమున జన్మించిన మహనీయులెందరో తమ జీవితములను ఆ నాట్యకళాధి దేవతకు అంకిత మొనర్చినారు. అందు కూచిపూడి నాట్యకళను ఒక మలుపు తిప్పి అటు ఆంధ్ర వాఙ్మయమునకు ఇటు కర్ణాటక సంగీతమునకే కాక నాట్యంలో నవరసము లొలికించి, పలికించి పులకింప జేసినటువంటి కలాప ప్రక్రియాప్రబంధ సృష్టికర్త, మహిమాన్వితుడు, యోగిపుంగవుడు శ్రీ సిద్ధేంద్రయోగి. సిద్ధేంద్రుని యొక్క మానసపుత్రిక భామా కలాపం. కలాప, యక్షగాన వాఙ్మయమునకు శ్రీకారం చుట్టిన సిద్ధేంద్రయోగి మార్గమున పయనించని కవి ఆంధ్ర కలాప, యక్షగాన వాఙ్మయ చరిత్రమున కానరాడు. హరికథా పితామహుడైన ఆదిభట్ల నారాయణదాసుగారు సహితము సిద్ధేంద్రుని సృష్టి వైచిత్రికి స్పందించెను. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు సిద్ధేంద్రుని భామాకలాపం వడగట్టిన అలంకార, భరత శాస్త్రమని వక్కాణించారు. క్రీ.శ.13, 14 శతాబ్దాలలో కూచిపూడిలో సిద్ధేంద్రుని భామాకలాపం ఆవిర్భవించింది. సిద్ధేంద్రుని భామాకలాపం భావజ్ఞానానికి, రాగ జ్ఞానానికి, తాళ జ్ఞానానికి పెట్టింది పేరు. అంతేకాదు భామాకలాపం భరత శాస్త్రానికినికి లక్ష్య, దృశ్య ప్రబంధం. సిద్ధేంద్రయోగి భామాకలాపాన్ని రచించి స్వగ్రామ వాసులైన, కూచిపూడి భాగవతులుగా పేరుగాంచిన బ్రాహ్మణులకు నేర్పి అన్వర్థ కులపతి యైనాడు. సంస్కృత రూపక మర్యాదలను, భరత లక్షణములను జీర్ణించుకున్నకూచిపూడి భాగవతులు భామా కలాప ప్రయోగంతో పరాకాష్ఠకు చేరారు.

సిద్ధేంద్రయోగి భామాకలాపాన్ని ముచ్చటగా మూడు పాత్రలతో ముగించాడు. అవి సత్యభామ, శ్రీకృష్ణుడు, మాధవి. భామాకలాప మొక అలౌకిక ఆనందప్రదాయి. అదొక శృంగార, హాస్య, రస ప్రబంధం ఈ యక్షగానాన్ని కూచిపూడి భాగవతులు మూడు రాత్రులు ప్రదర్శించేవారు. ఇందు సత్యభామ ధరించిన వేణీ వృత్తాంతం ఒక రమణీయ దృశ్య కావ్యం.

భామాకలాప మందలి ఇతివృత్తం అత్యల్పం. సత్యభామా కృష్ణుల ప్రణయమే ఇందలి కథా వస్తువు. సత్యభామ సర్వాభరణములను ధరించి వాసక సజ్జికా వాలకమున ఉండగా శ్రీకృష్ణుడామెను సమీపించి భామా! నీవే అందగత్తెవా? లేక నేనే అందమైన వాడనా అని ప్రశ్నిస్తాడు. సౌందర్య గర్వితయగు సత్యభామ నేనే అందగత్తెననగా కృష్ణుడు అలుకతో సత్యాసౌధాన్ని వీడి వెళ్ళిపోతాడు. ఈ సంఘటనతో సత్యభామకు శ్రీకృష్ణునితో ఎడబాటు ఆరంభమై, విప్రలంభయై తాళలేక వెతికి వేసారి చివరికి తన చెలికత్తె యైన మాధవికి లేఖ వ్రాసి యిచ్చి మాధవుని తీసుకు నిరమ్మని ( తరువాయి 137వ పేజీలో)



సహనం నుంచి లభించే ఫలాలు మధురంగా ఉంటాయి.

# తీర్పు

కవుల ఆంజనేయశర్మ

మిథిలా నగరాన్ని జనకమహారాజు పరిపాలిస్తున్న రోజులు. రాజ్యసిరి నిత్యనూతనంగా వుంది. సరస్వతీదేవి ప్రకృతితో కలిసి పాడుతున్నట్లు అనిపిస్తోంది. ఆమె కడుపున పుట్టిన వారివలె ప్రకాశిస్తూ వుంటారు ఇక్కడి జనులు. వేదమంత్రాలతో నిత్య కళ్యాణ మంటపంలా ఉంది సభ. శాస్త్ర పరిశోధకులతోను, విద్వాంసులతోను, మునిపుంగవులతోను, వేదాలు వల్లించే బ్రాహ్మణులతోను సభ నిండి ఉంది. జనక మహారాజు సింహాసనంపై కూర్చొని ఉన్నారు. సభలో ఒక వ్యక్తి తలవంచుకొని నిలబడి ఉన్నాడు. అతడు ఏదో తప్పు చేసిన వానివలె కనబడుతున్నాడు తప్పు ఒప్పుకొన్నాడు కూడా. న్యాయ నిర్ణయం కోసం సభలోని వారందరు జనకుని వైపు చూస్తున్నారు.

'ఓయీ! నీవు చేసిన ఈ ఘోరపాపానికి, నిన్ను నా రాజ్యం నుండి బహిష్కరిస్తున్నాను' అంటూ ఉత్తర్వులు జారీచేశాడు జనక మహారాజు. అప్పుడా బ్రాహ్మణుడు చేతులు జోడించి వినయంగా 'మహారాజా! మీరు విధించిన శిక్షను హృదయపూర్వకంగా స్వీకరిస్తున్నాను. కానీ ఒక్క విషయం మీ రాజ్యపు సరిహద్దులు నాకు తెలియవు. ఆ సరిహద్దులు తెలియజేసిన నేను వెళ్లిపోతాను. మన్నించండి'- అన్నాడు

విరక్తుడు, బ్రహ్మజ్ఞాన నిష్ఠుడు అయిన జనకుడు సావధానంగా ఆలోచించసాగాడు. ఇదొక చిత్రమైన ప్రశ్నగా అతనికి తోచింది. అతని ముఖ వర్చస్సు క్షణక్షణము మార నారంభించింది మొట్టమొదట ఆయన తన అధికారాన్ని సంపూర్ణ భూమండలం మీద, క్రమంగా రాజ్యం మీద ఉందని ఊహించాడు. తర్వాత కేవలం మిథిలానగరం మీద, ఆ తర్వాత మిథిలానగర ప్రజల మీద తనకధికారం గలదనుకొన్నాడు. ఆత్మజ్ఞానమనే దీపపు నీడలో మిణుకు మిణుకుమంటున్న తన శరీరం తన అధికార యోగ్యమని భావించాడు చివరకు తన అధికారం దేనిమీద లేదని తేల్చుకొన్నాడు.

సభవారంతా మహారాజు తీర్పుకు ఆసక్తితో ఎదురు చూస్తున్నారు. బ్రాహ్మణుని వైపు చూస్తూ మెల్లగా తన స్థితినంతా వివరించి చెప్పాడు జనకుడు. 'నాకు అధికారం దేనిమీద లేదు. మీ ఇష్టం వచ్చిన చోట వుండండి' అంటూ తెలియజేశాడు.

అప్పుడా వ్యక్తి ఆశ్చర్యంగా 'మహారాజా! మీరు ఈ విశాల సామ్రాజ్యానికి ప్రభువై వుండి కూడా ఏ వస్తువు మీద అధికారం లేదంటున్నారు. ఎందుచేత? మొట్టమొదట ఏమాలోచించి ఈ భూమండలాధిపత్యం మీదికి మీ దృష్టిని పోనిచ్చారు?' ప్రశ్నించాడు.

జనకుడు చిరునవ్వు నవ్వి 'మహానుభావా! లోకంలో కంటికి కనిపించేవన్నీ అశాశ్వతములే. అధికారయోగ్యమైన వస్తువు ఏదీ లేదు. అధికారి ఎవ్వడూ లేడు. అలాంటప్పుడు ఫలానా వస్తువు నాదని ఎలా చెప్పగలను? నేను నా ఆనందానికి ఏ పని చేయను. కాని అన్నింటిమీద అధికారం మాత్రం ఉంచుకుంటాను. అందుకే నమ్మదగిన ఈ సత్యపు మాటను ఆలోచించి తెలియజేస్తున్నాను'- అన్నాడు. సభలోని వారంతా కరతాళధ్వనులు చేశారు.



# ప్రాణదాత భగవాన్ శ్రీ సత్యసాయి

సరోజా పట్నాయక్

మీ యింట జంట వెంట నేను ఉన్నాను అనే సత్యాన్ని నిరూపించుకున్నారు శ్రీ సత్యసాయి. మా కుటుంబ సభ్యులందరికి మరుపురాని సంఘటన అది. ఆ విషయాలు వివరించి వ్రాస్తున్నాను.

'92 మార్చి నెల 14 తారీఖు శనివారం మానాన్నగార్కి చాల సీరియస్ చేసింది. ఆరోజు మా ఫ్యామిలీ డాక్టర్ వచ్చి చెక్ చేసి ఇతనికి బ్లడ్ షుగర్ చాలా ఎక్కువయిపోయింది. రేపు అనగా (ఆదివారము 15 తారీఖు) డయబెటిస్ స్పెషలిస్ట్ వస్తారు. ఆ డాక్టర్‌కి చూపిస్తే మంచిది అని ఆ డాక్టర్‌కి ఒక లెటర్ వ్రాసి ఇచ్చారు. ఆ లెటర్ పట్టుకొని మా తమ్ముడు ఆ డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు. అతను వారం కి ఒక్కరోజే వస్తారు (కలకత్తా నుండి) కాబట్టి విపరీతమైన రష్‌గా వుంటుంది కాని ఆరోజు ఎవ్వరు లేరు. మా ఫ్యామిలీ డాక్టర్ వ్రాసిన లెటర్ చదివి ఆ డాక్టర్ మా తమ్ముడుతో వచ్చారు. నిజంగా ఆ రోజు ఆదివారం కావడం మా అదృష్టం కదా!

ఆ డాక్టర్ అన్నటెస్ట్‌లు చేసారు. ఇతని పరిస్థితి ఏమి బాగులేదు. ఏలా వుంటుందో నాకేం తోచడంలేదు. ఇతన్ని వెంటనే హాస్పిటల్‌లో జాయిన్ చేస్తే మంచిది అన్నారు. మా నాన్నగారు లేవలేరు, కూచోనులేరు, ఎవర్ని పోల్చుకోవడం లేదు, మాట్లాడటంలేదు. ఇటువంటి మనిషిని ఏల తీసుకొని వెళ్తాం. ఎంబులెన్స్‌కి ఫోన్ చేసి మెల్లిగా స్నేహితుల సహాయంతో హాస్పిటల్లో జాయిన్ చేసినాం.హాస్పిటల్లో డాక్టర్ కూడ కండిషన్ చూసి చాల గాభరాపడిపోయి మా తమ్ముడ్ని ప్రక్కకి పిలిచి మా వాళ్ళందరికి టెలిగ్రామ్స్ చేసేయండి. ఇతను ఏం తింటారో అన్ని పెట్టేయండి అన్నారట. ఈ విషయం మా తమ్ముడు ఇంట్లో చెప్పకుండ (అంటే చెబితే మేము బెంగపడతామని చెప్పకుండా వాడే మనసులో వుంచుకొని బాధపడుతుండేవాడు) ఆరోజు రాత్రంతా అలాగే గడిచిపోయింది.

ఆ మరుసటి రోజు సోమవారము 16 తారీఖు మేము క్లష్టర్ భజనలు చేస్తుంటాం. సోమవారం మా యింట్లో భజన. మా యింటికి క్లష్టర్ వాళ్లంతా వస్తారు. ఆరోజు మేము భజనలో ఏలా పాల్గొన్నామో మాకే తెలియదు. భజన మధ్యలో స్వామి మా ఇంటి గేటు దగ్గర నుండి మా నాన్నగారి పూర్తి పేరు పెట్టి''చంద్రశేఖర్'' అని మూడు సార్లు పిలిచారట. భజనలో కన్నీళ్లతో స్వామిని ప్రార్థిస్తు పాటలు పాడామేమో మాకు తెలియదు. స్వామి ఫోటో మీద నుండి పువ్వులు పడ్డాయి. మా యింటికి వచ్చిన వాళ్ళు అన్నారు. మీ నాన్నగార్కి మరేం భయంలేదు. మీ యింటికి స్వామి వచ్చి మీ నాన్నగార్ని పిలిచారు. ఫోటో మీద నుండి పువ్వులు పడ్డాయి అని మాకు ధైర్యం చెప్పారు. స్వామి మా నాన్నగార్ని తప్పక కాపాడ తారని నమ్మకం మా అందరికి వుంది. కాని మా నాన్నగారి పరిస్థితి డాక్టర్స్ మాటలు వింటుంటే భయం వేసేది.

మంగళవారం 17 తారీఖు. మా నాన్నగార్కిఎక్స్‌రే తీసారు. బుధవారం 18 తారీఖు రిపోర్టు వచ్చింది. గుండెలో చిన్న స్పాట్ వుంది. తరువాత కిడ్నీ కూడ కొంచెం దెబ్బ తింది. కాబట్టి మా దగ్గర ఆ పరికరాలు లేవు కనుక బరంపూర్ మెడికల్ కాలేజ్‌కి తీసుకు వెళ్ళిపొండి అని చెప్పినారు. మాకు

మరీ భయం వేసింది. తెలియని ఊరిలో ఎలా వుంటాం. ముఖ్యంగా నాన్నగార్ని ట్రెయిన్ ఎలా ఎక్కిస్తాం. స్వామి మీరు తప్ప మాకు ఇంకా ఎవ్వరు లేరు అని స్వామిని ఎంతగానో ప్రార్థించేవాళ్ళం. ఇంకా రెండురోజులు చూసుకొని మీరు బరంపూర్ వెళ్ళిపొండి అని డాక్టర్స్ చెప్పినారు.

గురువారం 19 తారీఖు సాయంత్రం 6 గంటలకి మా ఫ్యామిలీ మెంబర్స్ అంతా భజన చేసుకుంటాం. మా అమ్మ నాన్నగారి దగ్గర హాస్పిటల్లోనే వుండేవారు. నేను, మా చెల్లీ, యిద్దరు తమ్ముళ్ళు, మేము నలుగురు భజన చేస్తున్నాం అంటే, అదే టైమ్‌లో 6 గంటలకి మా అమ్మ అనుకుంటున్నారట. స్వామీ మేము నిన్ను నమ్ముకున్నాం. మీరు తప్ప మాకు ఇంకెవ్వరు లేరు. ఏం చేసిన మీరే చెయ్యాలి స్వామీ అని అనుకుంటుండగానే మా అమ్మ కళ్ళు మూతలు పడినట్లు అయ్యిందట. స్వామీ తెల్లని డ్రెస్‌లో మా నాన్నగారి దగ్గరికి వచ్చి తల దగ్గర నుండి షర్ట్ గుండీలు విప్పేసి గుండె అంతా కాళ్ళ దగ్గర దుప్పటి తీసి పాదాలకి, పాదాల అడుగు భాగానికి పూర్తిగా విభూతి వ్రాసినారట. పరుపు అంతా విభూతి. అంతా విభూతి వాసన. మా అమ్మ ఇంకా స్టూల్ మీద అలాగే కూచొని వుందట. మా అమ్మ కళ్ళు మూసుకొని కూచున్న దట. మా తమ్ముడు ఇంట్లో భజన చేసుకొని వెళ్ళాడు. వెళ్ళే సరికి మా నాన్నగారు పడుకొని వున్నారట. మా అమ్మ ఇంకా అలాగే కూచున్నారట. ఏంటమ్మా అలా వున్నావ్. నీవు నాన్నగార్కి బొట్టు పెట్టేవా ఏమిటి. నాన్నగారి మొహం అంతా విభూతి. ఒళ్ళంతా విభూతి. ఏంటమ్మా. అప్పుడు మా అమ్మకి తెలివివచ్చినట్లు అయ్యిందట. చూస్తే ఇంకేంటి- పరుపుమీద, చుట్టుప్రక్కల విభూతి. విభూతి వాసన. అప్పుడు మా తమ్ముడు అన్నాడట. అమ్మా,! మన నాన్నగార్కి మరేమి ఫర్వా లేదు. స్వామీ వచ్చి బాగు చేసారు. మరేం డాక్టర్ అక్కరలేదు నాన్నగార్కి. ఈ గొడవకి డాక్టర్స్ అందరు వచ్చి చూసేరట. (మా నాన్నగార్కి సీరియస్ కండిషన్ కదా. డాక్టర్స్ తరచు వచ్చి చూచేవారు) మళ్ళీ మా నాన్నగార్కి ఎక్స్‌రే తీసారు. ఆశ్చర్యం డాక్టర్స్ అందరు ఆశ్చర్యపోయారు. బ్లడ్ షుగర్, కిడ్నీ, గుండెలో స్పాట్ అన్నీ నిల్. రిపోర్టు ఎంతో బాగుంది. మా నాన్నగారు మామూలుగా అయిపోయారు. పదిరోజులు ఆహారం లేక నీరసం అయిపోయారు తప్పితే ఎప్పటిలా చక్కగా వున్నారు. డాక్టర్స్ అందరు భగవాన్ శ్రీ సత్యసాయి ఫోటో చూసి (అంటే మేము హాస్పిటల్ బీరువా మీద పెట్టుకున్నాది) ఇతని మాహాత్మ్యాన్ని మేము కళ్ళారా చూసేం అని వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. మరి నాలుగు రోజులు పోయాకా మా నాన్నగార్ని డిస్‌చార్జీ చేసినారు. ఇప్పుడు మా నాన్నగారు ఆరోగ్యంగా, క్షేమముగా వున్నారు దీనికి కారణం అంతా కరుణామూర్తి, ప్రేమమూర్తి అయిన శ్రీ సత్యసాయి కదా!

## సర్వకల్మష పరిహార

సీ || రూప రహితుడవై, రూపంబు తో బుట్టి
చాటు చున్నావు, సత్యమిలను
నామరహితుడవై, నామంబుతోనీవు
స్థాపించు చున్నావు ధర్మమిలను
గుణ రహితుండవై, గుణమును కల్గియు
సమకూర్చు చున్నావు, శాంతి నిలను
కర్మ రహితుడవై కర్మలు చేయుచు
వెదజల్లు చున్నావు ప్రేమ నిలను.
తే ॥ గీ ॥ నాటి అవతారముల కన్న, నేటి సత్య
సాయి అవతారమే మిన్న, జగతిలోన
ఏమి నీ దివ్య లీలలో నెరుగ లేము
సర్వ కల్మష పరిహార, శరణు శరణు.

యం. ఆనందరావు.



శ్రద్ధ ఎన్నడూ సలహా కొరకు నిరీక్షించదు.

# నవజాగరణకాలీన ఉత్తర దక్షిణ భారతీయ సమాజము

డా. రామస్వారథ్ మిశ్రా

భారతదేశ చరిత్రమునందు 19వ శతాబ్ది అన్ని విధములా సంపన్నమై ఉన్నది. ఆ కాలమునందు దేశమున రాజకీయ, సాంఘిక మత, సాహిత్య క్షేత్రములందు యుగాంతకారీ మార్పు కలిగినది. 19వ శతాబ్దికి నవజాగరణకాలము అని చెప్పబడినది. ఈ శతాబ్దిలో నూతన చైతన్యము కలిగినది. దానిచే ఉత్తర - దక్షిణ భారత దేశములు ప్రభావితమయ్యెను. పూర్తి భారతదేశము ఒకే జాతి, ఒకే మతము నందు నిబద్ధమైనది. దీనిచే భూత, భవిష్యత్, వర్తమాన కాల పరిస్థితుల నిర్ణయించుటకై యత్నము చేయబడినది. ఆనాటి పాశ్చాత్యుల ఆధిపత్యము సంస్కృతికి వ్యతిరేకముగా ఉద్యమములు ప్రారంభమైనవి. దీనికి ఫలితముగా భవిష్యత్తు భారతీయుల జీవన విధానమునకు మార్గదర్శకులైరి.

ఆ కాలములో ఉత్తర-దక్షిణ దేశమున పూర్వమున్న స్థితి గమనించిన దానియందు మూడు ప్రధాన లక్షణములు కనిపించును. మొదటిది :- చాతుర్వర్ణ విభాగము (ధర్మము, అర్థము, కామము, మోక్షము) దానితో వచ్చిన కుల ధర్మములు. రెండవది:- సమిష్టి కుటుంబవ్యవస్థ మూడవది :- స్వయం సమృద్ధమైన గ్రామ జీవితము. కులములలో తర తమ భేదములకు క్రైస్తవ మత ప్రచారకుల ప్రచారముతో పెద్ద మార్పు వచ్చినది. క్రొత్తగా వచ్చిన ఉన్నత విద్యా విధానము వ్యక్తి స్వాతంత్ర్యమును సమత్వమును ప్రతిపాదించెను. ఆంగ్ల విద్యా శిక్షితులైన విద్యావంతుల కులవ్యవస్థను దాని వలన వచ్చిన భేదములను ఖండించుచు వచ్చిరి. భోజనములయందును, సాంఘిక కులములలోనూ, కుల మర్యాదలను పాటించుట అసంభవమైనది. కులమును బట్టి తరతమ భేదములను నిర్ణయించు సంప్రదాయము పోవుటకు అప్పటి న్యాయ విధానము పరిపాలనా పద్ధతి విద్యా ప్రణాళికలు మూలభూతములైనవి. కొన్నిచోట్ల వర్ణాంతర వివాహములు కూడ జరిగినవి.

ఈ కాలమునందు సమిష్టి కుటుంబ పద్ధతిలో కూడ చాల మార్పు వచ్చినది. విద్యా వంతులైనవారు ఉద్యోగములు చేపట్టి, వృత్తి కొరకు వేరుగా పోగానే దూరప్రాంతములలో జీవనోపాధికి పోవుటచే సమిష్టి కుటుంబము ఛిన్నాభిన్నములయిపోయెను స్త్రీలకు విద్య, విజ్ఞానము కావలెనని నినాదము వచ్చి స్త్రీలు- పురుషులతో సమానులని వారికి ఒక విధమైన స్వాతంత్ర్యము తెచ్చుటకు ప్రయత్నములు సాగినవి. చాల కాలము వరకు బాల్య వివాహములు, కన్యాశుల్కములు, వృద్ధ వివాహములు జరుగుచుండెను. ఇట్టి సాంఘిక వ్యవస్థ నుండి స్త్రీ పునర్వివాహములు చేయుటకు అవసరము ఏర్పడెను. దీని వలన కూడ సమిష్టి కుటుంబ వ్యవస్థ రాను రాను సన్నగిల్లినది. ఆ కాలమునందు మనదేశములో వివాహ వ్యవస్థ వర్ణవ్యవస్థపై ఆధారపడి ఉండెను. సంపన్న గృహస్థులు బహు భార్యత్వమును, మధ్యతరగతి ప్రజలు ఏక భార్యత్వముగను ఉండెను. సంఘమునందు బాల్య వివాహములు, వృద్ధ వివాహములు, సతీసహగమనములు ప్రబలెను. బాల్య వివాహములచే సంఘమునందు వితంతువుల సంఖ్య పెరిగినది. 19వ శతాబ్దిలో వితంతు వివాహ ఉద్యమములు ప్రారంభమైనది.

శిష్టాచార్యులు దీనిని వ్యతిరేకించిరి. పునర్వివాహితులైన పడతులను కులాచారభ్రష్టులుగా, పతితులుగా భావించి

సమాజమునుండి బహిష్కరించెడివారు. దీనిచే వివాహ వ్యవస్థనందు చాల మార్పు కలిగెను. ఈ సమయమునందు ఉత్తర-దక్షిణ ప్రాంతమున భారతేందు హరిశ్చంద్ర ఇంక కందుకూరి వీరేశలింగంపంతులుగారులు జన్మించి సమాజము నందలి సంప్రదాయ దోషములను నిశితముగా సహేతుకంగా ఖండించి సంస్కరణోద్యమములను ప్రారంభించి సంఘము వారు నవ చైతన్యము కలిగించిరి.

ఉత్తర-దక్షిణప్రాంతములలో ఆ కాలమునందు మతావేశము సన్నగిల్లెను. కాని కుల ధర్మములు మాత్రమే సడల లేదు. మత ధర్మమునందు మానవునికి స్వతంత్రత ఏర్పడెను. కాని మూల ధర్మములను ఆచరించు చుండెను. ఈ ప్రకారముగా శాస్త్ర ధర్మములను గౌరవించుచుండిరి. పాశ్చాత్యుల పాలనతో దేశమునందు క్రొత్త ప్రాతలతో నూతన సంస్కరించి ఉద్భవించెను.

హిందూమతములో ఎన్ని విభేధములున్నను అవి ఆంధ్రదేశమున అభివృద్ధి గాంచినవి. బౌద్ధము, శైవము, వైష్ణవము, అద్వైతము మొదలైనవి అన్నియును పూర్వకాలమునుండి నేటి వరకును ఉత్తర-దక్షిణ ప్రాంతమున ప్రవర్తిల్లుచున్నవి. 19వ శతాబ్దిలో వచ్చిన మత సంప్రదాయములలో క్రైస్తవ మతము ఎక్కువ ప్రభావము చూపినది. ఆంధ్రప్రాంతానికి చెందిన గుంటూరు జిల్లాలో రోమన్ కేథలిక్ మతము వ్యాపకములో నుండెను. వీరికి పోపు మతాధికారి. రోమన్ క్యాథలిక్కులు హైదరాబాదులో ఒక సంస్థను, విశాఖపట్టణములో ఒక సంస్థను స్థాపించి, వారి మత ప్రచారమును సాగించిరి. క్రైస్తవ మత ప్రచారమునకు తెలుగు భాషలో తన ధర్మ గ్రంథములను అనువదించెను. ఆ కాలములో ఈ మత ప్రచారకులుగా మనదేశమునకు విచ్చేసిన విదేశీయులు మన భాష నేర్చుకొని స్వయముగా మత గ్రంథములను అనువాదము చేసి ప్రకటించుచు వచ్చిరి. కలకత్తాలో స్కాచ్ మిషనరీ అలెగ్జాండర్ డఫ్ ఒక నూతన విధానము నవలంబించి దేశీయులున్నత విద్య నేర్చుటకు ప్రోత్సాహించెను. ఈలోగా మిషనరీలు తమ నాగరికత ఆచారములను మన దేశమున పెంపొందింప చేసిరి. వారి విజ్ఞానము మనకు కొంత విశాల దృష్టి, ఉన్నతాదర్శముల నేర్పరచుకొనుటకు దోహదము చేసిన వని చెప్పవచ్చును. వీనికి నిదర్శనములుగా బయలుదేరిన విద్యాలయములు,.రాజకీయ సాంఘిక సిద్ధాంతములు మొదలు పెట్టి వైజ్ఞానిక శాస్త్రీయ పరిశోధనలను చూపవచ్చును.

నూతన విద్యా విధానములో వచ్చిన విశిష్టమైన మార్పులతో మన భాష, మన సాహిత్యము చాల రకములైన క్రొత్త విషయములను సమకూర్చుకొన్నది. ఆనాటి ప్రపంచమున జరిగిన విజ్ఞాన పరిశోధనల ఫలితముగా దేశీయుల భావములే పూర్తిగా మారిపోయినవి. స్టీమరు, విద్యుత్తంతి, టెలిఫోను, సినిమా యంత్రము, కుట్టు యంత్రము, ఫోటోగ్రఫీ, డైనమేటు, రబ్బరు టైరు, బైసికిలు, మోషన్ పిక్చర్ ప్రొజెక్టర్ ఇవి యన్నియును 19 వ శతాబ్దిలోనే వివిధ శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసి అనేక ప్రయోగముల యనంతరము కనిపెట్టిరి. అచ్చు యంత్రములు వచ్చి సాహిత్యమునకు క్రొత్త పోషకులును, క్రొత్త పాఠకులును లభించిరి. విద్యా విధానములో జాతి భేదముల, వర్గతారతమ్యములు, వర్ణవ్యవస్థను పాటించక అడిగినవారికి విద్య ఉచితముగా లభింపజేసిరి. అంతేకాక విద్య చెప్పుటలో రహస్యములు పాటించలేదు. నిషేధములు పెట్టలేదు. అట్లే స్త్రీ పురుషులమధ్య విభేధము చూపక, స్త్రీ పురుషులతోపాటు ఎంత ఉన్నత విద్యనయినను పొందుటకు అవకాశమిచ్చిరి.

సంఘ సంస్కరణ కొరకు ఉత్తరదక్షిణ ప్రాంతములలో బ్రహ్మ సమాజము చాల ప్రబలమైనది. ఇది ఆరంభించిన ప్రవక్త రాజారామమోహనరాయలు. అతను వంగ దేశమునుండి 1828లో దీనికి ప్రాణము పోసెను. దీనికి కేశవ చంద్రసేన్, దేవేంద్రనాథ ఠాకూర్, బిపిన చంద్రపాల్,



*సరియైన ఆలోచన మంచిదే. సరి అయిన ఆచరణ ఇంకా మంచిది.*

హేమచంద్రసర్కారు వంటి వారలు నూతన నిర్వచనము లొసగి నవీన మార్గములలో ప్రచారము గావించిరి

దక్షిణభారతమున దీని ప్రచారము ప్రారంభము చేసిన బ్రహ్మసమాజ నాయకుడు బ్రహ్మానంద కేశవ చంద్రసేనుడు. 1864లో ఈయన మద్రాసుకు విచ్చేసి, బ్రాహ్మ ధర్మమును గూర్చి గంభీరోపన్యాసములు చేసిరి. అప్పుడు వారి ఉపన్యాసములు రాజగోపాలాచారి, సుబ్బరాయలు సెట్టి అను యువకులను ఆకర్షించినవి. వారి తరువాత శ్రీధరన్ నాయర్ అను యువకుడు వంగ దేశమునకుపోయి చూచివచ్చి 1871లో దక్షిణభారత బ్రహ్మసమాజమును స్థాపించెను. 1881లో పండిత శివనాథశాస్త్రి విచ్చేసి బ్రహ్మ మత ప్రచారము గావించెను. ఆంధ్ర దేశమున రఘుపతి వేంకటరత్న మునాయుడు బ్రహ్మ ధర్మదీక్ష బూనెను. దీనికి తరువాత వీరేశలింగం పంతులు దోహదము చేసిరి.

ఉత్తర ప్రాంతములో భారతేందు హరిశ్చంద్రగారు ఆంధ్రప్రాంతంలో వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణము కొరకు పూర్తిగా పనిచేసెను. వారిద్దరు తమ సాహిత్యము ద్వారా సమాజములో సంస్కరణ ఉద్యమము ప్రారంభించిరి. వీరేశలింగం పంతులుగారు పూర్తిగా బ్రహ్మ సమాజి. బ్రహ్మ సమాజానికి నియమాలు అనుసరించి సంఘంలో ప్రసరించిరి.

స్వాతంత్ర్య నివాసులైన భారతీయులపై పాశ్చాత్యులకు ద్వేషభావము ఏర్పడెను. అందుచే వారు నీతిలేని శాసనములచే పరిశీలింపసాగిరి. దీనికి క్రుద్ధులై భారతీయులు వ్యతిరేక ఉద్యమములను ప్రారంభించిరి. పత్రికల ద్వారా ప్రదర్శన ముద్వారా నిరసన తెలియచేయుచుండిరి. ఇటువంటి సందర్భమున ఉత్తర-దక్షిణ భారతదేశములందు అభేద భావముతో నూతన చెతన్యము వెలివిరిసినది.

(131వ పేజీ తరువాయి)

పంపుతుంది. అందుకోసం ఆమె అడిగిన ఆళ్ములను కడకు ముక్కు ముంగెర సైతం ఇస్తుంది. శ్రీకృష్ణుని రప్పించుకొని పునఃకలహించి మాధవి మంచి మాటలతో స్వామికి బంగారు పూవులతో పూజ చేస్తుంది. ఇదీ కథాంశం. మధుర భక్తికి నిలయమైన ఈ భామాకలాపంలోని విప్రలంభ శృంగారం పతాకస్థాయికి చేరింది. భామాకలాపం ఆపాత మధురమైన సంగీతం, ఆలోచనామృతమైన సాహిత్యం నయనానందకరమైన నాట్యముల కలయిక. భక్తిని, రక్తిని, సంగీత, సాహిత్య నాట్యములతో మేళవించి శ్రీ కృష్ణుడు నృత్యగానాలకు వశం వదుడని సిద్ధేంద్రయోగి నిరూపించాడు.

భామాకలాపమందు నాట, మోహన, ఆహిరి, సౌరాష్ట్ర, ఆరభి, ఆనందభైరవి, ముఖారి, ఖమానే, శంకరాభరణము, మధ్యమావతి, తోడి, హిందోళ, కాంభోజి, భైరవి, పంతువరాళి, హంసధ్వని మొ.గు సుప్రసిద్ధ కర్ణాటక రాగము లుపయుక్తములైనవి.

భామాకలాప మందలి సత్యా వేదనలో సిద్ధేంద్రయోగి దృశ్యమానుడౌతాడు. ఇందలి భగవద్భక్తితో భగవత్ సాన్నిధ్యం, తదైక్యం పొందినది వాస్తవంగా సత్య కాదు-సిద్ధేంద్రయోగియే. తాను ప్రకృతియై సత్యభామ రూపాన పురుషునారాధించి తదైక్యం చెందాడీ యోగిపుంగవుడు.ఈ మనోహర దృశ్య కావ్యాన్ని దరువులు, పదాలు అభినయ ప్రధానమైన సాహిత్యంతో కూచిపూడి కళాకారులు అతి రమణీయంగా ప్రదర్శిస్తారు. సిద్ధేంద్రయోగి తన భామకు ఏ శుభముహూర్తాన రూపు సంతరింపజేసి కాలికి గజ్జె కట్టెనో గాని ఆ చరణ కింకిణులు నాటి నుండి నేటివరకు సామాజిక హృదయారవిందాలకు విందొనగూర్చుచు పండిత పామర జనరంజకమై అలరారుతోంది.

# విదేశాలలో వినాయకుడు

వినాయకుడు హిందువుల ఆరాధ్య దైవము అయినప్పటికీ, ముస్లీం దేశమైన పశ్చిమ ఇరాన్‌లోని 'లూరిస్తాన్' లో పురావస్తు పరిశోధనల శాఖ త్రవ్వకాలు జరుపగా మహమ్మద్ ప్రవక్త పుట్టుక ముందు నాటి శిధిలాలలో ఏనుగుతల, తొండమూ, ఓ కిరీటం (ఇరాన్‌వారు ధరించునట్టిది) ధరించి, చేతిలో ఒక 'ఈక కలం' పట్టుకొని, ఉన్నట్టు చెక్కిన గణేశుని విగ్రహం దర్శన మిచ్చింది. ప్రఖ్యాత ఇరాన్ చారిత్రక పరిశోధకుడు 'వాడెన్ బార్జి' (Waden Barge) ఈ అవశేషాలను గుర్తుపట్టి ఇవి క్రీస్తు పూర్వం 1000-1200 B.C. కి సంబంధించినవని చెప్పి నాడు.

ఇటీవల ఆఫ్ఘనిస్తాన్‌లోని గర్దేజ్ (Gardeg) ప్రదేశానికి సమీపంలో పాలరాతి గణేశుని విగ్రహం బయల్పడింది. దీనిని స్థానిక ప్రజలు 'పీర్-పాతన్-నాధీ దర్గా' (ముస్లీం సమాధి) వద్దకు చేర్చి పూజలు చేస్తున్నట్లుగా డా. వి. రామ దాస్‌గారి పరిశోధనలో తేలింది. ఈ ప్రతిమపైన వున్న ప్రాచీనమైన శాసనంలో 'పరమ భట్టారక మహారాజాధిరాజ షాహీ కింగళా' (Shahi Kingala) అనే రాజు కాలంలో 'మహావినాయక' అన్న రాజెవ్వరో, ఎంతకాలం క్రితం పాలించాడో, అసలు ముస్లిం దేశమైన ఆఫ్ఘనిస్తాన్‌లో 'మహారాజా ధిరాజ పరమభట్టారక' (అంటే సూర్యుడు) పేరుగల సంస్కృత నామంలో ఈ రాజు ఎప్పుడుండేవాడో వివరించబడింది.

ఇందులో వున్న 'మహావినాయకుడు' 'అలీఢ పాదము' (అనగా ఒక కాలు ఎత్తి రెండవకాలు జాపి) తో వీరావేశముతో నిలచి వున్నాడుట. ముత్యాలహారము మెడలో ధరించి 'సర్ప యజ్ఞోపవీతము' ధరించి గుండ్రని రింగు కిరీటము శ్రీకృష్ణుడు బాల్యంలో ధరించినట్లుగా వున్నదిట. పులిగోళ్లు కూడా చెక్క బడినాయి.

కాబూల్‌కు పదిమైళ్ల దూరంలో 'షకార్‌ధార్' అనే ప్రదేశంలో మరొక గణేశుని ప్రతిమ దొరికింది. ఇది నాలుగు చేతులతో నిలుచున్న మూర్తి. ఆయన పాదాల వద్ద ఆయుధపురుషులు నిలచివున్నట్లు చెక్కబడి, క్రింద రెండు చేతులూ వారి వైపు (ఆయుధాలు) సాగుతున్నట్లుగా వున్నాయి. కుడివైపు పైచేయిలో పద్మం ధరించి వున్నది.

చైనాలో (ఇప్పటి కమ్యూనిస్టు ప్రభుత్వం రాకముందు) అతిప్రాచీన కాలంనుంచీ, అక్కడ గణపతి దర్శన మిస్తాడు. 'తున్-హుఅంగ్' వద్ద వున్న ఒక కుడ్యంలోని అరక్రింద చెక్కబడిన రాతి శిల్పంలో గణేశుడు ఉన్నాడు. మరొక గణేశమూర్తి Kung Hsien అనే చోట దొరికింది. దీనిపై ఉన్న శిలాశాసనం పరికించగా 531 A.D. కాలం నాటిదని చరిత్ర కారులు భావిస్తున్నారు. అయితే ఈ విగ్రహం అంతకు పూర్వమే చాలాకాలంగా పూజింపబడుతూ వున్నట్లుగా సూచనలు కనిపిస్తున్నాయి. దీనిలో గణపతి పద్మాసనం వేసుకొని కూర్చొని వున్నాడు. దాని క్రింద 'గజములకు పరమేష్టి' (Spirit King of Elephants) అని వ్రాసి ఉన్నది. ఎడమ చేతిలో చింతామణి వున్నది. 'చైనీస్-తుర్కిస్తాన్' లో కూడా అనేక గణేశ విగ్రహాలు లభ్యమైనాయి. 'మెక్సికో'లో అనేక చోట్ల లెక్కలేనన్ని హిందూ దేవుళ్ల విగ్రహాలున్నాయి.



మనిషిలో మానవత్వం లోపిస్తే జాతిలో సమానత్వం లోపిస్తుంది.

Hawit వ్రాసిన పురాతన చరిత్రలో గణపతిని అదృష్టం కోసం మొదటిగా పూజించేవారని తెలుపబడి వున్నది. మధ్య అమెరికాలో దొరికిన తాళపత్రాలలో పొట్టి తొండం వంకర తిరిగి, నెలవంకగా వున్నట్లుగా గణేశుడు చిత్రించబడ్డాడు.

థాయిలాండ్‌లో దొరికిన గణపతి చాలా ముద్దుగా కూలబడి వున్నట్లు చెక్కబడినాడు. బాంకాక్ లోని హిందూ దేవాలయంలో వున్న విగ్రహం కంచుతో చేయబడినది. కాళ్లు బాసీపట్టులో కూర్చొన్నట్లుగా కాక, ఒక అరికాలికి ఇంకొక అరికాలు ఆన్చి అభిముఖంగా వచ్చేటట్లు కూర్చొన్నట్లుగా ఉన్నది. భుజాన నాగయజ్ఞోపవీతము, ఎడమ చేతిలో 'మోద కము' (కుడుము), కుడిచేతిలో విరిగిన దంతము పట్టుకొని నాలుగు భుజాలు కలిగిన మూర్తి ఇది. ఈ విగ్రహంలో కన్నులు అరమోడ్చి యోగసమాధిలో వున్నట్లు చెక్కబడింది. వెనుక నున్న రెండుచేతులలో ఒకదానిలో పరశువూ, రెండవ దానిలో పాశమూ వున్నాయి. ఈ విగ్రహంలో వున్న విశేషం ఏమిటంటే గణేశుడు కూర్చొన్న సింహాసనం అడుగున ఎని మిది పుర్రెలు వున్నట్లుగా చెక్కబడినాయి. ఈ కపాలముల (పుర్రెలు) ప్రక్కన సర్పములు చెక్కబడినాయి. నేపాల్‌లో అశోకుని కుమార్తె ఒక ఆలయం కట్టించింది అది బౌద్ధ సంబంధమైన దేవాలయమైనప్పటికీ గణేశుడి పేరునే ప్రతిష్ఠ చేయబడింది. దీనిని బట్టి బౌద్ధులు కూడా గణపతిని పూజించేవారని తేటతెల్లమవుతున్నది. ఇక్కడ గణేశుని నడుముకు నాగబంధం కట్టబడి, తలపైన శేషుని పడగలు పట్టినట్లు చెక్కబడింది. అందులో శివునివలె, నటరాజుగా తాండవం చేస్తున్నట్లున్నది. జావా లోని అమ్‌స్టర్‌డామ్, లైడన్ లోని మ్యూజియంలలో గణపతి విగ్రహాలు కనిపిస్తాయి. ఇక్కడి గణపతి విగ్రహాలు కపాలములు ధరించో, పుర్రెలు కూర్చబడిన ఆసనంలో కూర్చొన్నట్లుగా వుంటాయి. జపాన్‌లో అనేకచోట్ల గణపతి స్పష్టమైన ఏనుగుతలతో కనిపిస్తాడు. జపానీయులు ధరించే బట్టలు, అలంకారములలో దర్శనమిస్తాడు గణపతి. అనేక దేవాలయములలో గణపతి నవ్వుతున్నట్లుగా, నిలబడి వున్నట్లుగా, అరచేతులు కలిగి, మూడు నేత్రములతో, మూడు శిరస్సులతో వున్నట్లు అనేక విగ్రహాలు కనిపిస్తాయి. జపానులో 'వజ్ర వినాయక మూర్తి' చేతిలో వజ్రం ధరించినట్లు చెక్కబడింది KAKU-ZEN-CHO అన్న చోట రాజు ఫోజులో చెక్కబడిన జపనీస్ గణపతి చేతిలో ఒక రాజదండం, ఇంకొక చేతిలో ముల్లంగి దుంప, ఖడ్గం, వజ్రాయుధం పట్టుకొన్నట్లుగా మలచబడింది. జపాన్‌లో అనేక హిందూ దేవతల శిల్పాలు స్పష్టంగా ఈనాటికీ మనం చూడవచ్చును.

దీనిని బట్టి మన ప్రాచీన సంస్కృతి, ధర్మం, మతం కేవలం మన భారతదేశంలోనే పుట్టి వృద్ధి చెందిన స్థానిక మైనది కాదని స్పష్టమవుతున్నది. ఈనాడు హిందూమతం అని చెప్పబడే మన ప్రాచీన సనాతన ధర్మం ప్రపంచం అంతా వ్యాప్తి చెందిన 'ప్రపంచ మతం' (Universal Religion) అన్న సత్యం అందరూ అంగీకరించక తప్పదు. యావత్ ప్రపంచానికి ధర్మ బిక్షను ప్రసాదించిన వేద సంస్కృతికి మనం వారసులం. మన మహర్షులు జగద్గురువులు. మన ధర్మం ప్రపంచ ధర్మం. మన సంస్కృతి ప్రపంచ సంస్కృతి, మన వేదాలు ప్రపంచానికి తలమానికలు. కనుక మనలో దురదృష్ట వశాత్తు ఈ మధ్యకాలంలో ఆవరించిన సంకుచిత స్వభావాలకు తిలోదకాలిచ్చి విశ్వశాంతికి నడుం కడుదాం.

## కన్ను

శరీరావయవాల్లో కన్ను అద్భుతమైనది. చీకటిలో కన్ను చురుకుదనం లక్షరెట్లు ఎక్కువ అవుతుంది. క్రొవ్వొత్తి వెలుగులో వెయ్యోవంతు కంటే తక్కువ ప్రకాశవంతంగా వున్న చిన్న వెలుగును కూడా కళ్లు చూడగలవు.

మనము నూటికి 90 పనులు కండ్ల సహాయంతోనే చేస్తుంటాము. తగినంత ఎత్తున నిలబడి వుంటే 30 మైళ్ళ దూరాన వున్న వస్తువులను చూడగలం. ఆశ్చర్యంగా లేదు! కానీ ఇది నిజం. కన్నీరు ముక్కుకు ఇరువైపులా, కళ్ళకు దగ్గరగా క్రియ ఆపరేటస్ గ్రంథులు ఉంటాయి. అవి కన్నీటిని సృష్టిస్తాయి



*ధర్మంతో సంబంధంలేని అర్థకామాలు అనర్థ హేతువులు.*

# శ్రీ శివ దర్శనము

— శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ

**తవ తత్త్వం న జానామి**
**కీ దృశోసి మహేశ్వర**
**యా దృశోసి మహాదేవ**
**తా దృశాయ నమోనమః**

ఓ మహేశ్వరా, నీవెటువంటి వాడవో ఆ తత్త్వం నే నెరుగను. (ఎరుగజాలను) ఓ మహాదేవా, నీవెట్టివాడవై వున్నావో అట్టి నీకు నమస్కారము

ఇదీ ఉత్తమోత్తమ విద్వద్భక్తుడైన పుష్పదంతుడు తన శివమహిమ్నస్తోత్రంలో తేల్చిన చివరిమాట. పుష్పదంతు డంతటి వాడికే శివతత్త్వం అంతుపట్టకపోతే- ఇంకెవరికి అంతుబడుతుంది? నిజానికి, ఇది ఆశ్చర్యం కాదు. శివతత్త్వం గురించి ముచ్చటించవలసి వచ్చేసరికి వేదాలే భయపడి వణుకుతాయట!

**"యతో వేద వాచో నివృత్తా మనోభిః**
**సదా నేతి నేతీతి యత్తా గృణంతి"**

అన్నారు గదా, మరి.

వేదాలూ, ఆ వేదాలను తపోదృష్టిచేత అంతర్నేత్రంతో దర్శించిన మంత్రద్రష్టలయిన మహర్షుల మనస్సులో గూడా, శివ తత్త్వాన్ని దర్శించగల యెత్తులకు ఎగర లేక, దూరం నుంచే, నిషేధ విధానంతో శివతత్త్వాన్ని చూపించాలని ప్రయత్నం చేస్తాయట! నిషేధ విధానమంటే- ఏది శివుడు కాదో చూపించి- ఇది కాదు- ఇది కాదు (నేతి-నేతి) అని వివరించటం అన్నమాట!

నిజానికి శివ తత్త్వం అంత జటిలమైనది. గ్రహించ నలవికానిది. కాని, శివుడు కరుణాసముద్రుడు కావటంవల్ల, ఆయన తన భక్తులకు అందుబాటులో వుండగల రూపాలను స్వీకరించసాగాడు.

వాటిల్లో మొదటిది అరూపం.

## 1) అరూపము

అరూపము అంటే- రూపం లేనిది. శివుడు స్వీకరించిన రూపం లేని రూపాలలో మొదటిది- మహాకాల స్వరూపం. ఈ ప్రపంచ సృష్టి అంతా కాలంమీదే ఆధారపడి వుందని మనకు తెలుసు ఈ కాలాన్నే ఇప్పటి విజ్ఞాన శాస్త్రం వాళ్ళు 4వ డైమన్షన్ అంటున్నారు. అయితే, ఈ సైంటిష్టులు చెప్పే కాలమంతా- ఏవో కొన్ని గోళాలు, గ్రహాలు తిరగటం వల్ల ఏర్పడుతోంది. ఉదాహరణకు సూర్యుడి చలనంవల్ల మనకు రోజులు, గంటలు ఏర్పడుతున్నాయి. (సూర్యుడి చలనం అంటే- సూర్యుడికి భూమికి ఉన్న తారతమ్య చలనం అన్న మాట). నిజానికి, అసలైన కాలం ఈ గోళాలమీద ఆధారపడి వుండేది కాదు. ఇలాంటి కాలాన్ని "మహాకాలం" అని పిలుస్తారు.



*బుద్ధి, వాక్కు మానవునికి లభించిన రెండు అపూర్వ వరాలు.*

ఈ మహాకాలమే శివుడి మొదటి స్వరూపం. అందుకనే ఆయన్ని మహాకాలేశ్వరుడనీ, కాలకాలుడనీ పిలుస్తారు.

## 2) అరూప రూపము

క్రమేణ, ఇప్పుడు చెప్పుకొన్న అరూపం గూడా గ్రహించటానికి కష్టమయిపోయింది. భక్తులు దీన్నిగూడా అందుకోలేకపోయారు. దాంతో, శివుడు, మనస్సుకే గాక, ఇంద్రియాలకు గూడా అందుబాటులో వుండే రూపం స్వీకరించాలని అనుకొన్నాడు. అందువల్ల ఆయన-జ్యోతిస్స్వరూపం తీసుకొన్నాడు.

ఈ జ్యోతిస్సు కళ్ళకు కనిపిస్తుంది. కాని, అఖండమైనది. అనంతమైనది. కొలతలు లేనిది. ఆకారం లేనిది. అందువల్లే, దీన్ని ధ్యానం చెయ్యటం అంత సులభంగా లేదు. దాంతో శివుడు మళ్ళీ మార్పు చేసుకోవలసి వచ్చింది.

తన అఖండ జ్యోతి స్వరూపాన్ని కొంచెం కుంచించుకొని, ఒక కాంతి కిరణంలాగా, కాంతి స్తంభంగా, తుదీ మొదలూ లేని జ్యోతిర్లింగంగా యేర్పడ్డాడు ఇలాంటి జ్యోతిర్లింగాలను ఆయన మొత్తంమీద 12- (పన్నెండింటిని) భూలోకంలో ఆవిర్భవింపచేశాడు.

ఈ జ్యోతిర్లింగాలు- సరిగ్గా ఈరోజు అంటే- మాఘ బహుళ చతుర్దశి అర్ధరాత్రి 12 గంటలకు- మొట్టమొదటిగా ఆవిర్భవించాయి. అర్ధరాత్రి జ్యోతిస్సు ఆవిర్భవిస్తే యేమవుతుంది? రాత్రే యెగిరిపోతుంది. అదే శివరాత్రి విశేషం. అందుకే మనం ఇంకా ఆ శివరాత్రి ఉత్సవం చేసుకొంటున్నాం.

సౌరాష్ట్రే సోమనాథంచ
శ్రీశైలే మల్లిఖార్జునం... ...

అని శ్రీ ఆదిశంకర పూజ్యపాదులు ఈ జ్యోతిర్లింగాలనే కీర్తించారు.

1. సౌరాష్ట్రం - సోమనాథుడు
2. శ్రీశైలం - మల్లికార్జునుడు
3. ఉజ్జయని - మహాకాలుడు
4. నర్మద - ఓంకారేశ్వరుడు లేక అమరేశ్వరుడు
5. కేదారఖండం - కేదారనాధుడు
6. డాకిని - భీమేశ్వరుడు
7. వారణాసి - విశ్వనాథుడు
8. గౌతమి - త్ర్యంబకేశ్వరుడు
9. చితాభూమి - వైద్యనాధుడు
10. దారుకావనం - నాగేశ్వరుడు
11. సేతుబంధం - రామేశ్వరుడు
12. శివాలయం - ఘోష్మేశ్వరుడు

ఇవీ జ్యోతిర్లింగాలు - 12

ఇవి కొంత ఉపయోగించినై. కాని, ధ్యానం చెయ్యగల శక్తి ఉన్నవారికి మాత్రమే ఉపయోగించినై. పూజలు, అభిషేకాలు వగైరా చేసి, ధ్యానశక్తిని సాధించుకోవలసి ఉన్నవారికి మాత్రం ఈ కాంతి లింగాలు ఉపయోగించలేదు. అందుచేత పైన చెప్పిన 12 చోట్లా శిలా లింగరూపాలను స్వీకరించాడు పరమశివుడు. అంతేగాక- ఈ శిలాలింగాలలోనే- పంచభూతాల ప్రధానాంశలతో- పంచభూత లింగాలుగా గూడా ఆయన ఆవిర్భవించాడు. అవే --

1. శ్రీకాళహస్తిలో వాయులింగం
2. జంబుకేశ్వరంలో జల లింగం
3. చిదంబరంలో ఆకాశ లింగం
4. అరుణాచలంలో అగ్నిలింగం
5. కాంచీపురంలో భూమిలింగం



*సాధన క్షేత్రంలో కర్షకుడిలా నీవు శ్రమ పడితేనే గాని నీకు సిద్ధి కలుగదు.*

ఇలా పలుచోట్ల లింగాలు ఆవిర్భవించటం వల్ల - చాలా మందికి కొంత ఉపకారం జరిగింది. రూపంలేని శివుడికి ప్రతీకగా ఒక రూపం ఏర్పడింది. కాని, ఈ రూపానికి మానవులకు ఉన్నట్లుగా తలా, కాళ్ళూ వగైరా అవయవాలు లేవు. ఏ అవయవాలూ లేకపోతే- అదేం రూపం? అందువల్లే దీన్ని అరూప రూపం అన్నారు. అంటే- రూపం లేని రూపం అన్నమాట.

### 3) సరూపము

ఒక విధంగా చూస్తే, భగవంతుడి రూపం అనేది మానవుడు తన బుద్ధితో తానే చూసుకొనే ఒక వింత ప్రతిబింబం మాత్రమే. అందువల్లే - దేవుడికి యిప్పుడూ తనను పోలిన రూపాన్ని యివ్వాలని చూస్తాడు మనిషి.

దానికీ ఒప్పుకున్నాడు శివుడు. ఎంత ఒప్పుకొన్నా తన రూపంలో తన దివ్యత్వాన్ని కొంత చొప్పించనే చొప్పించాడు శివుడు.

మానవ శరీరంలో ముఖ్యమైన భాగం- శిరస్సు, ముఖమూను. మనిషికి ఒకటే ముఖం వుంటుంది. అంటే- వాడు ఒకవైపే చూస్తాడు. ఒకవైపే నడుస్తాడు. కాని శివుడలా కాదే- అన్నివైపులా ఒకేసారి చూస్తాడు. అన్నివైపులా ఒకేసారి నడుస్తాడు. అంటే- శివుడి ముఖాలు అన్నివైపులా అనంతంగా ఉన్నాయన్నమాట. దీన్ని సూచించేందుకే - శివుడు - పంచముఖరూపం స్వీకరించాడు. అంటే- నాలుగు దిక్కులా నాలుగు ముఖాలు- పైకి ఒక ముఖం ఉన్నాయంటే- అన్ని రకాల దిక్కుల్లోనూ ముఖం వుందన్న మాట. అంటే అనంత ముఖాలు వున్నాయి అని చెప్పేందుకు- ఈ ముఖాలు సంకేతం అన్నమాట. అడుగువేపుకు శరీరం వుంటుంది గనుక- వేరే ముఖం చూపించనక్కరలేదు.

ఈశ్వరుడి అయిదు ముఖాలకు వేరే ఆకారాలు, ఆభరణాలూ ఉన్నాయి. వీటివల్ల ఆయన చేసే వేరే వేరే పనులు సూచన చేయబడుతూ వుంటాయి.

1 సద్యోజాత ముఖము
2. అఘోర ముఖము
3. వామదేవ ముఖము
4. తత్పురుష ముఖము
5. ఈశాన ముఖము

అనేవి యీ ఐదు ముఖాల పేర్లు. మహాన్యాసంలో ఈ ముఖాలను విస్తారంగా వర్ణించారు.

ఇలా స్పష్టమైన రూపం వచ్చింది గనుక, ఈ రూపాన్ని "సరూపం" అన్నారు పెద్దలు. (మానవుడితో సమానమై రూపం- అన్నమాట)

### విరూపము

అరూప శివుడు సరూప శివుడయ్యే సరికి- ఆ సరూపంలో- కొంచెం విరూపంగూడా మేళవించందే వూరుకోడు శివుడు. విరూపం- అంటే రెండర్థాలున్నాయి 1.విరుద్ధమైన రూపమనీ 2. విశేషమైన రూపమనీ. శివుడు రెండర్థాలనూ నిజం చేస్తాడు. చూడండి.

### త్రినేత్రుడు

మనుష్యులకు రెండు కళ్ళయితే- శివుడికి కనుబొమ్మల మధ్యలో మూడో కన్ను వుంది. ఈ మూడో కన్ను శివుడికి ప్రత్యేక చిహ్నం. అందువల్లె ఆయనకు త్రినేత్రుడని పేరు.

సంకేత పరంగా చూసినప్పుడు - ఈ మూడవ కన్ను జ్ఞానానికి గుర్తు. స్వచ్ఛమైన జ్ఞానం అన్ని రకాల భ్రాంతులనీ

పోగొడుతుంది. ఈ ద్వంద్వ ప్రపంచమంతా అజ్ఞానం వల్ల కలిగిన భ్రాంతి మాత్రమే. అందువల్ల యీ మూడో కన్ను తెరుచుకుంటే- అజ్ఞానం తొలగిపోయి దానితోపాటు అజ్ఞానం వల్ల పుట్టిన యీ ప్రపంచం అంతా ఎగిరిపోతుంది. దహించుకు పోతుంది. అందువల్లే, యీ మూడవ నేత్రాన్ని అగ్నినేత్రం అనిగూడా అన్నారు.

## నాగభూషణుడు

ఆయన ఆభరణాలు పాములట. పాము అంటే- యోగ శాస్త్రంలో చెప్పిన కుండలినీ శక్తి అన్నమాట. అది ఆయనకు వశమై వుంటుందన్నమాట.

## గంగ - చంద్రుడు

ఇవి రెండూ ఆయనకు తలమీది అలంకారాలు. గంగ అంటే శాంతి- చంద్రుడు అంటే ఆనందం- అని సంకేతాలు.

## అర్థనారీశ్వరుడు

ఆయన శరీరం నిట్టనిలువుగా ఆయన భార్య ఆక్రమించేసుకొన్నది. అంటే- పురుష శక్తుల, స్త్రీ శక్తుల సమీకరణానికి ఇది సూచన అన్నమాట. అంటే- ప్రపంచంలోని అన్ని రకాల ద్వంద్వాలూ ఇక్కడ సమత్వాన్ని పొందుతాయన్నమాట. ఇవన్నీ ఒక రకమైన విరూపాలు. అంటే, లోకసామాన్యానికి విరుద్ధంగా వుండే రూపాలు. ఇక ఆయన విశేష రూపాలు కొన్ని చూద్దాం.

## అష్టమూర్తి

అష్టమూర్తి అంటే- ఎనిమిది రూపాలు అని అర్థం.

గృహమేధీ సూర్యచంద్రౌ
భూతానాం పంచకం తథా ।
అమూర్తేః పరమేశస్య
మూర్తయోష్టౌ ప్రకీర్తితాః ॥

పంచభూతాలు ఐదు, సూర్యచంద్రులిద్దరు, మంచి గృహస్థు - యెనిమిదీ ఆయన అష్ట మూర్తులట.

## ఏకాదశ రుద్రులు

శివుడి అవతారాలు ప్రధానంగా పదకొండు. వాళ్ళే ఏకాదశ రుద్రులు-

"నమస్తే అస్తు భగవాన్ విశ్వేశ్వరాయ
మహా దేవాయ, త్రియంబకాయ, త్రిపురాంతకాయ,
త్రికాగ్ని కాలాయ, కాలాగ్ని రుద్రాయ, నీలకంఠాయ,
మృత్యుంజయాయ, సర్వేశ్వరాయ, సదాశివాయ,
శ్రీమన్మహాదేవాయ నమః

అనే మంత్రంలో వున్నవారే ఏకాదశ రుద్రులు. పురాణాలలో ఏకాదశ రుద్రుల పేర్లు మరోవిధంగా గూడా వున్నాయి. అంటే, వేరు వేరు కల్పాలలో వేరే వేరే పేర్లు వున్నాయన్నమాట.

ఇలాంటివన్నీ శివుడి విశేష రూపాలు.

## గురురూపము

నిజానికి శివుడి రూపాలన్నింటిలోకి ముఖ్యమైనది గురురూపము. గురుగీతలో - "శ్రీ గురుశ్శివ ఏవసః" అని పదే పదే నొక్కి చెప్పారు. ప్రతి మానవుడినీ ఉద్ధరించేందుకోసం- ఆ శివుడే ఆయా వ్యక్తుల గురువుల రూపంలో వ్యక్తం అవుతూ వుంటాడు. సరియైన సమయంలో అందించవలసిన ఉపదేశం అందిస్తూ వుంటాడు. అందుకనే - శివుడు లక్షా పాతికవేల ధ్యాన విధానాలను ఏర్పరచి వుంచాడట.

సదాశివోక్తాని సపాదలక్ష

లయావధానాని వసంతి లోకే-

అన్నారు శంకరాచార్యులవారు.

ఈ గురురూపంలోంచి- మొదటగా శివుడు మనకు సరూప, విరూపాలు అందిస్తాడు. తరువాత మెల్లిగా అరూప రూపానికి దారిచూపుతాడు. దాని ద్వారా చిట్టచివరి అరూపాన్ని అందిస్తాడు. శ్రీ దత్తాత్రేయుడు మీకందరికీ- ఆ చిట్ట చివ్వరి శివ దర్శనం అయ్యేలాగా అనుగ్రహించుగాక.

జయ గురు దత్త.

## ఉత్తిష్ఠత ! జాగ్రత్త ! ప్రాప్యవరాన్ని బోధత !

"లేవండి ! మేల్కొనండి లక్ష్యము సాధించువరకు విశ్రమించకండి ! నాయనలారా ! కావాల్సింది ఇనుప కండలూ, ఉక్కు నరాలు, వజ్రకఠోరమైన మనసు, శక్తి, సామర్థ్యం, పౌరుషం, క్షాత్రవీర్యం, బ్రహ్మతేజం కావాలి."

"నేడు కావాల్సింది జీవితాన్ని సుఖోద్యానవాటికగా భావించే ప్రేమకలాపి కాదు జీవన సంగ్రామ రంగంలో మహాయోధుడై నిలువ గలిగిన వీరుని ఆదర్శం. ప్రస్తుత పరిస్థితులలో శ్రీకృష్ణుని దివ్య క్రీడలు నీకు ఉపకరించవు. మురళిని మ్రోగించి నందున దేశం ఉద్ధరింపబడదు. అద్భుత రాజసిక తేజము, ఆపాదమస్తకము తొణికిసలాడే ఒక మహావీరుడు, సత్యాఅన్వేషణకై, తెగించి ప్రాణాలొడ్డగల ధీరుడు, త్యాగమే ధనస్సుగా, విజ్ఞానమే కరవాలముగా కలిగిన వీరుడు నేడు మనకు ఆదర్శమై నిలవాలి".

"ధీరవత్సలారా! మీరందరూ మహత్కార్యాలు సాధించడానికి జన్మించామనే విశ్వాసం కలిగి ఉండండి. కుక్కపిల్లల అరుపులకు భయపడరాదు. ఆకాశం నుండి విరిగిపడే పిడుగులకైనా చలింపరాదు".

" సోదరులారా! మనం కష్టించి పనిచేయాలి. ఇది నిద్రించతగిన సమయం కాదు. మనపై భవిష్య భారతావతరణం ఆధారపడి వున్నది. ఆ తల్లి మనకై నిరీక్షిస్తున్నది. ఆమె ప్రస్తుతం నిద్రిస్తున్నది. అంతే, లేచి మేల్కొనిపునరున్మిషిత జీవనంతో, అపూర్వ యశంతో విరాజిల్లేట్లు విజృంభించి మన మాతృదేవిని తన శాశ్వత సింహాసనంపై అధిష్ఠింప జేయండి !"

" భారతవర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికతయే నశిస్తుంది. నైతిక సమగ్రత సాంతం నశిస్తుంది. వీనికి బదులుగా కామ భోగములే స్త్రీ పురుష దైవములవుతాయి. ధనమే వీటికి పురోహితుడు, వంచన, బలత్కారత వీటికి పూజలు, మానవాత్మయే బలి అవుతాయి. అది జరుగరాదు".

" నాయనలారా ! ఈ సందేశాన్ని మీరు ప్రపంచానికి చాటగలరాఅ అప్పుడే ఈ సమస్త విషాదము, విచారము, పాపము మటుమాయ మవుతాయి. దుర్బల భావాలు మచ్చుకైనా కన్పించవు. ఈ అద్భుతమైన మార్పును దర్శించండి. మీరు సర్వ శక్తివంతులు. ఫిరంగుల ముఖంలోనికి చొరబడటానికి కూడా భయపడకండి. " లెండు ! మేలుకొనుడు! గమ్యస్థానం చేరువరకు వెనుక చూపులేక యుండుడు".

**AWAKE! ARISE! STOP NOT,**
**TILL THE GOAL IS REACHED.**

---- స్వామి వివేకానంద



*లక్ష్యాన్ని మరచిపోక పోవడమే విజయానికి కీలకం.*

శ్రీవాణి శత సంచిక మహోత్సవాలకు మా శుభాకాంక్షలు

# శ్రీ చౌడేశ్వరి
## చేనేత సహకార ఉత్పత్తి విక్రయ సంఘం లిమిటెడ్
## No. H. W. 1
## మల్లవోలు
(గూడూరు మండలం, కృష్ణాజిల్లా)

మెంబర్ల సంఖ్య : 131 స్థాపితం : 1973

| | | |
|---|---|---|
| మెంబర్ల షేరు ధనం | : | రు. 3,03,665 |
| గవర్నమెంటు షేరుధనం | : | రు. 39,430 |
| సాలుసరి ఉత్పత్తి | : | రు. 34,77,106 |

మా సంఘములో 100, 80, 60 నెంబర్లలలో చేనేత చీరెలు
నూతన డిజైనులలో, పక్కా రంగులలో సరసమైన ధరలకు లభించును.
గాన మా సంఘమునకు విచ్చేసి చేనేత చీరెలు ఖరీదు చేసి
చేనేతను ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాము.

బూసం సుబ్బారాయుడు
మేనేజరు

పిచ్చుక నాగేశ్వరరావు
ప్రెసిడెంటు

కుర్మా హేమ సుందరరావు
వైస్ ప్రెసిడెంటు

డైరెక్టర్లు :

బూసం గోవర్ధనరావు    బూసం ఈశ్వరలింగం    షేక్ హుస్సేన్
పిచ్చుక సోమసుందరరావు    పిచ్చుక నాగేశ్వరమ్మ    నల్లా శ్యామలాంబ




# Kennedy High School

**SIRI NAGAR**

**M. G. ROAD**

**VIJAYAWADA - 520 007**



PRINCIPAL

**N. ESWARA PRASAD**

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు

Phone : 28

**ది పోలవరం మహాత్మాజీ వీవర్సు కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్ సొసైటీ లిమిటెడ్, No. H. 108**

**పోలవరం - 521 162**

(గూడూరు మండలం, కృష్ణాజిల్లా) ఆంధ్రప్రదేశ్

పిచ్చుక దుర్గా నాగేశ్వరరావు
ప్రెసిడెంటు

బూసం భువనేశ్వరరావు
వైస్ ప్రెసిడెంటు

డైరెక్టర్సు :

పిచ్చుక గంగకోటనాగశ్యామలరావు   కారుపర్తి కాంతారావు   పిచ్చుక తేజోలింగం

అర్జా శ్రీనివాసరావు   నక్కిన బాలకోటేశ్వరరావు   బూసం లీలావతి

మేనేజర్ : చిలంకుర్తి సుబ్బారావు

మావద్ద 60, 80 మరియు 100 నెంబర్లలలో సాదా మరియు బందరుపేట, డాక్-పేటు, చీరలు నాణ్యమైనవి ఉత్పత్తి అగుచున్నవి. "మా సొసైటీని సందర్శించండి"

---

"శ్రీవాణి" శత సంచిక సందర్భముగా మీకివే మా శుభాకాంక్షలు

# గోకవరపు రామారావు సన్స్

**ఫోర్టు రోడ్ - మచిలీపట్నం**

మావద్ద నిత్యావసర కిరాణా సరుకులు బాగు చేయించి అమ్మబడును.

స్వచ్ఛమైన నెయ్యి, దీపారాధనకు ఆవునెయ్యి అమ్మబడును.

ప్రొప్రయిటర్

గోకవరపు నాగవెంకట మురళీకృష్ణమూర్తి



# దేహమే దేవాలయం హృదయమే దైవ పీఠం

శ్రీ విశ్వయోగి విశ్వంజీ

భగవంతుడికి పేరు లేదు. ప్రతి జీవిలోవున్న వ్యక్తియే భగవంతుడు. ఆ శక్తిని మనం పూజిస్తున్నాం, ప్రార్థిస్తున్నాం. ఆయన సర్వవ్యాపకుడు. అంతటా నిండి ఉన్నవాడు. పదహారు కళలు గల ప్రేమావతారంగా శ్రీకృష్ణుని రూపంలో ద్వాపరయుగంలో అవతరించాడు. ఇపుడు మరల ఆ ప్రేమ మూర్తి శ్రీ సత్యసాయిరూపంలో దర్శనమిస్తున్నాడు. ఆ సాయి భగవానుడు ప్రేమతత్త్వాన్ని పంచిపెడుతూ ప్రపంచ వ్యాప్తంగా మేధావులను ఆకర్షిస్తున్నాడు.

ఈ యావత్ ప్రపంచంలో దివ్య శక్తి ఒకటి నిండి ఉన్నది. అదే అన్నిటినీ త్రిప్పుతున్నది. అది సర్వశక్తి వంత మైనది. సర్వత్రా ఉన్నది. సర్వమూ తానే అయినది. అదే శక్తి ప్రతి ప్రాణిలోనూ, ప్రతి మనిషిలోనూ ఉన్నది. అదే శక్తి పరమాణువులో గూడా ఉన్నది. ఈ సత్యాన్ని మానవుడు గ్రహించక భగవంతుడు ఎక్కడో దూరంగా ఉన్నాడని పొర పాటు పడుతున్నాడు. తనతోటి మానవులలో, దేవుడున్నాడని గ్రహించలేక, మనిషిని మనిషిగా ప్రేమించలేక పోతున్నాడు, పైగా ద్వేషిస్తున్నాడు ఇలా ద్వేషించమని సనాతన భారతీయ ధర్మం ఎక్కడా చెప్పలేదు.

## 'విశ్వరూపం సందర్శన మంటే ఏమిటి ?'

ఒక ఆరడుగుల మనిషి తన రూపాన్ని పెంచుకొని, భూమి యావత్తూ ఆక్రమించి, ఆకాశమంత ఎత్తు ఎదిగితే అది విశ్వరూపమా? కానేకాదు! పరమాణువులో ఏదైతే ఉన్నదో, యావత్తు సృష్టిలో అదే ఉన్నది. అణువులో 'న్యూక్లియస్' అనేది ఉన్నది. దాని చుట్టూ ఎలక్ట్రానులు, ప్రోటానులు అత్యంత వేగంగా పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇదే విధంగా సూర్య గోళం చుట్టూ అనేక గ్రహాలు అత్యంత వేగంగా తిరుగుతున్నాయి. విశ్వకుటుంబం యొక్క సూక్ష్మరూపమే పర మాణువు. అనేక పరమాణువుల కలయిక వల్లనే పదార్థం ఏర్పడింది. యావత్తు విశ్వమూ ఇలాగే ఉన్నది. 'నీవు' అనగా ఆ పరమాణువు లోని దివ్యశక్తియే. నీలో అంతా ఉన్నది. అంతటిలో నీవున్నావు. నీవులేని ప్రదేశం లేదు. ఈ సత్యాన్ని గ్రహించండి. సృష్టిలో ఎక్కడైనా అలజడి ఏర్పడితే, అది ప్రత్యణువులోనూ ప్రతిబింబిస్తుంది. పరమాణువును శాంతిం పజేస్తే ప్రకృతిలోని అలజడి తగ్గిపోతుంది. అలా అణు వులలో అలజడిని శాంతపరచడానికే ఏకాదశ రుద్రాభిషేకాలూ, శివలింగానికి అర్చనలూ చేస్తాం. శివలింగం విశ్వానికి సంకేతం కుటుంబం సనాతన ధర్మానికి మూలస్తంభం. వ్యక్తి వికాసం ద్వారా కుటుంబ వికాసం సాధిం చాలి. కుటుంబ సమైక్య కృషి ద్వారా సమాజ వికాసాన్ని సాధించటమే సనాతన ధర్మ లక్ష్యం. ఈనాడు వ్యక్తులు కులాల మతాల పేరుతో పరస్పరం దూరమౌతున్నారు. వీళ్లను ఆధ్యాత్మికత ద్వారా సంఘటితం చేయాలి. ఏక మనస్కులుగా తీర్చి దిద్దాలి. తద్వారా సమాజ వికాసాన్ని సాధించాలి. ఆధ్యాత్మికత ఎల్ల సమాజానికి మేలు కలగాలి.

## "దేహమే దేవాలయం, హృదయమే దైవపీఠం"

ఈ పూజలూ ఆరాధనలూ ఎందుకు ? నీలోవున్న దైవశక్తిని వికసింప జేసుకోవటానికే గాని ఆ భగవంతుడేదో చేసి పెడతాడనికాదు. నీలో వున్న చైతన్య శక్తిని పరమాత్మ శక్తితో అనుసంధానం చేసుకున్నట్లయితే నీవే ఒక శక్తి

కేంద్రంగా మారిపోతావు. ప్రతిమానవునిలోనూ ఇచ్ఛాశక్తి హృదయంలోనూ, జ్ఞానశక్తి మెదడులోనూ, క్రియాశక్తి వెన్నుపూసలోనూ ఉన్నాయి. ఇవే విష్ణు బ్రహ్మ మహేశ్వరులు. వీటి సమైక్యస్థితియే దత్తాత్రేయుడు. ప్రతి వ్యక్తి అత్రి, అనసూయలను ఆరాధించి - అనగా త్రిగుణములకు అతీతుడై, అసూయను విడనాడినట్లయితే భగవచ్ఛక్తి మనకు దత్తమౌతుంది. దత్తాత్రేయుడి స్థితిని పొందటమంటే ఇదే

## ' విగ్రహారాధన ఎందుకు ?'

అని అడుగుతుంటారు. దీనికి వివేకానందుడు ఒక చక్కని ఉదాహరణ చెప్పాడు. మనం పాలు త్రాగాలంటే కప్పులో పోసుకొని త్రాగుతాం కప్పో, గ్లాసో లేకుండా నేరుగా త్రాగటానికి వీలులేదు. ఆ గ్లాసు లాంటిదే విగ్రహం త్రాగిన తరువాత ఆ గ్లాసును దాచిపెట్టి మరొకరికిస్తాం. పగులగొట్టం. దానిని మరల ఉపయోగపెడుతామని చెప్పారు.

భగవత్ శక్తి విద్యుచ్ఛక్తి లాంటిది. దానిని నేరుగా మనం చూడలేం మనం అవసరాన్ని బట్టి రేడియో, టి.వి., ఫ్యాన్, ట్యూబ్‌లైట్లు, బల్బులు వగైరా పరికరాల ద్వారా దానిని ఉపయోగంలోనికి తెచ్చుకుంటాం. అలాగే విగ్రహం అనే ఒక పరిమిత రూపంలో దైవ శక్తిని అవగాహన చేసుకుంటున్నాం.

## "మహిమలనేవి ఉన్నాయా ?"

అని అడుగుతుంటారు. మహిమలనేవి లేవు. జాగ్రత్తగా వినండి. డాక్టర్ రోజూ కొన్ని వందల ఆపరేషన్లు చేస్తాడు ఆవిధంగా సామాన్య మానవులు చేయలేరు. చేయలేని వారికి అలాచేయటం ఒక వింతగాను, ఒక మహిమ (Miracle) గాను అనిపిస్తుంది. ఆపరేషన్లు చేయటం, నేర్చుకున్న డాక్టర్లకు అది సహజంగా కనిపిస్తుంది. డాక్టర్లు ఆపరేషన్లు చేయటం, ఇంజనీర్లు అద్భుతంగా కట్టడాలు నిర్మించడం - వాళ్ల దృష్టికి అది సహజం. మన దృష్టికి అది మహిమ. అలాగే యోగులు నీటిమీద నడుస్తారు వస్తువులు సృష్టిస్తారు అది వారికి సహజం మన మనస్సుకు అలాంటి శిక్షణ యిస్తే మనమూ అలా చేయవచ్చు.

మంత్రం మనిషిని మహాశక్తి కేంద్రంగా చేస్తుంది 'ఓం శ్రీ సాయిరాం గురుదేవ దత్త '. అనే మంత్రాన్ని అందరూ నియమ ప్రకారం ఉపాసించండి. లేదా మీకిష్టమైన మరొక మంత్రం జపం చెయ్యండి. అయితే శ్రద్ధ మాత్రం అవసరం ఎక్కడ సమైక్యత ఉన్నదో అక్కడ దైవీశక్తి ఉంటుంది. అందరం కలసి పనిచేయాలి. మీలోని బలహీనతలను తొలగించుకోవాలి. పరులకు ఎలా ఉపయోగపడతామా? అనే ఆలోచన చేయాలి భారతదేశం 2001 సంవత్సరం నాటికి ప్రపంచానికి మార్గ దర్శకత్వం వహిస్తుంది. అందుకు తగిన సంసిద్ధతను, ఆధ్యాత్మికంగా, భౌతికంగా మన సమాజం సాధించాలి.

సత్ ప్రవర్తన, సదాలోచన లేకుండా చేసే పూజల వలన ప్రయోజనం లేదు. మనుషులలో దేవుడున్నాడు. ఈ జగం మిథ్యకాదు. ఇది పరబ్రహ్మ స్వరూపం. దీన్ని నిర్లక్ష్యం చేయకండి. సమాజానికి ఉపయోగపడేరీతిలో జీవితాలను తీర్చిదిద్దుకోండి * * *

## దమ్యత, దానము, దయ

దమ్యత, దానము, దయ ఈ మూడు మనం అలవరచుకోవలసిన అవశ్య గుణాలు వీటినే 'దకార త్రయము' అంటారు దమ్యత అంటే ఇంద్రియ నిగ్రహము మనలో దైవత్వముంది, మానవత్వముంది, దానవత్వం కూడా ఉంది దానవత్వం నుండి మానవత్వానికి ఎదగాలంటే 'దయ'ను అలవరచుకోవాలి. మానవత్వం నుండి దైవత్వానికి పెరగాలంటే 'దానం' చేస్తూ ఉండాలి. దైవత్వమునుండి ఏకత్వానికి చేరుకోవాలంటే 'దమ్యత' ( ఇంద్రియ నిగ్రహం) పాటించాలి.

--- బాబా



*రూప జ్ఞానం కలిగితే భగవంతుడు రక్షిస్తాడు.*

1. Hom GtoG

# సర్వాంతర్యామి షిరిడీ సాయి బాబా

డా. గుడ్లవల్లేటి వెంకటరత్నం.

భగవంతుడు సర్వాంతర్యామి యని మన వేదములు ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి సమస్త చరాచరములు భగవదంశలే అని నిరూపిస్తున్నాయి. అయితే ప్రతి యుగములోనూ అధర్మము పెరిగినప్పుడు, ధర్మానికి గ్లాని సంభవించినప్పుడు భగవంతుడు ఒక ప్రత్యేకమైన రూపంలో అవతరిస్తుంటాడని భగవద్గీత మనకు బోధిస్తున్నది. అలాంటి అవతారములలో 'షిరిడీ సాయి' అవతారం ఒకటి.

బాబాను కొందరు మహమ్మదీయుడని మరికొందరు బ్రాహ్మణుడని అనుకుంటుండే వారు. ఎప్పుడూ 'అల్లా మాలిక్' అంటూ వుండేవారు. కాని వారు ఉండే మసీదులో నిత్యమూ 'ధుని' వెలుగుతూ ఉండేది. అక్కడ తులసీ బృందా వనం వుండేది. శంఖములు ఊదుట, గంటలు మ్రోగించుట కూడా అక్కడ జరుగుతుండేవి. షిరిడీలో జరుగు ఉత్సవములలో 'శ్రీరామనవమి' యే పెద్ద ఉత్సవం. హిందువుల పండుగలు జరుపటం వలన హిందువులు బాబాను యోగిగా భావించేవారు. మహమ్మదీయులు బాబాను పీరులలో ఒకనిగా భావించేవారు. కొరాహ్లా గ్రామమునందు అమీర్ షక్కర్ అను మహమ్మదీయ భక్తుడు షిరిడీలో చందన ఉత్సవం చేయదలచెను. ఈ ఉత్సవం మహమ్మదీయులలో గొప్ప ఫకీరుల గౌరవార్థం చేయుదురు. షిరిడీలోని మసీదును'ద్వారకామాయి' అని అంటారు. షిరిడీలో అటు మహమ్మదీయుల ఉత్సవాలు, ఇటు హిందువుల ఉత్సవాలు సమానంగా జరిపేవారు. దీనివల్ల మహమ్మదీయులు, హిందువులు బాబాను ఆరాధించేవారు.

బాబా జీవితం అత్యంత పావనమైనది. వారి చర్యలు మిక్కిలి ఆశ్చర్యమును కలుగజేసేవి. వారు కరుణా సముద్రులు సముద్రమువలె లోతుగా, తొణకక, గాంభీర్యముగా ఉండేవారు. తన కోసం ప్రతిదినం భిక్ష ఎత్తేవారు. ఎవరికైనా అన్నం పెట్టాలనుకున్నప్పుడు తానే ఆ ఏర్పాటు స్వయంగా చూచుకొనేవారు. అన్నము ఉడికినది, లేనిది తానే స్వయంగా చూచేవారు. కళాపెళ లాడుతున్న డేగిసాలో తన కఫనీని (చొక్కా) పైకి మడచి, నిర్భయంగా చేయిని పెట్టి కలిపేవారు వంట అయిన తరువాత దానిని మసీదులోనికి తెచ్చి 'మౌల్వీ' తో ఆరగింపు పెట్టించేవారు.

చాలామంది బాబా చదువుకోలేదని, సంస్కృతం అసలు రానే రాదని భావించేవారు. నానాసాహెబ్ చందోర్కరు తానే మహాపండితుడనని గర్వించుచుండేవాడు ఒకనాడు భగవద్గీతలోని ఒక శ్లోకమునకు నానాసాహెబ్ అర్థము సరీగా చెప్పలేకపోతే, బాబా వెంటనే ఆ శ్లోకమునకు అర్థము సంపూర్ణముగా వివరించి అతని గర్వమణచి వేశారు. దీనిని బట్టి విచారిస్తే బాబాకు తెలియనిదేమి లేదని స్పష్టమవుతున్నది.

బాబా తన అవతార కాలంలో సర్వతీర్థములు, సకల దేవతలు తనలోనే ఉన్నాయని, తన సర్వజ్ఞత్వమును, మహిమల ద్వారా పలు పర్యాయములు నిరూపించినారు గంగా, యమునా, సరస్వతి (అంతర్వాహిణి) కలియు చోటుకు 'త్రివేణి సంగమం' అని పేరు. అదే ప్రయాగ. అక్కడ స్నానం చేస్తే పుణ్యమని హిందువుల భావన. దాసగణు అనే భక్తుడు

అక్కడికి పోయి స్నానం చేయవలెనని తలంచి, బాబాను అనుమతి అడిగెను. అప్పుడు బాబా "అంత దూరం పోవలసిన పనిలేదు. మన ప్రయాగ ఇచ్చటనే కలదు. నా మాట విశ్వసింపుము" అని చెప్పి బాబా తన రెండు పాదములను ముందు పెట్టగా, రెండు బొటనవ్రేళ్లనుండి యమునా జలములు కాలువలుగా ప్రవహించినాయి. అప్పుడు దాసగణు బాబా పాదములపై శిరస్సు నుంచి ప్రణమిల్లెను. సమస్త నదులు తనలో ఉన్నాయని బాబా ఈ సంఘటన ద్వారా భక్తులకు ఎరుకపరచెను.

బాబా సర్వజ్ఞత్వమును తెలియపరచే సంఘటన మరొకటి జరిగింది. 1910 సం. దీపావళి రోజున బాబా ధుని వద్ద కూర్చొని చలికాచుకొనుచుండెను. కొంతసేపటికి ఆ ధునిలో కట్టెలను వేయుట మాని, తన చేతిని పెట్టెను. ఆ మంటలో బాబా చేయి కాలిపోవటం చూచిన మాధవుడు, దేశపాండేలు పరుగెత్తుకొని వెళ్లి బాబాను వెనుకకు లాగి 'బాబా! ఇట్లేల చేసితిరి?' అని అడిగిరి. అప్పుడు బాబా వారితో "దూరదేశమున ఒక కమ్మరి భార్య కొలిమి తిత్తులను ఊదుచుండెను. అంతలో ఆమె భర్త పిలువగా, తన ఒడిలో బిడ్డ ఉన్నదనే సంగతి మరచి, తొందరగా లేచి పరిగెత్తెను. అప్పుడు ఆ పసిబిడ్డ మండుతున్న కొలిమిలో పడెను. అందుచేత నా చేతిని కొలిమిలో పెట్టి ఆ బిడ్డను రక్షించితిని" అని చెప్పెను. బాబా సర్వజ్ఞతకు, ప్రేమకు ఇది ఒక నిదర్శనం.

ఒకసారి ఆత్మారామ్ భార్య షిరిడీలో ఒక ఇంటికి వెళ్లినది. అక్కడ అందరికీ భోజనాలు వడ్డించారు. ఇంతలో ఆకలితో నున్న కుక్క ఒకటి వచ్చి మొరగటం మొదలుపెట్టింది. దానిని చూచిన ఆత్మారామ్ భార్య లేచి ఒక రొట్టె ముక్కను విసరెను. ఆ కుక్క ఎంతో మక్కువతో తిని వెళ్లిపోయెను. ఆ సాయంకాలం ఆమె బాబా వద్దకు వెళ్లగా "తల్లీ! నాకు కడుపు నిండా భోజనం పెట్టినావు. నా జీవశక్తులు సంతుష్టి చెందినవి. ఎల్లప్పుడూ ఇట్లనే చేయుము. ఇది నీకు సద్గతి కలుగ జేయును. మొదట ఆకలితో నున్న జీవికి భోజనం పెట్టిన పిమ్మట నీవు భుజింపుము దీనిని జాగ్రత్తగా జ్ఞప్తి యందుంచుకొనుము" అనెను బాబా. ఆమెకేమీ బోధపడలేదు. "బాబా! నేను నీకెట్లు భోజనం పెట్టగలను? నా భోజనం కొరకు ఇతరులపై ఆధారపడి యున్నాను" అని అనగా, అప్పుడు బాబా "నీవిచ్చిన ప్రేమపూర్వకమైన ఆ రొట్టెముక్కను తిని, యిప్పటికీ త్రేనుపులు తీయుచున్నాను. నీ భోజనానికి పూర్వం, ఏ కుక్కకు రొట్టెపెట్టితివో అదియూ నేను ఒక్కటే. సమస్త జీవరాసులన్నీ నా అంశలే. నేనే వాని యాకారములలో తిరుగుచున్నాను. ఎవరైతే జీవకోటిలో నన్ను చూడగలుగుదురో, వారే నా ప్రియభక్తులు" అని పలికిన బాబా మాటలు విని ఆమె నేత్రములు కన్నీటితో నిండెను.

ఒకసారి మామలత్‌దారు తన స్నేహితుడైన ఒక డాక్టర్‌తో షిరిడీకి వచ్చెను. ఆ డాక్టరు తన దైవము శ్రీరాముడనియు, తాను ఒక మహమ్మదీయునకు నమస్కరించనని చెప్పెను. అచట ఎవరికీ నమస్కరించనవసరం లేదని, తనతో కలిసి కాలం గడుపుటకు రమ్మనమని మామలత్‌దారు కోరెను. వారిరువురు బాబా వుండే మసీదుకు వెళ్లి బాబాను చూచి చూడటంతోనే ఆ డాక్టర్ బాబాకు నమస్కరించెను. అక్కడ అందరూ ఆశ్చర్యపడిరి. మహమ్మదీయునికి ఎట్లు నమస్కరించితివని మామలత్‌దారు అడిగెను. అప్పుడు ఆ డాక్టరు తన ప్రియమైన శ్రీరాముడు ఆ గద్దె మీద కనిపించటం వలన, వాని పాదములపై బడి సాష్టాంగ నమస్కారం చేసితినని సమాధానం చెప్పెను. ఈ ఉదంతం షిరిడీ సర్వదేవతా స్వరూపుడని స్పష్టమవుతున్నది. సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు, సర్వశక్తివంతుడు, సర్వ దేవతాస్వరూపుడైన షిరిడీ బాబా వారిని నిత్యమూ భక్తి శ్రద్ధలతో ఆరాధించి మన జన్మలను సార్థకం చేసుకుందాం.





మతము, జీవితము రెండు కావు. అవిరెండూ ఒకటే



# ధ్యాన యోగము

స్వామి సుందర చైతన్యానంద

ఆరగించితే ఆకలి తీరుతుంది. ఆహారం ఉంటేనే ఆరగించగలము. ఆహారం కావాలంటే వంట తయారు చేసుకోవాలి. వంట సిద్ధం కావాలంటే ముందుగా వంట సామాగ్రిని సిద్ధం చేసుకోవాలి. మోక్షం కావాలని అందరూ అభిలషిస్తారు. సాధన లేకుంటే మోక్షమెలా లభిస్తుంది? సాధన అందరూ చేయగలరా? వంట సామాగ్రిని కలిగియున్నవారే వంట చేసుకొని ఆరగించగలరు సాధన సామగ్రిని సమకూర్చుకొనిన వారే ధ్యానము చేసి తరించగలరు.

సాధ్య వస్తువైన భగవంతునిపై ప్రీతి యున్నంత మాత్రాన లాభంలేదు. సాధనపై కూడా ప్రీతి యుండాలి. ధనము, బంగారము, పదవులు, పేరు ప్రతిష్టలు చావు వరకే ఉపయోగ పడుతాయి. మరణానంతరము ఉపయోగపడేది సాధన ఒక్కటియే

రాజమండ్రిలోని సుందర సత్సంగ్ సమావేశాలలో స్వామి సుందర చైతన్యానందుల వారు ధ్యాన యోగముమీద ప్రవచించిన విషయాల సారాంశమే ఈ వ్యాసము .

సాధకు డెలా ఉండాలి ? మహాభారతములోని శాంతి పర్వములో భీష్ములవారు ధర్మరాజుకు ఒక కథ చెప్తారు. ఒకానొక సరస్సులో అనేక చేపలు నివసిస్తూ ఉండేవి. వాటి పేర్లు వరుసగా (1) దీర్ఘదర్శి, (2) ప్రాప్త కాలజ్ఞుడు, (3) దీర్ఘసూత్రి. వేసవి కాలము వచ్చినది. సరస్సులో నీరు ఇంకిపోవుచున్నది. ఒకనాడు దీర్ఘదర్శి ఇరువురు స్నేహితులను సమీపించి "మిత్రులారా! మనము వసించే సరస్సులో నీరు తగ్గిపోవుచున్నది. నీరు అడుగంటక పూర్వమే మనము వేరొక సరస్సును చేరుట మంచిది. లేనిచో జాలరికి చిక్కి జీవితమును చాలించుకోవలసి వస్తుంది!" అని హితబోధ చేసింది. " ఎప్పుడో జరుగబోయే దానికి ఇప్పటినుండే జాగ్రత్త పడవలసిన పనిలేదు. జాలరి వచ్చినప్పుడు చూసుకోవచ్చు. అంతగా వలలో పడినచో దానిని ఛేదించుకొని వెళ్ళే ప్రయత్నము చేయవచ్చును," అని ప్రాప్తకాలజ్ఞుడు పలికెను. "ఈ ముచ్చట అసందర్భము, అనాలోచితము జాలరి వచ్చేది లేదు. మనము చిక్కేది లేదు' అన్నది దీర్ఘసూత్రి. మాట వినని మిత్రులను విడిచిపెట్టి దీర్ఘదర్శి మరొక సరస్సులోనికి ప్రవేశించినది. మిగిలిన రెండు చేపలు జాలరి విసిరిన వలలో పడి బ్రతుకును వమ్ము చేసుకున్నాయి.

సంసారమే సరోవరము. ఆయుషే జలము. జీవులే చేపలు. మృత్యువే జాలరి యని గ్రహించాలి. రాబోయే విపత్తును ఊహించి ముందుచూపుతో బ్రతుకును అందముగా తీర్చి దిద్దుకొను పుణ్యాత్ముడే దీర్ఘదర్శి. ఇతనిది సత్వ గుణము. ప్రాప్తకాలజ్ఞుడు మధ్యముడు. వృద్ధాప్యంలో సాధన కుపక్రమించేవాడు. ఇతనిది రజోగుణము. మృత్యుముఖంలో ప్రవేశించినపుడు కూడా జ్ఞానమును పొందలేని దౌర్భాగ్యుడు దీర్ఘసూత్రి. ఇతనిది తమోగుణము.

"విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే'

"దుఃఖించువాడు, కాలయాపన చేయువాడు తామసకర్త యని చెప్పబడి యున్నాడు" అని భగవద్గీత - మోక్షసన్యాస యోగమునందు 28 వ శ్లోకములో చెప్పబడినది.



మనస్సును, ఇంద్రియాలను స్వాధీనం చేసుకోవడమే నిగ్రహం.

పొడవైన త్రాడును కలిగి యున్నవాడు దీర్ఘసూత్రి యన బడినాడు. అతనిని అంతమొందించుటకు యమపాశము అక్కరలేదు. ఆ పాశమేదో తన వద్దనే కలిగి యున్నవాడు దీర్ఘసూత్రి. కనుక సాధకుడెప్పుడూ దీర్ఘదర్శిగానే వ్యవహరించాలి. ధ్యేయరూపుడైన భగవంతుని పొందుటకు ధ్యానమొక సాధనము. ధ్యాన మనగా ఆలోచనలు లేని నిస్సంకల్ప స్థితి. ఈ స్థితి సాధకునికి ఉన్నపళంగా ఎలా వస్తుంది. ప్రారంభదశలో నున్న సాధకుడు ధ్యానస్థితిని పొందేందుకు కొన్ని ప్రత్యేక సాధనల నాచరించాలి. అలవాట్లను కలిగియుండాలి సాధకునికి ప్రథమంగా ఉండవలసిన లక్షణము "విజాతీయ వృత్తి తిరస్కారము", అనగా భగవంతుని కన్నా అన్యమైన ఆలోచనలను నిరాకరించడము అని భావము

విజాతీయ వృత్తి నిరాకరణము జరిగిన తరువాత మనస్సులో సజాతీయ వృత్తి ప్రవాహము నిరాటంకముగా కొనసాగేటట్లు చూసుకోవాలి. దీనికి సంకుచితమైన మనస్సు సరిపోదు. విస్తృతమైన మనస్సు కావాలి. హృదయం విశాలంగా ఉండాలి. మనస్సును సదా ఋజుమార్గంలో ఉంచుకొను సాధకునికి మనస్సు విస్తృతమై ఉంటుంది. నిర్మలంగా పారే నదీప్రవాహమును మనస్సులో భావించాలి. సూర్య తేజస్సులోని ప్రభావమును అంతర్యములో భావించాలి. అందమైన పుష్పవనమును తారల మధ్య భాసిస్తున్న చంద్రుని మనోగగనంలో వీక్షించాలి. ఇలాంటి సాధనలు మనస్సును తేలికపరుస్తూ విస్తృతం చేస్తుంటాయి.నేను చిన్నతనంలో నదీ తీరంలో కూర్చొనే వాడిని. జలప్రవాహము ఎక్కువగా యున్న సందర్భాలలో ఆ ప్రవాహ శబ్దంలో'ఓం" కారమును శ్రవణం చేసేవాడిని. ఒకసారి అలా ఎంతోసేపు ఉండిపోయాను. ఆ తరువాత నా హృదయం పరమశాంతితో పరవశించింది. మనకు గోదావరి నది యున్నది. ఇది నాసిక్‌వద్ద బయలుదేరింది. ఆ తరువాత విస్తృతమైంది. భద్రాచలం వద్ద ఇంకా విశాలమైంది. ధవళేశ్వరం చేరేటప్పటికి మరీ విశాలమైంది. ఆ తరువాత కొంతదూరము మాత్రమే పయనించి సాగరములో కలిసిపోతున్నది. ఈ ఆలోచనను పదేపదే చేయాలి. నాసిక్ వద్ద, భద్రాచలం దగ్గర, ధవళేశ్వరంలో, సముద్రములో సంగమించినపుడు-- ఇలా మళ్ళీ మళ్ళీ చింతన చేస్తుంటే మనస్సు విస్తృతమౌతుంది విస్తృతమైన మనస్సు ధ్యానానికి చక్కగా ఉపకరిస్తుంది.

దేహమును జలముతో, సబ్బుతో శుభ్రం చేసుకొనులాగున, ధ్యానయోగి చక్కని భావ సంపద కలవాడై మనస్సును విస్తృత మొనర్చుకొంటూ, నిర్మల మొనర్చుకొంటూ యుండాలి. సాధకుడు సదా సత్వసంపదతో శోభించువాడై యుండాలి. నీవు నివసించే స్థలము, పూజాగది కూడా నీలో సత్వసంపదను పెంపొందించేదిగా ఉండాలి. అశ్లీల చిత్రాలను, భయంకర రూపాలను గదులలో అలంకరించకూడదు. ధ్యానమునకు పులిచర్మమును ఆసనముగా వాడకూడదు. జింక చర్మమును ఉపయోగించవచ్చు. ఆసనము మీద తెల్లని వస్త్రమును పరచుకోవాలి.

సాధకుడు సాత్వికాహారమునే భుజించాలి. హితమైన ఆహారాన్ని మితముగా భుజించాలి. పాలు, పండ్లులాంటి సాత్వికాహారము రాత్రి పూట తీసుకోవడము శ్రేయస్కరము. చల్లగా మాట్లాడాలి. మనపలుకులు ఇతరులకు హాయి నొసంగాలి. సాధకులైన వారితోనే కలిసి తిరగాలి. ప్రాపంచికమైన ముచ్చట్లు కదిలేచోటుని వెంటనే త్యజించి దూరంగా వెళ్ళాలి. సదా మనస్సులో సద్భావాలే నడచేటట్లు చూసుకోవాలి. అపవిత్రమైన ఆలోచనలను త్యజింపక పోవుటచేతనే నేను ఈ బాధలను అనుభవించవలసి వచ్చినది అని దుఃఖ సమయాలలో చింతన చేయాలి.

భగవత్కృప తోడైనచో అసంభవమనెడి పదానికి జీవితములో చోటేలేదు, అనెడి సత్యాన్ని ప్రగాఢంగా విశ్వసించాలి. ఇవన్నీ సాధకులమైన మనము తయారుచేసుకుంటే ఆ తరువాత ధ్యానం నడుస్తుంది.



పంచిపెట్టినకొద్దీ పెరిగేది మంచితనమొక్కటే.

# ఎవరు నాస్తికులు ?! ఎవరు నిజభక్తులు ?!

జి.యస్.ఆర్.సి.వి. ప్రసాదరావు, I.A.S.

మానవులంతా ఆత్మ స్వరూపులే కాబట్టి అందరూ ఆస్థికులే, నాస్తికులు వుండటానికి అవకాశము లేదు. కాని కొంత మంది మాత్రము మేము నాస్తికులమని చెప్పుకుంటారు. భక్తి లేని జ్ఞానం వ్యక్తిలో అహంకారమును నింపుతుంది. వారికి మానవ శక్తి, మేధస్సు మీద తప్ప మానవాతీత శక్తి మీద నమ్మకము లేదంటారు. కాని వారి జీవిత సరళని గమనిస్తే వారు చేసే కొన్ని పనులు మానవాతీత శక్తిని గుర్తించినట్లే కనబడతాయి. 'దీనిని బట్టి, నాస్తికులమని చెప్పుకునే వారు కొందరు వీధిలో నాస్తికులు - ఇంట్లో ఆస్తికులు, కొందరు మాటల్లో నాస్తికులు - మనస్సులో ఆస్తికులు. కొందరు సభల్లో నాస్తికులు - చేతల్లో ఆస్తికులు తప్ప నిజమైన నాస్తికులు ఎవరూ లేరని తేటతెల్లమవుతుంది. అదే విధముగా భక్తులమని చెప్పుకునే వారంతా నిజభక్తులు కారు. వారిలో మూఢ భక్తులు, కమర్షియల్ భక్తులు, పార్ట్ టైం భక్తులు కూడ వున్నారు. జ్ఞానం లేని మూఢ భక్తి వ్యక్తిలో మూఢాచారమునే మిగిలిస్తుంది. మూఢ భక్తుల కోవలోని వారు కొన్ని పూజా కార్యక్రమములను, కొన్ని పుణ్యక్షేత్ర దర్శనములను, కొన్ని సాంఘికాచారములను గుడ్డిగా పాటిస్తూండటమే భక్తి అనుకొని వారి జీవితాన్ని చుక్కాని లేని నావలా నడుపుకుంటారు. గురువులు అనబడే వారందరు (బోధ గురువులు కాని, బాధ గురువులు కాని) ఎవరు ఏమి చెప్పినా నమ్ముతుంటారు. ఒక్కొక్క సారి మోసానికి గురి కావటం కూడ జరుగుతుంది. కాని వీరు కమర్షియల్ భక్తుల కంటె మెరుగైన సాధకులవుతారు. కమర్షియల్ భక్తులు భగవదారాధనను, లాభ నష్టాల బేరీజు వేసుకొని వ్యాపార సరళిలో చేస్తుంటారు. భక్తి తమకు ధనము, పదవి, కీర్తి సమకూర్చుతుందని కాని, లేక తాము తెలిసి చేస్తున్న పాపాలను పరిహారం చేస్తుందని కాని భ్రమిస్తుంటారు. ఈ కోవకు చెందిన భక్తులు నేడు ఎక్కువగుతుండ బట్టి గాబోలు దేవాలయముల భజన మందిరముల సంఖ్య పెరుగుతున్నను, వాటిలో రద్దీ పెరుగుతున్నను సమాజములో మానవతా విలువలు దిగజారి పాపుల సంఖ్య పెరుగుచున్నది. పార్ట్ టైం భక్తులు పూజాసమయములోను, భజన సమయములోను, కొన్ని యితర సమయములలోను తప్ప క్షణ క్షణము ప్రతి దినము తమ ఆలోచన, మాట, చేతలలో ఆధ్యాత్మికతను ప్రసరింప చేయలేక పోతారు. వారి ఆలోచనలో గాని, మాటలలో గాని, చేతలలో గాని కొన్ని మార్లు అనాధ్యాత్మికత ప్రవేశిస్తూనే వుంటుంది. ఆధ్యాత్మిక సాధన అనే నిచ్చెనలో ఆఖరి మెట్టు ఎక్కేవరకు నిజ భక్తులందరి పరిస్థితి, కొంచెం తర తమ భేదాలు తప్ప, యిలాగే వుటుంది కాని వారికి భక్తి జీవన సరళిలో అంతర్భాగం. భగవదనుగ్రహము ఉత్తమమైన ఆధ్యాత్మిక సాధనా మార్గంలో పయనింప చేసి, కర్మఫలమైన జీవితంలోని ఆనందాన్ని తృప్తితోను, విషాదాన్ని శాంతితోను, అనుభవించేటట్లు మాత్రం తెలుసు. అంతేగాని భగవద్భక్తి జీవితంలోని విషాదాన్ని తొలగించి వినోదాన్ని కలిగిస్తుందని భ్రాంతి పడరు నిజ భక్తులు.

జీవికి, జనన మరణ చక్ర బంధం నుండి విముక్తి పొంది శాశ్వతానందము పొందే వరకు ఉత్తమమైన ఆధ్యాత్మిక సాధనా మార్గమే శరణ్యం. ఆ మార్గంలో పయనించేందుకు దోహద పడునవే భజన - పూజాది కార్యక్రమములు, ఆశ్రమ - పుణ్యక్షేత్రాది దర్శనములు తప్ప, మనిషికి ధనము పదవి, కీర్తి తెచ్చిపెట్టే సాధనాలు మాత్రం కావు. భగవద్భక్తిని, సరియైన అవగాహనతో, జీవితంలో అంతర్భాగంగా మలచుకొని తరిద్దాం.



ఆడవారికి మానము, మగవారికి అవమానము ప్రాణముతో సమానము.

# ధర్మచక్ర ప్రవర్తన

పరిచయ కర్త డా. చలసాని సుబ్బారావు.

మతం అనేది మానవుని మంచి కొరకు, అభివృద్ధి కొరకే పుడుతుంది గాని అది తన ఉనికిని కాపాడుకొనవలెననే సహజ జీవ లక్షణంతో రాగద్వేషాలకు లోనవుతూంటుంది. గర్హించవలసిన విషయమేమంటే కొన్ని మతాలు ఆ సహజ లక్షణాన్నతిక్రమించి మానవత్వానికి బదులు దానవత్వానికే ఆశ్రయాలవుతూంటాయి. అయితే అటువంటి రాక్షసత్వాన్నంటక మానవునిలో అహింసాయుతమైన సౌజన్యాన్ని, త్యాగనిరతిని, జీవకారుణ్యభావాన్ని ప్రబోధించిన మహనీయుడు గౌతమబుద్ధుడు. ఆయన భగవంతునితో ప్రమేయం లేకుండానే పూర్తి మానవీయ స్పృహతో భవ్యత్వాన్ని, దివ్యత్వాన్ని సాధించిన పుణ్యశీలి. బౌద్ధం వైదికానికి భిన్నమైనది కాదను విషయం మన మిచ్చట గమనించాలి. అది సనాతన వైదికానికొక కాంతి కిరీటం. బౌద్ధం ప్రబోధించిన అనేక అంశాలకు వైదిక మతంలో ఆధారాలున్నాయి. అది వైదిక హిందూ మతానికొక రిఫార్మేషన్. బౌద్ధం లోని కర్మపరిపాకం, జన్మమరణావర్తనం, పునర్జన్మ, స్వర్గపాతాళములు, ఇంద్రాది దేవతలు, యముడు మొదలగు అనేకాంశలు వైదికమతంలోనివే. ఒక్క బౌద్ధమే కాదు. యీ భారతీయ గడ్డపై ఆవిర్భవించిన జైన, సిక్కుమతం, కబీరు మార్గం, బ్రహ్మసమాజం, ఆర్య సమాజం, దివ్యజ్ఞాన సమాజం మొదలగునవన్నీ వైదిక ధర్మ ప్రభావితాలేననడం సత్యదూరం కాదు గదా. అయితే సర్వత్రా నిండినదై నిత్య సత్యాత్మకమైన పరబ్రహ్మ పదార్థాన్ని మాత్రం బౌద్ధం అంగీకరించలేదు. యజ్ఞ యాగాది క్రతువ్యవస్థ, చాతుర్వర్ణ వ్యవస్థ, అను వాటిని మినహాయించి బౌద్ధం వైదికాన్నతిక్రమించలేదనే చెప్పాలి. గృహస్థాశ్రమ ధర్మాల విషయంలో కూడ బౌద్ధం వైదికానికి భిన్నం కాదు. పోతే ఒక్క విషయంలో మాత్రం రెండు బలంగా భేదించాయనిపిస్తుంది. అది - వైదిక ధర్మం అధర్మాన్ని సహించవలదంటుంది. న్యాయం కొరకు ప్రతీకార చర్య తప్పు కాదంటుంది. బౌద్ధం మాత్రం అధర్మాన్ని సైతం సహించమంటుంది ప్రతీకార చర్య ఎట్టి స్థితిలోను పనికిరాదంటుంది. ఈ గ్రంధ రచయిత శ్రీ జి. వి. సుబ్బయ్యగారు ఈ చిన్న పుస్తకంలో బౌద్ధంలోని ప్రధానాంశాలైన చతుర్విధ ఆర్యసత్యాలను, వాటితో పాటు వాటి కంతర్గతాలుగా ప్రసిద్ధి నొందిన ప్రతీత్య సముత్పాదం, మధ్యమ ప్రతిపదా, అష్టాంగిక ధర్మమార్గం, త్రిరత్నాలు మొదలగు ధర్మ సూత్రాలను సులభశైలిలో వివరించారు. 5 ప్రకరణాలు, 46 పుటలు గల ఈ చిరు పుస్తకాన్ని శ్రద్ధగా పఠిస్తే ఇప్పటి తరం వారికి మహోదాత్తమైన బౌద్ధాన్ని గురించిన ప్రాథమిక పరిజ్ఞానం తప్పక కలుగుతుంది. సదాశయాలు కరువై హింస, దౌర్జన్యం, దురహం, మోసం, నీతి బాహ్యత, భోగలాలస అను వినాశక పోకడలు బలంగా పెరిగి, అసలు మత మంటేనే అదొక దానవ సంస్కారమనుకొని భయపడుతున్న నేటి సంఘానికి యిటువంటి మానవతా విలువలు గలిగిన గ్రంధాలు మతమంటే 'క్రమశిక్షణతో కూడిన నిర్మాణాత్మకమైన సంస్కార శాస్త్రం' అను సదవగాహన కలిగిస్తుంది సుప్రసిద్ధ పండితులు, మానవతావాది డా. సంజీవదేవ్ గారి విలువైన పీఠిక 'బోధి' యీ పుస్తక పఠనాన్ని మరింత సులభగ్రాహ్యం చేసింది. మానవతా విలువలను గౌరవిస్తున్న వారందరు తప్పక చదువ వలసిన గ్రంథమిది.

రచయిత : జి.వి.సుబ్బయ్య   పుటలు 42+15 : రు.10
ప్రతులకు : తెలుగు విద్యార్థి ప్రచురణలు, బందరు.



ముక్తి నిచ్చేది ధ్యానము, తృప్తినిచ్చేది త్యాగము.

శ్రీవాణి శత సంచికకు మా శుభాకాంక్షలు

స్థాపితం : 1981

ఫోన్స్ : స్కూలు 2081
రెసిడెన్స్ 3674

# అమరేశ్వరీ విద్యానికేతన్

( ఇంగ్లీషు మీడియం హైస్కూలు )

రుస్తుంబాద, బ్రాంచి : భాస్కరపురం

**మచిలీపట్నం - 521 001**

L.K.G. నుండి 10 వ తరగతి వరకు ఉత్తమ శిక్షణతోపాటు ప్రత్యేక శ్రద్ధ తీసుకొనబడును.

ప్రిన్సిపాల్
B. Hanumantha Rao
M Com., M.A., M. Ed.,

---

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు

Phones : 73818, 76878

# ఇమేజ్ ఆయుర్వేదిక్ హాస్పిటల్

అనుభవంగల సీనియర్ క్వాలిఫైడ్ డాక్టరుల సేవ విజయవాడ పౌరులకు అందించుటకు ఈ హాస్పిటల్ ఏర్పాటు చేయటమైనది.

**డా॥ డి. యల్. నారాయణ,** బి. కాం. డి ఎ యం
(మెంబర్ సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసన్)

**డా॥ యం. కుటుంబరావు,** యం. డి. (ఆయు)
(రిటైర్డ్ సూపరింటెండెంట్ ప్రభుత్వ ఆయుర్వేద వైద్యశాల)

**డా॥ కుమారి ఎ. ఎస్. బి. జి. లావణ్య,** B. A. M. S.
వైద్యులుకూడ వీరి సలహాలు పొందవచ్చును.

"శ్రీవాణి" శత సంచిక సందర్భముగా మీకివే మా శుభాకాంక్షలు



వేసిన దారి వెంట వెళ్ళడం సులభం కాని

విజయానికి నూతనదారులే రాచబాటలు!

Phone : 748
749

# విజ్ఞాన్
# రెసిడెన్షియల్ కాలేజ్

**మెయిన్‌రోడ్, ఉయ్యూరు - 521 165**

( రెసిడెన్షియల్ - సెమీ రెసిడెన్షియల్ )

* మొదటి సంవత్సరంలోనే జూనియర్ ఇంటర్‌లో 90% ఫలితాలు సాధించిన సంస్థ.
* సప్లిమెంటరీ, 3 rd క్లాసు విద్యార్థులను ఛాలెంజ్‌గా తీసుకొని ఫస్ట్ క్లాసు ఫలితాలు సాధించిన సంస్థ.
* ఇంటర్ M. P. C., Bi. P. C., M.E.C., C.E.C. గ్రూపులు ఇంగ్లీష్ & తెలుగు మీడియంలలో బోధన.

డైరెక్టర్
P. B. రాజేంద్రప్రసాద్




# శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయం - బందరు

కర్మ భూమిగా, ధర్మభూమిగా, తపోభూమిగా మాన్యభూమిగా ఖ్యాతి గాంచిన ఈ భారత భూతలంపై సంస్కృతీ కేంద్రాలుగా వెలుగులు విరజిమ్ముతున్నాయి ... దేవాలయాలు

ధర్మ ప్రచారానికి భక్తి భావ ప్రచారానికి, ప్రజల్ని నీతిపథగాముల్ని చేయడానికి ఎంతో ఉపయోగ పడుతున్న భారతదేశ దేవాలయాల్లో ఆంధ్రరాష్ట్రం కృష్ణాజిల్లాలోని మచిలీపట్నం రాబర్టుసన్‌పేటలో వందేళ్ళనాడు వెలసిన శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవాలయం ఒకటి.

దానవత్వాన్ని అణగద్రొక్కి మానవత్వానికి హారతి పట్టి ధర్మవిస్తరణకోసం ఇహలోకంలోకి అడుగు పెట్టిన శ్రీ మహారాజ్ఞి ... శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి ఆస్తిక ప్రపంచమంతా ఈ శ్రీమాతను పవిత్ర భావంతో, నిష్కల్మష హృదయముతో కొలిచేందుకు నాటి పుర ప్రముఖులు శ్రీ పాలకుర్తి శ్రీరాములుగారు దీనికి శంఖుస్థాపన చేసినారు. నాటి ప్రధాన అర్చకులు శ్రీ అంబా వెంకటప్పయ్యగారు, ధర్మకర్తలు శ్రీ ఉదత్తు వెంకన్నగారు, శ్రీ అన్నం నరసింహంగారు ఈ దేవాలయ వైభవాన్ని ఆంధ్ర ఆస్తిక ప్రపంచానికి దగ్గర చేశారు ఆ నాటి నుండి పరిపాలనాదక్షత గల పాలక వర్గం ఎన్నుకొనబడుచు సమర్థవంతముగ నిర్వహింప బడుచున్న ఈ దేవాలయమునకు భక్తిశ్రద్ధలతో ప్రతి రోజు వందలాది భక్తులు విచ్చేసి, అమ్మవారివిదర్శించి శ్రీ దేవీ అనుగ్రహములను పొందుచున్నారు

దేవాలయమున శ్రీ దేవీశరన్నవరాత్ర మహోత్సవములతి వైభవోపేతముగ జరుపబడును మరియు ఆధ్యాత్మిక, సాంస్కృతిక సభలు, శుభకార్యములు జరుపబడుచున్నవి

ఇట్లు

**పాలకవర్గం**

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు

నూతన ప్రారంభం

## శ్రీ శారదా రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల (బాలికలకు)

సిరినగర్ - విద్యాలయంవద్ద - ఉయ్యూరు

ఇంటర్ ఆర్ట్స్ & కామర్స్ గ్రూపులకు మాత్రమే
ఇంగ్లీష్, తెలుగు మీడియములలో బోధన

ఇన్‌ఛార్జి ప్రిన్సిపాల్ : డాక్టర్ వి. శ్యామల, M. A., Ph. D.

నూతన ప్రారంభం

## శ్రీ శారదా రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల (బాలురకు)

వాటర్ టాంకువద్ద - సిరినగర్ - ఉయ్యూరు

ఇంటర్, ఆర్ట్స్ & కామర్స్ గ్రూపులకు మాత్రమే
ఇంగ్లీషు, తెలుగు మీడియములలో బోధన.

ఇన్‌ఛార్జి ప్రిన్సిపాల్
డాక్టర్ డి. వి. సుబ్బారావు
M.A., M.Ed., Ph. D., D.E.T.. (Bermingham)

## శ్రీ శారదా నికేతన్ (ట్యుటోరియల్ కాలేజి)

( Estd. : 1974 సం॥ ) ఫోన్ : 518

విద్యాలయం వీధి - సిరినగర్ - ఉయ్యూరు

డిగ్రీ, డిగ్రీ ఎంట్రన్స్, మరియు ఇంటర్ తరగతులకు ప్రత్యేక బోధన.

ప్రిన్సిపాల్ : బొల్ల. జి. భాస్కరరావు, M.A., M.Ed.








# ప్రజలకే ప్రాధాన్యం

ప్రజాకాంక్షలకు, వారి ఆశయాలకు ప్రభుత్వ విధానాలలోను, ప్రగతి పథకాల రూపకల్పనలోను ప్రాధాన్యతను యిస్తూ, చైతన్యశాలి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డిగారి సారథ్యంలో రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ సర్వతోముఖ వికాసానికి కృత నిశ్చయంతో కృషిచేస్తుంది.

## అభ్యున్నతికి మచ్చుతునకలు

* వ్యవసాయం, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు వంటి కీలకరంగాలపట్ల శ్రద్ధాసక్తులు.
* జేగురుపాడు వద్ద ప్రయివేటు రంగంలో 400 మె. వా. సహజ వాయు ఆధారం విద్యుత్ కేంద్రానికి శంకుస్థాపన.
* విద్యుత్పాదక అవకాశాలను మెరుగుపరిచే లక్ష్యంతో, బొంబేహై నుండి దక్షిణాదికి గ్యాస్ పైపు లైను వేసేందుకు కేంద్రంగా సూత్రప్రాయంగా ఆమోదం.
* కాకినాడలో 400 మె.వా., విశాఖపట్టణంలోను, నెల్లూరు జిల్లా, కృష్ణపట్టణంలోను ఒక్కొక్కటి 1000 మె.వా. శక్తిసంతమైన విద్యుత్ కేంద్రాల స్థాపనకు నిర్ణయం.
* సుమారు 2 లక్షల ఎ. ఆయుకట్టుకు నీరందించే రూ. 260 కోట్లు నరసింహారావు సాగర్ రిజర్వాయరుకు కర్నూలు జిల్లా గోరకల్లులో శంకుస్థాపన.
* తెలుగుగంగ 1వ దశ పనులకు యీ సంవత్సరం రూ. 60 కోట్లు కేటాయించి సత్వరమే పూర్తిచేసేందుకు కృత నిశ్చయం.
* 1993-94 "చిన్నతరహా నీటిపారుదల సంవత్సరం" గా పాటిస్తూ, చిన్న రైతులకు పెద్ద యెత్తున చేయూత.
* దేశంలోకెల్లా అతి తక్కువ ధరలకు ఎరువుల విక్రయం. డి.ఎ.పి. బస్తా ధరలో రూ 100 రాయితీ మ్యూరేట్ ఆఫ్ పొటాష్ బస్తా ధరలో రూ. 80 రాయితీ.

**"అభివృద్ధి బాటలో అంతా కలిసి పయనిద్దాం"**

కమీషనరు, సమాచార పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్

శ్రీవాణి శతసంచిక మహోత్సవాలకు

మా శుభాకాంక్షలు



# విశ్వకవి

# రెసిడెన్షియల్ పబ్లిక్ స్కూల్

**జువ్వలపాలెంరోడ్, భీమవరం - 534 004**

**ప. గో. జిల్లా**

Phones : 2243, 2348

L. K. G. నుండి 5 వ తరగతి (ఇంగ్లీషు మీడియం)

బాలబాలికలకు ప్రత్యేక హాస్టల్ వసతి కలదు.

మృదంగం, సంగీతం, వీణ, నాట్యంతోపాటు బాలబాలికలకు కుట్టుపనులు,

అల్లికలు, అలంకరణలలో ప్రత్యేక శిక్షణ ఇవ్వబడును.

**ఏప్రియల్ 9 వ తేదీ నుండి అడ్మిషన్లు**

డైరక్టర్ : **పొట్లూరి రఘుబాబు, బి. ఇ.**

శ్రీవాణి శత సంచికకు శుభాకాంక్షలు

# విశిష్టమైన రెండు క్రొత్త పాలసీలు

మీ కోసం

## జీవన్ సురభి

* మనీబ్యాక్ ప్రయోజనాలనుమరింతగా మెరుగుపరచిన పథకం !
* వెంట వెంటనే అందివచ్చే సర్వైవల్ బెనిఫిట్లు -
* పోను పోను పెరిగే రిస్క్ కవర్ -
* ప్రీమియం చెల్లించే కాలం కుదింపు -

మీ ముద్దులపాప కోసం

## జీవన్ సుకన్య

* ఏడేళ్ళ నుంచి యాభయి ఏళ్ళదాకా భీమా రక్షణ -
* ఇరవై యేళ్ళకే పూర్తి పిట్టా మొత్తం చెల్లింపు -
  ఆపై భీమా రక్షణ కొనసాగింపు -
  టర్మ్ పూర్తికాగానే బోనస్ చెల్లింపు-

అంతే కాదు

* వివాహానంతరం భర్తకు కూడా భీమా రక్షణ -

" యోగక్షేమం వహామ్యహం "



## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

మచిలీపట్నం డివిజను

శ్రీశివాజి శత సంచిక ఆవిష్కరణ సందర్భమున
మా శుభాకాంక్షలు.



# శ్రీ కృష్ణవేణి విద్యా సంస్థలు
## విజయవాడ

శ్రీ కృష్ణవేణి ఇంజనీర్స్ కాలేజి
పడమట, విజయవాడ

శ్రీ కృష్ణవేణి రెసిడెన్షియల్ కాలేజి
కె. సి. పి. కాలని, విజయవాడ–7

శ్రీ కృష్ణవేణి రెసిడెన్షియల్ స్కూల్
కె. సి. పి. కాలని, విజయవాడ–7

శ్రీ కృష్ణవేణి పబ్లిక్ స్కూల్
పోరంకి, విజయవాడ

శ్రీ కృష్ణవేణి సైన్స్ కాలేజి
పటమటలంక, బందరురోడ్, విజయవాడ–10

కరెస్పాండెంట్
బిగురుపాటి వరప్రసాద్ B. Tech, M. E.

# శాశ్వత జీవిత సభ్యులు



శ్రీ దారా వెంకటరత్నం (రాజా)
జెమిని కెమికల్స్
మచిలీపట్నం



Sri L K.V.P. Kutumba Rao
M.Sc.
Bangalore



Dr. B. Kesava Krishna
Brindavan Nursing Home
Machilipatnam



Sri K. Srinivasa Rao
Correspondent
Nava Jeevan Public School
Machilipatnam



శ్రీమతి దేవినేని రాజ్యలక్ష్మి
w/o శ్రీ వీరాంజనేయులు
మలక్ పేట, హైదరాబాద్



Sri G. Mrutyumjaya Rao
Lecturer
Machilipatnam





శ్రీ నా[illegible]య్య
శ్రీమతి కమలా జగన్ మోహినీదేవి
పెదపులివర్రు, గుంటూరు జిల్లా

# కృతజ్ఞతలు

శ్రీవాణి శత సంచికను సర్వాంగసుందరంగా తీర్చిదిద్దటానికి ఎందరో మహానుభావులు తమ వంతు సహకారమును అందించినారు. కొందరు దివ్య పురుషులు ఆశీఃపూర్వక దివ్యసందేశములను అందించుతే మరి కొంతమంది రచయితలు సందేశాత్మ వ్యాసములను అందించినారు. కొంతమంది ఉదారవదాన్యులు అడ్వర్‌టైజ్ మెంట్సు ద్వారా సహకారం అందించుతే, మరికొంతమంది జీవితసభ్యులుగా, పోషకులుగా సహకారం అందించినారు. కొంతమంది సహృదయులు క్రొత్త చందాలను చేర్పించి పంపినారు. మచిలీపట్నం పుర ప్రముఖులు ఆహ్వాన సంఘముగా ఏర్పడి శత సంచిక మహోత్సవములను విజయవంతం చేయటానికి సహకారం అందించుతే ఈ ప్రత్యేక సంచికను తీసుకొని రావటానికి అహర్నిశలు కృషి సల్పినారు శ్రీవాణి కార్మికులు. బృందావన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ (బందరు), విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ (విజయవాడ) వారు ప్రత్యేక సంచికను సర్వాంగసుందరంగా తీర్చిదిద్ది సకాలంలో అందించినారు. కవరు పేజీ చిత్రమును అత్యంత ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు ఆర్టిస్టు బాచి (విజయవాడ) శ్రీవాణి ద్వారా భగవాన్ బాబావారి ఫోటోలను అందించటానికి ముందుకు వచ్చారు శ్రీ వి.వి.యస్ రామశర్మగారు ( L. I. C. Marketing Manager, Rajkot ). ఈ మహాయజ్ఞములో భాగస్వాములైన వారందరికీ నా కృతజ్ఞతాభివందనములు.

శ్రీవాణి పాఠకులకు గతంలో అందించబడిన వార్షిక ప్రత్యేక సంచికలన్నింటిలోనూ శ్రీ(లక్ష్మి) కన్నావాణి (సరస్వతి) దే పైచేయిగా ఉన్నది. ఈ ప్రత్యేక సంచికలో మాత్రం శ్రీ (లక్ష్మి) దే పైచేయి అయింది. శత సంచిక పని ప్రారంభించే ముందు వాణి (సరస్వతి) దే పైచేయిగా వుండాలని నిర్ణయించుకున్నాను. శత సంచిక కాబట్టి వంద పేజీలు అడ్వర్‌టైజ్‌మెంట్సు సంపాదించాలని, 104 పేజీలు వ్యాసములలో నింపాలని నిర్ణయించుకొని ముందుగా వ్యాసములను ముద్రించినాను. అడ్వర్‌టైజ్‌మెంట్సు మన చేతుల్లో ఉండవు గదా ! అవి వచ్చినప్పుడల్లా ముద్రిస్తూవచ్చాను. ప్రారంభంలో వాటి వేగం తాబేలు నడకలాగే ఉన్నప్పటికీ (కుందేలుమీద తాబేలే గెలిచింది గదా !) ఆఖరిలో ఊహించని విధంగా పుంజుకొన్నది వేగం. అందువలన శత సంచికలో శ్రీ(లక్ష్మి) దే పైచేయి అయింది.

శ్రీవాణి పత్రికను నడపటానికి అవసరమైన ఆర్థికశక్తి నాకు లేదు. అయినప్పటికీ సాహసించాను. ఈనాడు శత సంచిక స్థాయికి ఎదిగింది. దేశవిదేశాల ప్రముఖుల ప్రశంసలనందుకుంటున్నది దీనికి కారణం ? ఏదో ఒక అదృశ్యమైన దివ్యశక్తి నా వెంట, జంట, ఇంట నడిపిస్తున్నదని నా నమ్మకం, విశ్వాసం. ఆ దివ్యశక్తే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. వారికి ప్రణమిల్లి నమస్కరిస్తూ, శత సంచిక మహోత్సవానికి చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

భవదీయులు

కొమరగిరి కృష్ణమోహనరావు